# ధర్మజ్యోతి.



గ్రంథకర్త.
ఆర్షధర్మ ప్రచారకులును, కోదండ రామశతకాది గ్రంథ కర్తలు.
శ్రీయుత పాణ్యాం లక్ష్మీ నరసింహయ్యగారు.
ఉయ్యాలవాడ.
(కర్నూలు జిల్లా.)

1952.



క్రయము రు. 2-0-0

# ధర్మజ్యోతి

## విషయ సూచిక

—: శ్రీ గురుభ్యో నమః :—

# విజ్ఞప్తి



శ్లో॥ శ్రీపరబ్రహ్మణే సాధుశ్రీనివాసాఖ్యశర్మణే।
చిదాత్మనే నమస్తస్మై స్వధర్మవేధ్మసాక్షిణే॥

నా హృదయమున జిజ్ఞాసతత్ప్రాయమున నే ధర్మమీమాంసయు ధర్మతత్పరతయు మొలకలెత్తినవి. ప్రతిచిన్నవిషయము నిది శాస్త్రీయమగునా? కాదా? యనివివేచించుటయు. విజ్ఞులగు పెద్దలనడిగి తెలుసుకొనుటయు ధర్మమని తెలిసినదానిని యథాశక్తి నాచరించుటయు. స్వభావదోషదగ్ధము వయస్సుపెరిగినకొలది నదియు వృద్ధిగాఁ జొచ్చెను.

ఒకనాఁడు రాత్రి ప్రచండవేగమున లోకమునందిపుడు జరుగుచున్న సాంఘికరాజకీయ ధర్మవిప్లవ గతులు దలంపునకువచ్చి, భయవిషాదపరితాపములలముకొని ప్రొద్దుపోవునంతకు నిదురబట్టదయ్యెను. చివరకెట్టులనోనింక నిదురించితిని. ప్రభాతమయ్యెను ధ్యాననిమగ్నుఁడనైయుండ నజ్ఞానమేఘావృతమైన నాహృదయాకాశమున విద్యుల్లేఖవలె నదేలనో తలవనిదలంపున నొక క్రొత్త భావము స్ఫురించెను? మఱియాభావము లోకమునకు క్రొత్తదియో కాదోగాని; నాకుమాత్రమది క్రొత్తదియై నామనశ్శాంతికై భగవానుఁడు ప్రసాదించిన ప్రేరణమేయని దోఁచినది.

ఆ భావ మిది; "చతుర్విధములగు గుణ—కర్మ— స్వభావములతో నొప్పుచున్న చతుర్యుగములు నొక్కొక్కటియు,

"టాకీఫిలుంరీల్,, వలె దానియందు క్రమబద్ధమైయుండిన నామ రూపాదికచరిత్రను తనభ్రమణముచే తు. చ. దప్పకుండా ప్రదర్శించుచు నొకయుగము వెంట నొకయుగమెప్పటి కిట్లులనే పరిభ్రమించుచుండు టయే స్వభావము."

ఏయుగమునం దేకాలమున నేస్థలమునం దేనామరూపములుగల భూతము లెట్లెట్లు వ్యవహరించునో; ఆయుగమెప్పుడువచ్చినను ఆకాలమున నాస్థలమునందాయా నామరూపములుగల భూతము లట్లట్ల నేవ్యవహరించుచుండుననియే దాని తాత్పర్యము.

నాకీభావమెంతయో మనశ్శాంతి బ్రసాదించినది? మఱియు నా గ్రంధాన్వేషణమున నిందులకెన్నియో యుపపత్తులును లభించెను. అందులో ముఖ్యములు:—

* "ధాతాయధాపూర్వ మకల్పయత్" అనెడి శృతియును.
* భగవద్గీతయందలి (2–12) (2–28) (4–5) (8–16) (8–19) (9–7) (9–8) శ్లోకములును.
* జ్ఞానవాసిష్ఠమున భుసుండోపాఖ్యానము.
* పద్మపురాణమున ఇంద్రసుబ్రతోపాఖ్యానము.
* భవిష్యపురాణమున ప్రతిసర్గపర్వము.
* స్కాందపురాణమున పూర్వకలియుగవర్ణనము.
* నాడీగ్రంథములలోని జాతకములును.
* సంస్కృతమహాభారతాశ్వమేధపర్వము.

ఇంకనుయెన్నియో యాధారములు గాన్పించినవి. విస్తర మగునని విరమించితిని) నా యీభావమును సాహిత్యపత్రికలమూల మున లోకమునకెఱుకపఱుపదలచి తొలుత సంగ్రహమగువ్యాసమును రచించితిని, గాని పత్రికలందు ప్రకటింపబడు వ్యాసములు వార్తలు "బౌద్ధుల యాత్మలవలె క్షణికములేయగుననియెంచి, మఱియు నాయెఱింగిన కొన్నిధర్మములను పొందుబఱచి, యీపుస్తకమును రచించితిని.

పిదప నొకప్పుడు డోన్ తాలూక వెలుదుర్తి గ్రామము నందుండిన నా సోదరకుటుంబమును జూడనగుట ఘటిల్లెను. అచట నాగ్రామవాస్తవ్యులగు శ్రీ పెరుమాళ్ ఎల్ల రామయ్య శ్రేష్ఠిగారికి పౌరాణికగోష్ఠిలో నీ ధర్మజ్యోతిని వినిపింప; నతడు దీనిని ముద్రణము నొనరింప హర్షముతో నంగీకరించెను. అప్పుడ కర్నూలు శ్రీ హింద్ ప్రెస్ వారికి ముద్రణమునకిచ్చుటయ్యెను. కర్నూలు బ్రహ్మశ్రీ. చెన్నుభొట్ల వెంకటకృష్ణశర్మగారీముద్రణమున కెంతయో సహాయమొనరించిరి. వారికెంతయుగృతజ్ఞుడను.

ముఖ్యముగ నా యీధర్మజ్యోతికి జక్కనిపరిచయవాక్యము నొసంగి మన్నించిన సుహృదయములు, సువిశ్రుతనామధేయులు, శివ భారత గ్రంథకర్తలు బాల్యమిత్రులు ప్రొద్దుటూరువాస్తవ్యులునగు బ్రహ్మశ్రీ. గడియారము వెంకట శేషశాస్త్రీగారికి నా హృదయ పూర్వక ధన్యవాదములు సమర్పించుచున్నాను.

కృతిసువర్ణపరీక్షకు పండితహృదయఫలకములే నికషోపలములు. గాన పండితలోకమెంతవెల నీకృతి కొసంగునో కాలమే తెలుపగలదు. గుణగ్రహణపారీణులగు మనీషులిందేమైన గుణలేశమున్నచో గైకొని, దోషముల బరిహరింతురని ప్రార్థించుచున్నాను. నాకిట్టిప్రేరణము నొసంగి నా మూలమున నిట్టికార్యమును సాగించిన భగవానునకు నాశతసహస్రవ మోవాకములు.

—* శ్రీ గురుశ్శరణం *—

ఇట్లు, విన్నవించు సుధీజనవిధేయుడు,

ఫాణ్యం లక్ష్మీనరసింహాయ్య.

ఉయ్యాలవాడ గ్రామం

నందన కార్తీక శుక్ల త్రయోదశి

తేది. 31—10—1952.

"టాకీఫిలుంరీల్,, వలె దానియందు క్రమబద్ధమైయుండెడు నామ రూపాదికచరిత్రను తనభ్రమణముచే తు.చ. దప్పకుండా ప్రదర్శించుచు నొకయుగము వెంట నొకయుగ మెప్పటి కిట్టులనే పరిభ్రమించుచుండు టయే స్వభావము."

ఏయుగమునం దేకాలమున నేస్థలమునం దేనామరూపములుగల భూతము లెట్లెట్లు వ్యవహరించునో; ఆయుగ మెపుడువచ్చినను ఆకాలమున నాస్థలమునందాయా నామరూపములుగల భూతము లట్లట్ల నేవ్యవహరించుచుండుననియే దాని తాత్పర్యము.

నాకీభావ మెంతయో మనశ్శాంతి బ్రసాదించినది? మఱియు నా గ్రంథాన్వేషణమున నిందులకెన్నియో యుపపత్తులును లభించెను. అందులో ముఖ్యములు:—

* "ధాతాయథాపూర్వ మకల్పయత్" అనెడి శ్రుతియును.
* భగవద్గీతయందలి (2-12) (2-28) (4-5) (8-16) (8-19) (9-7) (9-8) శ్లోకములును.
* జ్ఞానవాసిష్ఠమున భుసుండోపాఖ్యానము.
* పద్మపురాణమున ఇంద్రసుద్రవతోపాఖ్యానము.
* భవిష్యపురాణమున ప్రతిసర్గపర్వము.
* స్కాందపురాణమున పూర్వకలియుగవర్ణనము.
* నాడీగ్రంథములలోని జాతకములును.
* సంస్కృతమహాభారతాశ్వమేధపర్వము.

ఇంకనునెన్నియో యాధారములు గాన్పించినవి. (విస్తరమగునని విరమించితిని) నా యీభావమును సాహిత్యపత్రికలమూలమున లోకమునకెఱుకపఱుపదలచి తొలుత సంగ్రహమగువ్యాసమును రచించితిని, గాని పత్రికలందు ప్రకటింపబడు వ్యాసములు వార్తలు "బౌద్ధుల యాత్మలవలె క్షణికములేయగుననియెంచి, మఱియు నాయెఱింగిన కొన్నిధర్మములను పొందుపఱచి, యీపుస్తకమును రచించితిని.

పిదప నొకప్పుడు డోన్ తాలూక వెలుదుర్తి గ్రామము నందుండిన నా సోదరకుటుంబమును జూడనగుట ఘటిల్లెను. అచట నాగ్రామవాస్తవ్యులగు శ్రీపెరుమాళ్ ఎల్ల రామయ్య శ్రేష్ఠిగారికి పౌరాణికగోష్ఠిలో నీ ధర్మజ్యోతిని వినిపింప; నతడు దీనిని ముద్రణము నొనరింప హర్షముతో నంగీకరించెను. అప్పుడ కర్నూలు శ్రీ హింద్ ప్రెస్ వారికి ముద్రణమునకిచ్చుటయ్యెను. కర్నూలు బ్రహ్మశ్రీ. చెన్నుభొట్ల వెంకటకృష్ణశర్మగారీముద్రణమున కెంతయో సహాయమొనరించిరి. వారికెంతయు గృతజ్ఞుడను.

ముఖ్యముగ నా యీధర్మజ్యోతికి జక్కనిపరిచయవాక్యము నొసంగి మన్నించిన సుహృదయములు, సువిశ్రుతనామధేయులు, శివ భారత గ్రంథకర్తలు బాల్యమిత్రులు ప్రొద్దుటూరువాస్తవ్యులునగు బ్రహ్మశ్రీ. గడియారము వెంకట శేషశాస్త్రిగారికి నా హృదయ పూర్వక ధన్యవాదములు సమర్పించుచున్నాను.

కృతిసువర్ణపరీక్షకు పండితహృదయఫలకములే నికషోపలములు. గాన పండితలోకమెంతవెల నీకృతి కొసంగునో కాలమే తెలుపగలదు. గుణగ్రహణ పారీణులగు మనీషులిందేమైన గుణలేశమున్నచో గ్రహించి, దోషముల బరిహరింతురని ప్రార్థించుచున్నాను. నాకిట్టిప్రేరణము నొసంగి నా మూలమున నిట్టికార్యమును సాగించిన భగవానునకు నాశతసహస్రన మోవాకములు.

—* శ్రీ గురుశ్శరణం *—

ఇట్లు, విన్నవించు సుధీజనవిధేయుడు,

పాణ్యాం లక్ష్మీనరసింహాయ్య.

ఉయ్యాలవాడ గ్రామం

నందన కార్తీక శుక్ల త్రయోదశి

తేది. 31—10—1952.



# "ధర్మ జ్యోతి"

## పరిచయ వాక్యము.



"ధర్మజ్యోతి" యనఁగా ధర్మమను జ్యోతి యనవచ్చును. ధర్మమునకు జ్యోతి యనుటయుఁదగును. స్వయంప్రకాశకమై మానవుల కన్నులు విచ్చి మార్గము చూపించు వెలుఁగని తాత్పర్యము. ఇది యొక యుద్గ్రంధము. సూర్యచంద్ర తారకామండలములు యధాపూర్వముగా వెలుఁగుచున్నను. విశేషించి యీనాఁడు విద్యుద్దీపము లింటింట వీధివీధుల మిఱుమిట్లు గొలుపుచున్నను, మానవ ప్రపంచ మేదో గాఢాంధకారా వృతమైనట్లుగా గ్రహించి. తదుపయోగార్థమీ వాఙ్మయ ప్రచురమైన ధర్మజ్యోతి వెలిగించినాఁ డీగ్రంధకర్త. యీనాఁడు వెలువడుచున్న వివిధవాఙ్మయ రూపములఁ జూచుచున్నపుడీ గ్రంధావిష్కారమున కెంత యావశ్యకత యున్నదో యంతసాహసము కూడాఁ గలదని తోఁపక మానదు. గ్రంథరచన స్వప్రతిభా పాండిత్య ప్రకటనకును, లోకుల తాత్కాలికాభి రుచులఁ దనియించుటకును. దన్మూలక భౌతికార్థ సాధనకుఁ గాక, ఆవశ్యకత గుర్తించి ప్రయోజనము లక్షించి యీశ్వరాదిష్ట విజ్ఞానము స్వవిధి నిర్వహణ కుపయోగించుటగా భావించినపుడే యిట్టిగైర్వాణమైన శాస్త్రానుసంధానము ప్రాతికూల్య ప్రతి ఘటనలతోఁ జేయవలసి వచ్చును. భారతమున నిప్పుడు పొరలు పొరలుగాఁ గ్రమ్మిన చీఁకటి

తెరలు చెదరఁగొట్టి సత్యార్థ దర్శనముతో స్వస్త్యయనము చేకూర్చుటకే యీధర్మజ్యోతి వెలిగించితి ననుచున్నాఁడీ గ్రంథకర్త. కనుకనే యిది సాహసోపేతమైన యుదాత్తధర్మానుష్ఠానమైనది. యిఁక నీవెలుఁగు నుపయోగించుకొనుట లోకము వంతు.

"మానవజీవిత మిప్పుడు భౌతిక దృక్పథము ప్రబలి, ప్రత్యక్షములైన యైహిక భోగములకు భావములకు ననుభూతులకుఁ బ్రాధాన్య మీయబడుచున్నది. ఇది సవ్యము శ్రేయస్కరముగాదు. సత్యము పరమార్థమునైన యాధ్యాత్మిక దృక్పథముతో విశేచించి విధించిన ధర్మానుష్ఠానమే శ్రేయోమార్గము. శాస్త్రానుగతముగా సంప్రదాయ సిద్ధముగా నాధర్మము తెలిసికొనుట కర్తవ్యము" ఈ యీవివేచనతో గ్రంథకర్త యీరచన కుపక్రమించుచున్నాఁడు. వీరి ధర్మమీమాంస చక్కని ప్రజ్ఞతో నుపజ్ఞతో శాస్త్రవాదముతో సంప్రదాయోపపాదనముతో సవిస్తరముగా సమగ్రముగా సాఁగినది. ఆవిశేషము లన్నియుఁ బాఠకులు గ్రంథమునఁ జదువఁగలరు, దాని సంగ్రహ స్వరూపమిట్లు చెప్పవచ్చును.

"సత్యమై చర్మచక్షువుల కగోచరమై సర్వవ్యాపకమైన బ్రహ్మపదార్థ మొకటి గలదు. అది నాణెమున నొకవైపు బొమ్మ— కేవల జ్ఞానరూపము—అనాణెమున రెండవవైపు ప్రవృత్తి మయమైన ధర్మము లిపిముద్రాచిహ్నితము — అది కర్మరూపమైనది. లోక ప్రవృత్తియంతయు నీధర్మముపై నాధారపడినది. ధర్మమనఁగా లోకమును ధరించునది—తిరంపఁ జేయునది. యీపదమునకెన్నో తాత్పర్యార్థములు గలవు. అవన్నియు ప్రకరణ ప్రయోజనములఁ బట్టి సంగతము లగుచుండును, ఆధర్మతత్త్వముఁ దెలియవలయునన్న ముందు సృష్టితత్త్వము నెఱుఁగవలెను. ఎందుకనఁగా, ధర్మతత్త్వవిశేషమంతయు సృష్టితత్త్వము యొక్క బహుముఖవిధాన సంధానము లందే యమరియున్నది. ఆసృష్టితత్త్వ మీక్రమమున నున్నది. మొదటిది బ్రహ్మ, లేక—ఆత్మయను పదార్థము. దాని నుండి పంచ

భూతములు. వాని నుండి ప్రపంచము, ఇది బ్రహ్మాండము దీనివలెనే పిండాండము, పంచభూతములకు సత్వరజస్తమములను మూఁడు గుణములుగలవు పంచీకరణ విధానముతో నివియన్నియుఁగలిసి యిరువది నాలుగు తత్వముల క్షేత్రమై, యిరువదే నవతత్వము క్షేత్రజ్ఞుఁడగును, అతఁడే యీక్షేత్రమును నడుపును. అదియే ధర్మము.

యీభూత సృష్టియందలి గుణకర్మ విభాగవైవిధ్యమును బట్టి చాతుర్వర్ణ్య మేర్పడుచున్నది. ఇది స్వభావజమేగాని కల్పితముగాదు. బ్రహ్మవిష్ణ్వాది దేవతలయందుఁ గూడా నీచాతుర్వర్ణ్యము పోలికలు గలవు. మానవులందుఁ పశుపక్ష్యాది ప్రాణులందు జడపదార్థములందు నీయన్నింటి ప్రవృత్తులందును జాతుర్వర్ణ్య విధానము గలదు. కనుకనే సృష్టియంతయుఁ జాతుర్వర్ణ్యమయమై, తత్తద్గుణ కర్మవిభాగాను గుణవృత్తుల వెంట నడుచుచున్నది. యీపరిస్థితి యీశ్వరుఁడుగానీ మానవుఁడుగానీ కల్పించినది కాదు. అది కేవలము సహజపరిణామ ఫలితము.

యీరహస్య మంతయుఁ దెలియుటకును దదనుగుణము గాననుష్ఠించి తరించుటకును రెండే మార్గములుగలవు. ఒకటి జ్ఞానము—లేక—సాంఖ్యము. రెండవది కర్మము—లేక—యోగము యీసాంఖ్యమే యోగమును గూడా నడుపును. సాంఖ్యము అక్షరసంఖ్యా ప్రచురము వేదమయము. ఆ వేదాధికారము త్రివర్ణములకేగాని నాలుగవ వర్ణమునకు లేదు. అగుట స్వభావసిద్ధమేగాని పక్షపాత ప్రేరితముకాదు. వేదమంత్రముల సృష్టియే విలక్షణమైనది. ఆమంత్రములలోఁ బ్రతియక్షరము ప్రతి స్వరము. ఉచ్చారణక్రమము. అక్షర దేవతలు. వారి రంగులు. మొదలగు సామగ్రియంతయు నలౌకిక భావ ప్రభావ ప్రయోజన సంకలితము. యీవిషయము పరిత్యక్తాను మాన ప్రయోగ పరీక్షితమై సర్వాంగీకృతమగుటయేగాదు వేదాధికారము త్రివర్ణములకే యను నంశమును ధృవపఱచుచున్నది. మానవులలో శరీరకర్మ ప్రధానులు కొందఱు బుద్ధికర్మ ప్రధానులు

కొందఱుగలరు. బుద్ధికర్మ ప్రధానులకే వేదాధికారము. అది గుణ
విభాగనిష్పన్నము వేదోదితమే ధర్మము దానినే యనుష్ఠింపవలెను

మానవ కర్మలన్నియు యజ్ఞములే. అవి వేదోక్తములు.
యజ్ఞములచే దేవతలు సంతసింతురు వారివలన మానవులకు సుఖ
ములు, సుఖజీవనములు గలుగును. కావున మానవ కర్మలన్నియు
వేదోక్తములై ధర్మబద్ధములై యుండవలెను.

ఈజగచ్చక్రమంతయుఁ బదునాడంగములచే నడుచుచున్నది
అవి పది యింద్రియములు. మనస్సు, బుద్ధి, జీవుడు,—లేక—ఆత్మ
యనునవి. వీనిలో నొకదానికంటె నొకటి యుత్తరోత్తరము ప్రధా
నమైనది ఇందు గుణకర్మ విభాగముతోడి చాతుర్వర్ణ్యము సంప్రదా
యసిద్ధమై కనఁబడును. మానవ జీవితమునందువలెనే 'కుమ్మరిసారె'
యను యంత్రమునందును, 'విశ్వేట్' అను నాటయందుఁగూడఁ జాతు
ర్వర్ణ్యవిభాగమెట్లు కుదిరియున్నదో పోలికలుచూచి గ్రహింపవచ్చును
సృష్టికి మూలమయిన దాంపత్యమునందు, స్త్రీ పురుషులయందు
శుక్లశోణితములందు, దేహజీవులయందు, వానివాని ధర్మ కర్మల
యందు, తత్ప్రతిపాదకములైన వేదములందు, వేదపురుషునందును
గుణకర్మ విభాగములతోడి చాతుర్వర్ణ్యము—సేవ్యసేవక పోష్యపో
షక భావములు—స్వతంత్రతా పరతంత్రతలు నెంత చక్కగా నమరి
యున్నవో విజ్ఞులు పరిశీలించి తెలియఁగలయుఁగలరు. ప్రతియొక కార్య
సిద్ధికి ముఖ్యాంగములైన పదిదింటిలో నైదవది దైవము. తక్కిన
శరీరము, జీవుడు, నింద్రియములు, వాని కార్యములు. నను నాల్గు
ఇదియుఁ జాతుర్వర్ణ్యయోగమే ఇందులో మొదటిదైన శరీరము
కేవలోపకరణము కావున, దానికి వేదాధికారములేదు. తక్కిన,
వేదోక్తధర్మము ననుసరింపవలెను ఇట్టి వివరణములతో నీగ్రంథము
చాతుర్వర్ణ్య ప్రవృత్తియు. దానికి మూలమైన వేద ధర్మములే మా
నవ జీవితమును సుభిక్షము చేయగలవని విస్తరించి చెప్పినది.

మఱియు "జన్మముతో మానవులందఱు సమానులు. కర్మచే

తోవచ్చిన వర్ణ వ్యవస్థ కృత్రిమ'మను కొందఱి భావమును ఖండించుచు, "జన్మచేతనే జాతి యేర్పడినది కర్మచేఁగాదు, ఆ జాతికి ప్రాగ్జన్మ కర్మలు కారణములు. వానినుండి వర్ణ వ్యవస్థ వచ్చినది. తన్మూలకములే యిప్పటి కర్మలు. యీ వర్ణ వ్యవస్థ మానవులందే గాదు చేతన జడాదిక పదార్థములందంతటఁ గలదని ముందే చెప్పఁబడినది. అది స్వాభావజము ఏదోయొకని యతి దాని నడుపుచున్నది. దాని నుల్లంఘించి జాతి సాంకర్యముచేయుట ప్రమాదకరము. భిన్న ప్రకృతిగల జడపదార్థములఁ గలిపినను గుణభేదముతో గర్మభేదమేర్పడి విపరీత ఫలము కలుగుచున్నట్లె మానవజాతి సాంకర్యముతో ననర్థకములెన్నో పుట్టుకొనిరాఁగలవు. ఈ ధర్మ స్వరూపము నిగూఢ దురవగాహము గావున దానిని వేదములవలనఁ దద్జ్ఞులవలనఁ దెలిసికొని కర్మానుష్ఠానముచేయుటే శ్రేయ" మని యీ గ్రంథము నిరూ నిరూపించుచున్నది.

ప్రసక్తాను ప్రసక్తముగా నిప్పటి కలమత వర్ణవర్గాది భేదము లుండరాదను వాదము, అస్పృశ్యత, సంఘసంస్కారము, వ్యైవపౌరుష స్వాతంత్ర్యములు, బాధ్యత, అధికారము. ప్రజలు—ప్రభుత్వము, దేశ గ్రామ గృహాది వ్యవస్థలు, గృహారాజ్యము, వాస్తుశాస్త్రము, గ్రామజాతి లక్షణములు, ఆచార ధర్మ సంప్రదాయములు మున్నగు ననేకాంశములు చర్చించఁబడి భారత జాతీయ సంస్కృతి విశిష్టత చక్కఁగా వర్ణింపబడినది. ఈ విమర్శమునందంతట. ప్రతిపాదితమైన ప్రతి విషయమునకు శృతిస్మృతులనుండి భగవద్గీతా పురాణములనుండి బహుళ ప్రమాణము లీయఁబడినవి. సహేతుకములైన వివరణములు, సముచితములైన యుపపత్తులు సమగ్రములైన లౌకిక దృష్టాంతము లుల్లేఖింపబడినవి. స్వవాద సమర్థనమునందును, ప్రతివాద ఖండమునందును, నడచిన సుకుమార భాషాభావ వాక్య ప్రయోగము శాస్త్రీయ చర్చకుఁదగిన మర్యాదతో నందగించినది. ఇందలి ప్రతి విషయము గ్రంథకర్తకుఁగల ప్రతిభా పాండిత్యములను

వివేచనావిశిష్టతను లోక శాస్త్రానుభవములను ధర్మ కర్మాభిరతిని వెల్లడించుచున్నవి. ఈయన తానేమి చెప్పినను "ఏవముపాసితవ్యమ్ ఏవం చైతదుపాస్యమ్" అన్నట్లు స్పష్ట ప్రతిపాదనము చేసి విడచును. ఈ విధముగా నీగ్రంథకర్త యీ ప్రయత్నమున స్వవిధిని చక్కగా నిర్వహించి కృతార్థుఁడైనాడనియే నాభావము

ఈయనగూడా నట్లై తృప్తిపడుచున్నాడు. కాని లోకము దీనిని సవ్యముగ గ్రహించునా? చక్కగ ననుష్ఠించునా? యను విచికిత్స యీయనకు లేకపోలేదు. ఆయనకేగాదు వాఙ్మయ స్రష్టలగు నందఱికిని తన హృదయ పరిమళము లోక మాస్వాదించి యానందింపవలెనను యాకాంక్షయుండుట సహజము. నిజముగా నట్టి రచనలకింతకంటె మిక్కిలిగా సత్కార మేమున్నది? 'విశ్వశ్రేయః కావ్యమ్' అను మాటకుఁ దాత్పర్యమదియేగదా? కాని ఈయనకా యూఱట కూడా నున్నట్లు లేదు. 'లోకము వెఱ్ఱివానిగా భావించి వదలుటయో దూషణ తిరస్కారాదులచేత చుట్టుముట్టుటయో చేయకపోదు' అని స్పష్టముగ నేయన్నాడు. నేటి లోకప్రవృత్తి యీయనచే నట్లు బలికించినది. కాని ధర్మ ప్రతిష్ఠావసరమున నీ ప్రతికూల పరిస్థితి క్రొత్తగాదు నిస్పృహపడుడు దీనికి నిరుత్సాహపడరాదని నాతలంపు. ఇట్టి సందర్భముననే ప్రతికూల పరిస్థితిని ధిక్కరించుచుఁ బరమ స్వతంత్రుఁడైన భవభూతి మహాకవి యేమన్నాడో వినుఁడు. "యేనామ కేచిదిహనః ప్రథయన్త్యవజ్ఞాం జానన్తు తే కిమపి తాన్ప్రతి నైష యత్నః । ఉత్పత్స్యతే మమతు కోపి సమాన ధర్మా కాలో హ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ"- నారచన జదువనివారి కొఱకు నేను వ్రాయలేను. ఇది చదువువాఁడు, నావంటి వాఁడొకఁడెప్పుడో ఎచ్చటనో పుట్టగలఁడు" అమహామహుని యచంచలమైన యాత్మ ప్రత్యయము మనకొరనడి కావలెను భారతస్థల పవిత్రతేజః కిరణలేశము మనలో మన వాక్కులో నున్నపుడు మనము భావించినదే ధర్మమైనప్పుడది యెప్పుడో యెట్లో పాట మొలకెత్తించి చిగిరించి పుష్పించి ఫలించి విశ్వకల్యాణముచే కూర్పకపోదు ధర్మనైష్ఠికుల హృదయములలో నీ విశ్వాసము జాగరూకమైనచో నంతట నమృతవర్షము కురియును.

భారతలోకమున నొకమాట చెప్పవలసియున్నది. మన నిత్యజీవితమున సర్వాంతరముల భారతజాతీయ ధార్మిక సంప్రదాయము నేటివరకు నిండుగాన మరియున్నది. యుగయుగముల నుండి తర తరములవెంట వచ్చిన దీనిలో దేశకాలోపగతమైన మాలిన్య మేదో కొంత పేరికొని యుండకపోదు. ఇది యెంత సహాయజమో నంత సత్యముగా నిందులో నంతర్వాహినియై యాత్మ ధర్మ జోతి వెలుఁగుచున్నది ఆ మాలిన్యము తొలఁగించి యాజ్యోతి వెలిగించు కొనుట మన కర్తవ్యము మన మనుభవించుచున్న వెలుపలి భౌతిక పదార్థములు వాని రుచులు రూపురేకలు భోగించుచున్నంతవరకే ఉత్తర క్షణముననే యన్నియు నదృశ్యమైపోవును. వాని మంచిచెడ్డ లను ప్రయోగ పరిపాకముల నీయింద్రియములుగూడ స్వయముగ నెఱుఁగజాలవు. మహాశక్తియేదో లోపలనుండి యీ యన్నింటిని నడుపుచున్నది. దాని నెఱుగకున్న మన జీవితమంతయు వట్టి బొమ్మ లాట. దాని నెఱుఁగుటకీ వెలుపలి భౌతిక సామగ్రి—యంత్ర ప్రయో గములేవియుఁ జాలవనుటయను భవసిద్ధము. ముందుకు తొంగిచూచి ననేమున్నది? కనుకనే యిచ్చటినుండి వెనుకకుఁజూచి, యీరహ స్యము దెలుపు శాస్త్రములను·తద్విదులైన పెద్దలను వారేర్పఱచిన యాచార సాంప్రదాయములను పునః పునః పరిశీలించి సత్యాన్వేష ణము చేయవలసియున్నది. ఈప్రయత్నములో నీ ధర్మజ్యోతి యొక వెలుగుబాట చూపగలదని నా నమ్మకము. మీలో నీవిశ్వాసము నన్వేషణము మేలుకొనవలెనని కోరుచున్నాను.

ఈ గ్రంథకర్త బ్రహ్మశ్రీ పాణ్యము లక్ష్మీనరసింహ శాస్త్రి గారు నాకు బాల్యమిత్రుడు. ఈయన తన విద్యకు వివేచనకు విజ్ఞాన మునకుఁ బరిశోధనమునకు ఫలితముగా నీ ధర్మజ్యోతి వెలయుంచినం దుకు హృదయ పూర్వకముగా నభినందించుచున్నాను. ఇట్టి లోకో పకార కృషి యితోధికముగా నిర్వహింప భగవంతుఁడీయనకు దీర్ఘా యురారోగ్యములను గ్రహింపవలెనని నా యాకాంక్ష.

ప్రొద్దుటూరు
వంచన కార్తీక శుక్ల

గడియారము వేంకట శేషశాస్త్రి,
శతావధాని.

శ్రీ ర స్తు.

## గ్రంధపోషకులు :

వెలుదుర్తి గ్రామం శ్రీయుత. పెరుమాళ్ల యెల్లరామయ్యగారి ప్రశంస.

మ॥ విలసిల్లున్ వెలుదుర్తినామపురమున్నుర్విన్ సర్వసౌభాగ్యశో।
భల నొప్పారుచు, బ్రహ్మగుండశివభవ్యక్షేత్ర పశ్చాద్భువిన్
కలవాయూరను పేరనుల్ సలుపుసౌకర్యంబు లెన్నేని వై
శ్యులు వాణిజ్యధనప్రపూర్ణులును భక్త్యౌత్సాహధర్మోన్నతుల్।

సీ॥ అప్పురంబున దొల్లి నే నన్నదాన
వంశకూపారచంద్రుడై వాసిగన్న
సుబ్బ శాస్త్రిల పూర్ణ విశుద్ధకృపను
చదువుకొంటిని కొన్నేండ్లు సంస్కృతమును॥

ఉ॥ అన్నయు దమ్ముడచ్చట గృహాదులతో నివసించియుండుటన్
చిన్నతనంబునన్ జదువునేర్చిన మద్గురువాసమౌట నా।
కన్నివిధంబులన్ కడుసుఖాస్పదులచ్చట నుంట జేసి నా।
కన్నపురమ్ముకన్న అదిగన్నులపండువొనర్చు నెప్పుడున్॥

క॥ సారస్వతాభిమానుల్
భారతరామాయణాది భగవత్కథలన్
గూరిమితోవిన గోరెడి
వారల్ వెలుదుర్తిలోని వైశ్యప్రవరుల్॥

చ॥ ప్రియుడును యెల్లరామపదవిశ్రుతనాముడు కీర్తికాముడున్
నయము వివేకమున్ గలిగి నావలనన్ భగవత్కథాదు లెం
తయు వినుచుండువాడు నిజధర్మపథంబుననుండువాడు వి
క్రయక్రయశాలివైశ్యకులగణ్యుడుధన్యుడుమాన్యుడప్పురిన్

సీ॥ వం మోఁకులగోత్ర పెరుమాళ్ళ వంశంబ
యెవ్వనిజన్మకు హేతువయ్యె
వితతస్వధర్మైక రతుడు వెంగనశ్రేష్ఠి
దనరె నెవ్వని ప్రపితామహుండు
విమలపావనగుణాన్వితుఁడు మాసుముశ్రేష్ఠి
నామించె నెవని పితామహుండు
వెంకటరామాఖ్యవెలసె నెవ్వనితండ్రి
నారమ్మకెవఁడు జన్మారికొడుకు॥

సీ॥ కడుహితాత్ముఁడైన నాగయ్యశ్రేష్ఠి
బరగనెవ్వని కన్నయై వరలె నట్టి
ప్రథిత వృత్తంబుగల యెల్లరామశ్రేష్ఠి
శ్రవణగోష్ఠిని భక్తిఁ తోఁ జేయుచుండ॥

శా॥ కర్మజ్ఞాన పురాణ సత్కథలు వక్కాణించి యొక్కప్పుడీన్
ధర్మజ్యోతి విధానముల్ దెలుప నంతన్ సంతసంబంది యీ
దుర్మాలిన్య కలి ప్రచేష్టలను బేర్ దూలించు నీ గ్రంథముల్
బేర్మిన్ ముద్రణ మొందఁజేయుమని దెల్పెన్ దాసముత్సాహియై॥

కం॥ అప్పుడు నేనిట్లంటిని
యొప్పుగనిది ముద్రణంబు నొనరింపుము నే
నిప్పగిది వ్రాసియున్నవి
యొప్పారెడు బెక్కు, ముద్రి నొనరించినచోన్॥

సీ॥ ఉత్పలమాలల నురుభక్తి నీశ్వర శతకంబు
గూర్చితి శైశవమున
వ్రాసితి కోదండరామాఖ్య శతకంబు
తర్వాత సీస పద్యములు జెలఁగ

నది ముద్రణంబయ్యె నామీద శార్దూల
విక్రీడితంబుల విశ్వనాథు
మదినెంచి నక్షత్రమాల రచించితి
మఱి లిఖించితి గుణమంజరియును

గీ॥ రామతత్త్వ రహస్యంబు వ్రాసినాడ
గౌరివ్రత కథ పాటిగాగ విరచించి
వ్రాయుచున్నాఁడ నిప్పుడు పంపమహిమ
ముద్రణ మొనర్ప బుణ్యులు బూని రేని॥

మ॥ సతతంబుల్ ఖిల మొందనట్టి దవుటల్ సంతాన వర్గంబుః
గృతియే బెద్దని పెద్దలందురుగదా, యాగ్రంథ సంతాన
క్షితి వర్ధిల్లగజేయు మీశ్వరుఁడు శ్రేయోర్థ సౌభాగ్య
తతులన్నిటికి సద్యశంబు భువి నత్యంతంబు రాజిల్లెడుల్।

మ॥ అని నేదెల్పగ సంతసంబుననుమీ యాదేశమే మైన జే
తును, మీరెప్పుడు నెట్టి కార్యమును నాతోఁ జెప్ప లేదిం
మునుపీరీతి నటంచు గ్రంథమిటులల్ ముద్రింపగాఁ జేసె
ప్పుని లోకైక హితంబుగాఁదలఁచి సద్భావంబు దీపింప

కం॥ జగతిల్ ధర్మజ్యోతిని
నెగడంగా జేసినట్టి నిర్మల చరితుం
డగు వెల్ల రామశ్రేష్ఠికి
ఖగవాహనుఁడిచ్చు గాక కడు శ్రేయంబుల్॥

ఓం తత్సత్

# ధర్మజ్యోతి.

శ్లో॥ యంశైవాస్సముపాసతే శివఇతి బ్రహ్మేతి వేదాంతినః।
బౌద్ధాబుద్ధ ఇతిప్రమాణ పటవః కర్తేతి నైయాయికాః।
అర్హన్నిత్యథజైన శాసనరతాః కర్మేతి మీమాంసకాః।
సోయం వోవిదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథోహరిః।

ఓం అథాతోధర్మ జిజ్ఞాసా । అథాతో బ్రహ్మజిజ్ఞాసాః

ఆనందస్థితి నందుటకు మానవుడెఱుంగవలసిన తత్త్వములు రెండు, గలవు,

అందొకటి కర్మస్వరూపమగు ధర్మతత్త్వము రెండవది జ్యోతిస్స్వరూపమగు బ్రహ్మతత్త్వమైయున్నది.

బ్రహ్మతత్త్వమునకు ధర్మతత్త్వ మంగమైయున్నందున ముందు ధర్మతత్త్వము నెఱుంగుట యుక్తము గనుకనే శాస్త్రకారులు ముందు "అథాతోధర్మ జిజ్ఞాసా" అనివచించుచున్నారు.

శ్లో॥ ధర్మాత్సుఖంచ జ్ఞానంచ
జ్ఞానాన్మోక్షోధిగమ్యతే॥

తా॥ ధర్మమువల్ల సుఖము జ్ఞానము లభించును జ్ఞానమువల్ల మోక్షము సిద్ధించును.

పరామార్థమునం దీరెంటికిని భేదము లేకున్నను వ్యవహార స్థితియందు భేదమును శాస్త్రకారులు నిరూపించుచున్నారు

పరమార్థమున తత్త్వమొక్కటియేగాన, బోధించునది యొకటియు బోధింప బడునది మఱియొకటియు నుండుట కవకాశములేదు.

వ్యావహారిక స్థితి నాశ్రయించియే, శాస్త్రమున్నిటికిని ప్రవృత్తి యేర్పడినది.

వ్యవహారమంతయును. ధర్మముపైననే ప్రవర్తించు చున్నది. గాన శాస్త్రములన్నియును ధర్మతత్వము నాశ్రయించియే బ్రహ్మ తత్వమునుబోధించు చున్నవి.

మానవునకు మిక్కిలి సన్నిహితముగ నుండునది ధర్మతత్వము దాని నాశ్రయించి బ్రహ్మత్వము నొందవలసి యున్నది.

ఈరెండిటినే. శ్రీమద్భగవద్గీతయందు. భగవానుడు. సాంఖ్య యోగములనియు జ్ఞానకర్మలనియును. చెప్పుచున్నాడు.

ధర్మముపైననే లోకకల్యాణమంతయు నాధారపడియున్నది గనుకనే. వేదము.

"ధర్మంచర"

ధర్మము నాచరింపుమని యాదేశమిచ్చుచున్నది.

— శ్రుతి —

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా"

తా॥ విశ్వరూపమున నుండు జగత్తునకు స్థిరమగు సుస్థితి నొసంగునది ధర్మము.

— స్మృతి —

"ధర్మోరక్షతి రక్షితః"

తా॥ ధర్మము తనను రక్షించెడి వానిని రక్షించుచున్నది.

—* ధర్మ శబ్దార్థము *—

శ్లో॥ ధారణోద్ధర్మ మిత్యాహుః
ధర్మోధారయతి ప్రజాః
ప్రభవార్థాయ భూతానాం
ధర్మ ప్రవచనం కృతం॥
ధారణోద్ధర్మ విత్యాహుః
ధర్మేణ విధృతాః ప్రజాః
యస్మాత్స్యాద్ధారణ సంయుక్తః
సధర్మఇతి నిశ్చయః॥ శాంతి పర్వము॥

తా॥ ధరించుటవల్ల ధర్మమను చున్నారు. ధర్మము ప్రజలను

ధరించుచున్నది, భూతములయొక్క సంభవము కొరకు. ధర్మము ప్రవచింపబడినది. ధర్మముచేత ప్రజలు ధరింపబడుచున్నారు. ఏది ప్రజల నుద్ధరించునో అది ధర్మము—ధర్మమనగా శరీరధారియగు ప్రతిప్రాణిని యతడుండిన స్థానము నుండి యుత్కృష్టమగు స్థానమునకు గొనిపోవెడి సాధనమని భావము.

—ధర్మశబ్దభావములు—

1. దరిద్రునకు ధర్మమొసంగు మనినప్పుడు దానముచేయు మనెడు భావము నిచ్చుచున్నది.—

2. దహించుట. అగ్నియొక్క ధర్మము. అనినప్పుడు. స్వభావము అనెడి. భావమును. సూచించుచున్నది.

3. కలహించెడి వారిద్దరిలో ధర్మమెవని పక్షమునందు గలదు అనినప్పుడు. ఆధర్మశబ్దము. న్యాయమనెడి భావమును దెల్పుచున్నది—

4. ధర్మమువల్ల స్వర్గలోకము గల్గును. అనినప్పుడు. అది. పుణ్యమనెడి భావమును. దెల్పుచున్నది.

5. యుద్ధము. రాజుయొక్క—ధర్మము. అనినప్పుడు విధివిహిత కృత్యము, అనెడి భావము నొసంగు చున్నది.

ధర్మశబ్దమిట్లు. గంభీరోదాత్త సద్భావముల కాశ్రయమై యొప్పుచున్నది.

ప్రతిమానవునకు ధర్మ మవశ్యకర్తవ్యమనుటలో సామాన్యముగ నెవ్వరి కెట్టిసూక్షేపణయును లేదనియే దలంపవచ్చును.

అది యందఱకును సమ్మతమగు విషయమే. గాని "ధర్మమనగ నెట్టిది? దానికి నిర్వచనమేమి? దానికి నిజమగు తాత్పర్యమెద్ది? అనుటలో మాత్రము.

"ఎవరికివారే యమునాతీరే" యన్నట్లు బహువిధాభిప్రాయములును వివాదములును చెల రేగుచున్నవి.

ధర్మతాత్పర్యము నొకరొక రొక్కొక విధముగ స్వభావానుగుణ్యముగ ప్రవచించి నిరూపించుచుండుటవల్ల యుద్ధములు, రక్తపాతము లెన్నియో ధర్మము పేరనే సంభవించుచున్నవి.

కలహించెడి ప్రతివారును తమది ధర్మమనియు నితరునిది యధర్మమనియు దానిని తానిట్లుయెదిరింపకయున్న ధర్మము నశించుననియును బలుకుచుందురు.

లోకమునందెట్టి కార్యమునైనను, కొందఱు ధర్మమనియును కొందఱధర్మమనియును బలుకుచుండుట పరిపాటిగా నొప్పుచున్నది.

ధర్మమిట్లుండునా? మానవులకు పరస్పర మిట్లు కలహములను జనింపజేయునది ధర్మమగునా? "అట్టిదియే ధర్మమగునెడల భగవదుక్తమగు వేదమునందు దానికంతటి యున్నత స్థానముండునా. అద్దానిని పలువురు పలువిధముల భావించుటకు హేతువేమి?

ఇట్టివిషయమును ప్రతిమానవుడును విచారించవలసి యున్నది?

ఏలనన ధర్మము లోపించి యుండుటవల్లనే లోకమునందిపుడింతటి యశాంతి ప్రళయరూపమున తాండవించు చున్నది.

శుష్క వాగాడంబరముల వల్ల నిదియెంతమాత్రమును చల్లారజాలదు.

ధర్మమనగ భూతములయొక్క ప్రకృతి సహజమైయున్ననియత వ్యాపారము (లేక) విధివిహితకర్మయని యర్థము.

సర్వోపనిషత్సారమై వెలసిన భగవద్గీతయం దర్జునునకు శ్రీకృష్ణభగవానుడు, కర్మయోగరూపమగు ధర్మతత్వమును, బోధించి యతనిని. సహజకర్మయందు నియోగించి యున్నాడు.

మఱియును శ్రీకృష్ణుండాగీతయందు. మానవునకు సహజమై యొప్పిన జాతివిధివిహిత కర్మను. ధర్మశబ్దముతో నిస్సంచ్ఛరించి వ్యాఖ్యానించి యున్నాడు.

స్వధర్మమపిచావేక్ష్య
నవికంపితు మర్హసి॥
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోన్యత్
క్షత్రియస్య నవిద్యతే ॥ గీత॥ ౨॥ ౩౧॥

తా॥ నీవు స్వధర్మమునైనను జూచి భయకంపితుడవుగా కూడదు. క్షత్రియునకు స్వాభావిక ధర్మమగుయుద్ధమునకంటె వేఱగు శ్రేయస్సు లేదు.

శ్లో॥ అథచేత్వమిమం ధర్మ్యం
సంగ్రామంనకరిష్యసి॥
తత స్వధర్మం కీర్తించ
హిత్వాపాపమ వాప్స్యసి॥ గీత॥ ౨॥ ౩౩॥

తా॥ నీవొకవేళ యీధర్మయుక్తమగు యుద్ధమును జేయని యెడల, నీధర్మమును కీర్తిని గోలుపోయి పాపమును బొందగలవు.

ధర్మము భగవత్స్వరూపము. దానినతీంద్రియజ్ఞానులును ద్వంద్వాతీతులగు మహాత్ములు మాత్రము గాంచగలుగుదురేగాని క్రామక్రోధాదులకు వశులగు మానవులకది గోచరించుట దుర్లభము.

దేశకాలావస్థాది భేదములతో. బహువిధముల నొప్పుచున్న ధర్మముయొక్క సత్యస్వరూపనిర్ణయమును. శాస్త్రముల యందు మహాత్ములు. లోకానుగ్రహబుద్ధితో నిరూపించియున్నారు.

ధర్మభేదములు భారతాను శాసనిక పర్వమునందిట్లు వర్ణింపబడినది.

ధర్మాబహువిధాలోకే
శ్రుతిభేదముఖోద్భవాః
దేశధర్మాశ్చదృశ్యంతే
కులధర్మాస్తథైవచ
జాతిధర్మావయోధర్మాః
గుణధర్మాశ్చశోభనే
శరీరకాలధర్మాశ్చ
ఆపద్ధర్మాస్తథైవచ

ఏతద్ధర్మస్యనానాత్వం
క్రియతే లోకవాసిభిః॥ ఉమామహేశ్వరసంవాదం॥

తా॥ ఓపార్వతీ, లోకమునందు. శ్రుతి భేదములవల్ల జనించిన ధర్మములు. బహువిధములుగ నొప్పుచున్నవి. దేశధర్మములు. కుల ధర్మములు. జాతి ధర్మములు. వయోధర్మములు. గుణధర్మములు. శరీరధర్మములు. కాలధర్మములు ఆపద్ధర్మములు. ఇట్లు నానావిధ ధర్మములోకముచే నాచరింప బడుచున్నది.

మఱియును ధర్మములు సాధారణములనియు నసాధారణముల నియు ద్వివిధములై యున్నవి.

సాధారణధర్మములు బృహస్పతిచే నిట్లు చెప్పబడు చున్నవి

శ్లో॥ దయాక్షమానసూయాచ
శౌచానాయాస మంగళం॥
అకార్పణ్యో స్పృహత్వేచ
సర్వసాధారణోవమే

తా॥ కృపగల్గి యుండుట. సైరణగల్గియుండుట. అసూయ లేక యుండుట. శుచియును. శాంతియును. శుభాకాంక్షయు గల్గియుండుట కార్పణ్యము. లేక యుండుట. కోరిక లేక యుండుట. ఇవి సర్వులకును సాధారణ ధర్మములు.

అసాధారణ ధర్మములు బృహస్పతి

శ్లో॥ స్వాధ్యాయోధ్యాపనంచేవ
యజనం యాజనం తథా।
దానంప్రతి గ్రహశ్చాపి
షట్కర్మాణ్య గ్రజన్మనః

తా॥ వేదములు చదువుటయును. చెప్పుటయును కర్మలు చేయు టయు చేయించుటయును. దానమిచ్చుటయు. పుచ్చుకొనటయు నివి బ్రాహ్మణ ధర్మములు.

అధ్యయన దానేచ।
ప్రజానాం పరిపాలనం
శస్త్రాస్త్రధారణం సేవా
కర్మాణిక్షత్రియస్యతు॥

తా॥ కర్మలుచేయుట. వేదములు చదువుట. దానమిచ్చుట. ప్రజలను పాలించుట. శస్త్రాస్త్రములు. ధరించుట. లోకమును సేవించుట. యివిక్షత్రియ ధర్మములు.

స్వాధ్యాయోయజనం దానం
పశూనాంపాలనంతథా
కుసీదకృషివాణిజ్య
వైశ్యకర్మాణిసప్తవై

తా॥ వేదములు చదువుట. కర్మలు చేయుట. దానమిచ్చుట. పశువులను పాలించుట. వడ్డియు. కృషియు. వ్యాపారము. నీయేడును వైశ్యధర్మములు.

శ్లో॥ శౌచంబ్రాహ్మణశుశ్రూషా
సత్యమక్రోధ ఏవచ॥
శూద్రకర్మతి ధామంత్రో
నమస్కారోప్యచోరితా

తా॥ శుచిగనుండుట. బ్రాహ్మణులను సేవించుట. సత్యము. క్రోధరాహిత్యము. మంత్రరాహిత్యము నమస్కారము. పేరీకపింపకుండుటయు నివిశూద్రధర్మములు.

ఇట్లనేక విధముల నొప్పుచున్న ధర్మతత్వము నెఱుంగుటకష్టముందు. సృష్టితత్వక్రమము నెఱింగిన యెడల ధర్మతత్వము. నెఱుంగుట సులభమగును గాన ప్రకృతి సహజమైయున్న సృష్టిక్రమము విచారించవలయును.

ఐతరేయోపనిషత్తునందిట్లుగలదు

"ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్"

తా॥ సృష్టికి పూర్వమందు యీజగత్తు ఆత్మగానే యుం[illegible]

ఛాందోగ్యోపనిషత్తునందు

"సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్"
తదైక్షత బహుస్యాం ప్రజాయేయ

తా॥ సృష్టికి పూర్వమునం దీజగత్తు సన్మాత్రము గానే యుం డెను ఆబ్రహ్మ బహువిధరూపములగుటకు సంకల్పించెను.

తైత్తిరీయోప నిషత్తునందు

తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః
ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః
అద్భ్యః పృథివీ పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోన్నం
అన్నాత్పురుషః —

తా॥ ఆయాప్రత్యగభిన్నమైన ఆత్మవలన ఆకాశము జనించెను ఆకాశమువల్ల వాయువును వాయువువల్ల అగ్నియును అగ్నివలన ఉదకములును ఉదకముల వలన భూమియును భూమివలన ఓషధులును ఓషధులవలన అన్నమును అన్నమువలన పురుషుడు జనించెను.

మొదట ఆత్మ ఒక్కటిగనే యుండి తాను బహువిధనామ రూపములగుటకు సంకల్పించుటవల్ల ఆబ్రహ్మనుండి ఆకాశాది పురుషపర్యంత భూతములు ఒకదానినుండి యొకటి జనించినట్లు పైశ్రుతులయభిప్రాయము తెలుపుచున్నది.

ఏకము అద్వితీయము అనంతము నిర్గుణము నామరూప క్రియారహితమగు తత్వమొక్కటియే గలదు

ఆతత్వమనిర్వాచ్యమైనదియైయున్నను వ్యవహారతనా శ్రియుంచి ఆతత్వమును వేదములాత్మయనియు పరబ్రహ్మమనియు పేర్కొనుచున్నవి

ఆపరబ్రహ్మనుండి ఆకాశాది భూతములు జనించిన వస్తు భ్రాంతిచేత. త్రాటియందు సర్పమువలెను ముత్యపుచిప్పయందు వెండివలెనా పరబ్రహ్మయందు బహువిధ నామరూపములతో సాక్షా

శాదిభూతములు తోఁచుచున్నవని భావము. ఈయాకాశాది పంచభూతములును ఆత్మకుఁ బంచకోశములుగాఁ జెప్పఁబడినవి. అందొకటి సత్యమగు ఆత్మ, రెండవది మిథ్యయగు ప్రపంచము నానొప్పుచున్నవి. లోకవ్యవహారమంతయును మిథ్యయగు పంచభూతాత్మక ప్రపంచమునకు సంబంధించినదే గాని వేఱుగాదు.

ఆత్మవలనఁ గ్రమముగ నాకాశాది పంచభూతములు నుత్పత్తియై, అపంచభూతములయొక్క పరస్పర సమ్మేళనమువలన నామరూపములుగల సమస్తచరాచరభూతకోటులును, గలుగుచున్నవి. ఇందవరోహణక్రమము ననుసరించి, యేభూతమునుండి యేదిజనించినదియో, దానికి జనకమగు భూతము సేవ్యముగ, ఉద్ధారకముగ, పోషకముగ నొప్పుచుండును. మఱి జనకభూతమునకు జన్యభూతము పోష్యము సేవకమునై యొప్పారుచున్నది. ఇట్లుండు పంచభూతాత్మకమగుటవలననే లోకము ప్రపంచమని వ్యవహరింపఁ బడుచున్నది.

శ్లో॥ పురుషోఽయం లోకసమ్మితః

(పురుషుఁడు లోకముతో సమానుఁడు)

పిండాండ వద్బ్రహ్మాండమ్.

(పిండాండమగు పురుష దేహమువలెనే బ్రహ్మాండ మున్నది.)

అను నీసూక్తిద్వయము ననుసరించి, పిండాండ తత్త్వము బ్రహ్మాండమునందును, బ్రహ్మాండతత్త్వము పిండాండమునందును గలవని రూఢియగుచున్నదిగదా! కాఁబట్టి లోకధర్మము నెఱుంగుటకు ముందు దానికి జనకమగు భూతధర్మ మెఱుంగుట యవశ్యమగుచున్నది. ఈయాకాశాది పంచభూతములకును మూఁడు సహజములై ప్రత్యేకములైన లక్షణము లొప్పుచున్నవి.

1. ఆకాశము:— ఇది సర్వమునకు బీజమై యత్యంత సూక్ష్మమైనదగుట సర్వాధారశక్తిగలదై యున్నది. అట్లుండియు దీనిశక్తిరూ

ఛాందోగ్యోపనిషత్తునందు

“సదేవసౌమ్యేదమగ్రఆసీత్”
తదైక్షతబహుస్యాం ప్రజాయేయ

తా॥ సృష్టికి పూర్వమునం దీజగత్తు సన్మాత్రము గానే యుం డెను ఆబ్రహ్మ బహువిధరూపములగుటకు సంకల్పించెను.

తైత్తిరీయోప నిషత్తునందు

తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః
ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః
అద్భ్య పృథివీ పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోన్నం
అన్నాత్పురుషః —

తా॥ ఆయాప్రత్యగభిన్నమైన ఆత్మవలన ఆకాశము జనించెను ఆకాశమువల్ల వాయువును వాయువువల్ల అగ్నియును అగ్నివలన ఉదకములును ఉదకముల వలన భూమియును భూమివలన ఓషధులును ఓషధులవలన అన్నమును అన్నమువలన పురుషుడు జనించెను.

మొదట ఆత్మ ఒక్కడుగనే యుండి తాను బహువిధనామ రూపములగుటకు సంకల్పించుట వల్ల ఆబ్రహ్మనుండి ఆకాశాది పురుషపర్యంత భూతములు నొకదానినుండి యొకటి జనించినట్లు శ్రుతులయభిప్రాయము తేటపడుచున్నది.

ఏకము అద్వితీయము అనంతము నిర్గుణము నామరూప క్రియారహితమగు తత్వమొక్కటియే గలదు

ఆతత్వమనిర్వాచ్యమైనదియైయున్నను వ్యవహారత నా శ్రయించి యాతత్వమును వేదములాత్మయనియు పరబ్రహ్మమనియు జెప్పుచున్నవి

ఆపరబ్రహ్మనుండి ఆకాశాది భూతములు జనించిన వనగా భ్రాంతిచేత. త్రాటియందు సర్పమువలెను ముత్యపుచిప్పయందు వెండివలెనా పరబ్రహ్మయందు బహువిధ నామరూపములతో నాకా

శాదిభూతములు లేకున్నవని భావము. ఈయాకాశాది పంచ భూతములును ఆత్మకు బంధకములుగా చెప్పబడినవి. అందొకటి సత్యమగు ఆత్మ. రెండవది మిథ్యయగు ప్రపంచము నా చెప్పుచున్నవి. లోకవ్యవహారమంతయును మిథ్యయగు పంచభూతాత్మక ప్రపంచమునకు సంబంధించినదే గాని వేఱుగాను.

ఆత్మవలన గ్రమముగ నాకాశాది పంచభూతములు నుత్పత్తియై, ఆపంచభూతములయొక్క పరస్పర సమ్మేళనమువలన నామరూపములుగల సమస్త చరాచరభూతకోటులును, గలుగుచున్నవి. ఇందవరోహణక్రమము ననుసరించి, ఏభూతమునుండి యేదిజనించినదియో, దానికి జనకమగు భూతము సేవ్యముగ, ఉద్ధారకముగ, పోషకముగ చెప్పుచుండును. మఱి జనకభూతమునకు జన్యభూతము పోష్యము సేవకమునై యొప్పారుచున్నది. ఇట్లుండు పంచభూతాత్మకమగుటవలననే లోకము ప్రపంచమని వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ పురుషోయం లోకసమ్మితః

(పురుషుడు లోకముతో సమానుడు)

పిండాండ వద్బ్రహ్మాండకః.

(పిండాండమగు పురుషదేహమువలెనే బ్రహ్మాండ మున్నది.)

అను సిద్ధాంతద్వయము ననుసరించి, పిండాండ తత్త్వము బ్రహ్మాండమునందును, బ్రహ్మాండతత్త్వము పిండాండమునందును గలవని రూఢియగుచున్నదిగదా! కాబట్టి లోకధర్మము నెఱుంగుటకు ముందు దానికి జనకమగు భూతధర్మ మెఱుంగుట యవశ్యమగుచున్నది. ఈయాకాశాది పంచభూతములకును మూడు సహజములై ప్రత్యేకములైన లక్షణము లొప్పుచున్నవి.

1. ఆకాశము:— ఇది సర్వమునకు బీజమై యత్యంత సూక్ష్మమైనదగుట సర్వాధారశక్తిగలదై యున్నది. అట్లుండియు దీనిశక్తి రూ

పము లేమాత్రము దెలియఁబడకుండును. సత్వగుణము దీని ప్రత్యేక ప్రధానగుణమైయుండి యొకజాతికిఁ జెందినదిగాఁ జెప్పఁబడును.

2. వాయ్వగ్నిజలభూతములు:— ఇవిమూడును భిన్నగుణలక్షణములుగలవియై మూడు ప్రత్యేకజాతులుగా నగుపడుచున్నను మూడింటికినిఁ జలనము సమానగుణమై యుండుటఁబట్టి, వీనినొక వర్గముగానే చెప్పుదురు. సూక్ష్మరూపము ప్రసిద్ధవ్యవహారము వీనికిఁగలవు. ఈమూటిలో మొదటిదగు వాయుభూతమునకు దానిపైనుండు సత్వగుణ మధికమైయుండును. రెండవదగు నగ్నిభూతము ప్రధానమైన రజోగుణముతో నొప్పుచుండును. మూడవదగు జలభూతమునకుఁ గ్రిందఁ దమోగుణప్రధానమగు పృథివీభూతముండి తత్సంబంధముగల దగుట వలన దీనియందుఁ దమోగుణ మెక్కువగఁ జేరియుండును. అట్లుండియు నీమూడును, రజోగుణ సంబంధమునుబట్టి సజాతీయతంగలవై యొప్పుచున్నవి.

3. పృథివీభూతము:— దీనికి సుస్పష్టమగు స్థూలరూపము గలదు. ప్రసిద్ధమగు చలనగుణము దీనియం దగుపడకున్నది. (అచలయని పేరు) తమోగుణము దీని ప్రత్యేకప్రధానలక్షణము. ఇదియొక్కటే యొక్క జాతిగఁ జెప్పఁబడును.

పిండాండస్వరూపుఁడగు పురుషునియం దీపంచభూతములును పైఁదెలిపినట్లు ప్రత్యేకములగు మూడులక్షణములతో, ఆత్మ, మనస్సు, స్థూలరూపదేహముగా నొప్పుచున్నవి. మఱొక విధముగాఁ జూచిన నాకాశము కారణ శరీరముగను, వాయ్వగ్నిజలములు మూడునుకలసి సూక్ష్మశరీరముగను, పృథివీభూతము స్థూలదేహముగను వ్యవహరింపఁబడుచున్నవి. ఈధర్మమే బ్రహ్మాండమనఁబడు నీలోకమునందును వెలయుచున్నది. ఎట్లన, లోకము ఆద్యము, సర్వాధారము, ఆవర్ణమునని త్రివిధముగాఁ జెప్పఁబడును. అందున గోచరమగు నాకాశభూత మీశ్వరలక్షణముగ జెప్పఁబడు. వాయ్వగ్నిజలభూతములు ద్విజజాతికిఁ జెందిన బ్రహ్మ, క్షత్ర, వైశ్య వర్ణములనఁబడుచున్నవి.

ఇఁక మిగిలినపృథివీభూతము, శూద్రవర్ణముగఁ జెప్పఁబడుచు.

## —పంచవింశతి తత్త్వములు—

ఆకాశాది పంచభూతముల పంచీకరణములతో వివరముగ వ్రాయఁబడుచున్నవి.

## —పంచభూతముల గుణవివరణము—

1. ఆకాశమునకు శబ్దమును; 2. వాయువునకు శబ్దస్పర్శములును; 3. అగ్నికి శబ్దస్పర్శరూపములును; 4. జలమునకు శబ్దస్పర్శరసములును; 5. పృథివికి శబ్దస్పర్శరూపరసగంధములును, వరుసగా గుణములుగాఁ జెప్పఁబడును.

## —భూతపంచీకరణ విధానము—

ఆకాశాది సూక్ష్మపంచభూతములు నొక్కొక్కటి యైదు సమభాగములు కాగా నందు మొదటిభాగము, ఆభూతప్రత్యేకగుణము గలిగినదై యుండ మిగిలిన యర్ధభాగమును తదితరములగు నాల్గుభూతముల యష్టమాంశగుణములు గలదై యుండును. ఇందులకు విష్ణుయామిళ మిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ అథాకాశస్య భూతస్యసార్థం జ్ఞాతేతికథ్యతే
శేషార్థంతు చతుర్భాగాఁ కృత్వాసం మిశ్రమాచరేత్॥
పవనే మిళితాకాశం భాగం మానస ముచ్యతే
అనలే మిళితాకాశం బుద్ధి రిత్య భిధీయతే॥
జలేన మిళితాకాశం చిత్తమిత్యభిధీయతే
పృథివ్యాం మిళితాకాశం అహంకార ఇతీరతః॥

భావము:— ఆకాశములోని మొదటి యర్ధభాగము ప్రకాశించెడియాత్మ, జ్ఞాత, పురుషుఁడు క్షేత్రజ్ఞుఁడు, ఈశ్వరుఁడు అని పిలువఁబడుచున్నది. ఇక మిగిలినయర్ధభాగములోని ప్రతియష్టాంశ

మిట్లు మారును. వాయుయుక్తాకాశము మనస్సనియు, అగ్నియుక్తాకాశముబుద్ధియనియు, జలయుక్తాకాశము చిత్తమనియు, పృథివీయుక్తాకాశభాగము అహంకారమనియు వ్యవహరింపఁబడును,

శ్లో॥ తథాచవాయోరర్థంచ వ్యానంచ పఁకీర్తితమ్
శేషార్థే త్వేక భాగంచ సమానం వ్యోమమిశ్రితమ్॥ ౪
ఆగ్నేన మిశ్రితమ్ భాగం ఉదానమభిధీయతే
జలేనమిశ్రితం భాగం తత్ప్రాణ మితికథ్యతే॥ ౫
పృథివ్యాం మిశ్రితం భాగం అపాన మితికీర్తితమ్

భావము:— వాయుభూతమందలి శుద్ధార్థ భాగమునందలి యాత్మ వ్యానవాయువనఁబడును. దానిలోని యితరభాగమందలి ఆకాశయుక్తవాయువు సమానవాయువనియు, అగ్నియుక్తము ఉదానవాయువనియు, జలయుక్తము ప్రాణవాయువనియు, పృథివీయుక్తము అపానవాయువనియు చెప్పఁబడుచున్నవి.

శ్లో॥ ఆగ్నిమధ్యార్థభాగంతు అక్షిరిత్యభిధీయతే॥ ౬
తథావ్యోమ గతంభాగం శ్రోత్రమిత్యభిధీయతే
వాయునా మిశ్రితం భాగం త్వగింద్రియ మితీరితం॥ ౭
జలేన మిశ్రితం భాగం జిహ్వా ఇత్యభిధీయతే
పృథివ్యామిశ్రితం భాగం ఘ్రాణేంద్రియ మితీరితమ్॥ ౮

భావము:- అగ్నిభూతములోని శుద్ధార్థములోని యాత్మ నేత్రేంద్రియమనియు దానిలో మిగిలిన ఆకాశయుక్తాగ్న్యంశము శ్రోత్రేంద్రియమనియు, వాయుయుక్తము త్వగింద్రియమని, జలయుక్తముజిహ్వేంద్రియమని పృథివీయుక్తము ఘ్రాణేంద్రియమని చెప్పఁబడును.

శ్లో॥ జలేష్వర్థం సంజ్ఞేయం శబ్దం వ్యోమేచ మిశ్రితం
వాయునా మిశ్రితం భాగం స్పర్శం భవతి నిశ్చయం॥
అగ్నానసం మిశ్రితం భాగం రూప మిత్యభిధీయతే
పృథివ్యా మిళితం భాగం గంధమిత్యభిధీయతే॥

భావము:— జలభూతములోని శుద్ధమైన యర్థమునందలి యాత్మ రస మనఁబడుచున్నది. ఇఁక జలములోని యాకాశయుక్తము శబ్దమనియు, వాయుయుక్తము స్పర్శమనియు, అగ్నియుక్తము రూప మనియును, పృథివీయుక్తము గంధమనియుఁ బిలువఁబడుచున్నవి.

శ్లో॥ పృథివ్యా మర్థభాగంతు పాయురింద్రియ ముచ్యతే
వ్యోమేనమిళితం పృథ్వీభాగం వాగింద్రియం మతం
వాయునామిళితం పృథ్వీభాగం పాణీంద్రియం తథా
అగ్నినామిళితం భాగం పాదేంద్రియ మితిస్మృతం॥
జలేన మిళితం భాగం ఉపస్థ ఇతికథ్యతే

భావము:— పృథ్వీభూతముయొక్క శుద్ధమైన యర్థములోని ఆత్మ పాయువనఁబడును. మిగతలోని యాకాశయుక్తపృథివి వాక్కనియుఁ వాయుయుక్తము పాణియనియు, జలయుక్తము ఉపస్థయనియు పిలువఁబడుచున్నవి.

అట్లు పంచభూతములును పంచీకరణము నందుంచుట వలన నొక్కొక్కభూతము నైదు ప్రత్యేకతత్వములుగలదై పంచవింశతి తత్వము లేర్పడుచున్నవి. అందు నాకాశముయొక్క శుద్ధమగు నర్థ భాగము, పై వివరణమునుబట్టి క్షేత్రజ్ఞతత్వ మగుచున్నది. అదిపోను మిగిలిన చతుర్వింశతి(24) తత్వములును కలిసి క్షేత్రమనఁబడును. ఇట్టిక్షేత్రము నెఱింగినవాఁడు ఇరువదైదవతత్వ మనదగు నీశ్వరుఁడై యున్నాఁడు. అట్టి మూలతత్వమగు పరమాత్మ నిర్గుణము, నిష్క్రియ ము (గుణములు క్రియలులేనిది) అగుటవలన సర్వప్రపంచమునకు నీశ్వరుఁడు, నియామకుఁడగు కర్తయై సర్వభూతములను తమతమ నియతమివ్యాపారములం దుంచెడిబాధ్యతను వహించియున్నాఁడు. అందువలననే ధర్మోద్ధరణ భగవత్కృత్యమై యున్నది. మఱి భగ వంతునిచే నుద్ధరింపఁబడు ధర్మమెట్టిదో విచారింతము.

## —ధర్మము—

ధర్మమనగా భూతములకు నియతమై సహజమై యేర్పడి యుండిన వ్యాపారము లేక వాని విధివిహిత కర్మయని వివరణముఁ జెప్పవచ్చును. ఇంతవఱకు వివరించిన భూతముల సృష్టిపరిశీలనము వలన తేలిన సారాంశమెట్టిదో మరల నొకమారు సింహావలోకనము చేసిచూతము.

సర్వభూతములకును జన్యజనక, పోష్యపోషక, సేవ్యసేవక త్వము లున్నవనియు, వానికి నియతమగు కర్మకలదనియు, వానియం దు తరతమభేదము కేవలము వ్యవహారమునకుమాత్రి ముండుననియు సహజ సమాన గుణలక్షణములుగల భూతము లొకేవర్గముగ లేక జాతిగ నొప్పుచుండుననియుఁ దెలియఁగలిగితిమి. ఇంకను క్రిందిజాతి భూతమునకుఁ బైజాతిభూతము పోషకముగను క్రిందిజాతిభూతము పైదానిని సేవించునదై యుండుననియుఁ దెలియనయ్యెనుగదా! భూత ముల యీనియతికే ధర్మమని వేదశాస్త్రములందు వచింపఁబడినది. వేదాంతసారమని ప్రసిద్ధినొందిన శ్రీమ ద్భగవద్గీతాశాస్త్రమునందు శ్రీకృష్ణభగవానుఁ డర్జునునకుఁ గర్మయోగమనుపేర ధర్మతత్త్వము నే బోధించి పార్థుని నిజకర్మలయం దనురక్తుఁగావించి, ధర్మోద్ధరణ మొన రించియున్నాఁడు. జాతికి సహజముగ నొప్పియుండిన విధివిహిత కర్మను ధర్మశబ్దముచే నుచ్చరించి భగవానుఁడే ధర్మశబ్దమునకు వ్యాఖ్యానము గావించినాఁడు.

శ్లో॥ స్వధర్మమపిచావేక్ష్య నవికంపితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే॥2—31

అనగా అర్జునా! నీవు నీస్వధర్మమునైనను గుర్తించి, భయ పడకుము. క్షత్రియునకు ధర్మమగు యుద్ధమునకంటె వేఱొక శ్రేయ స్సనిలేదు. మఱియును,

శ్లో॥ అథచేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం నకరిష్యసి
తతస్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి॥ 2-33

అనగా ఒక వేళ నీవీధర్మయుక్తమగు యుద్ధమును జేయక పోయితివిపో, నీస్వధర్మమును కీర్తినిం గోలుపోవుటయేగాక, పాపమును పొందుచున్నావు సుమా!

ఈవిధముగా హితోపదేశము నొనరించి యర్జునుని, తద్వారా లోకమును ఉద్ధరించిన శ్రీకృష్ణభగవానుఁడు ధర్మసంస్థాపనార్థ మవతరించిన సగుణమూర్తియగు పరమేశ్వరుఁడే! ఇఁక నర్జునుఁడన్ననో పరమేశ్వరున కతిసన్నిహితస్థితి నందుకోఁగలిగిన జీవుడగుచున్నాఁడు. తన కత్యంతసమీపవర్తియై సేవించుచున్న జీవు నుద్ధరించు బాధ్యత యీశ్వరుని దేగదా!

—గీతోపదేశ హేతువు—

సూక్ష్మముగ విచారించిన గీతోపదేశహేతువు స్వధర్మనిర్వాహణమునం దేర్పడిన విమోహమును బాపుటయే యనవలయును. జీవాత్మస్వరూపుఁడగు నర్జుననందు స్నేహార్హుఁ డెవరో స్నేహమున కనర్హుఁ డెవరో తెలియని దోషమును, విహితధర్మమేదియో కానిదేదియో తెలియనిదోషమును స్పష్టముగ నగుపడుచున్నవి. ఈదోషద్వయమునఁ దగులుపడి కింకర్తవ్యతామూఢుఁడై ధనంజయుఁడు ప్రార్థింప భగవానుఁడు గీతారూపముగా శాస్త్రోపదేశమును గావింప వలసివచ్చెను.

ఈవిషయమునం దీక్రింది యార్యోక్తి కలదు.

శ్లో॥ అస్థానే స్నేహకారుణ్య ధర్మాధర్మ ధియాకులం
పార్థం ప్రపన్న ముద్దిశ్య శాస్త్రావతరణం కృతం॥
—భగవద్గీత—

పై కారణములంబట్టి ధర్మతత్త్వము నెఱుంగగోరెడువారికి,

భగవద్గీత ధర్మసత్రమని తెలియగలము. ఆయుద్గ్రంథము సర్వప్రాణులకును క్రమశిక్షణము నొసంగి, తద్వారా లోకమునకు రక్షణ పోషణముల నవలంబనము నొసంగి యుద్ధరించును. ఆనందసిద్ధి నందుట కందఱకు సమానావకాశము నాగ్రంథ మొసంగుచున్నది. నిష్పక్షపాతమగు సత్యబుద్ధితో, విచారించెడు వారికది సర్వసమ్మత తత్వమునే బోధించుచున్నది. ఆగీతాప్రాశస్త్యము నార్యులీక్రిందివిధముగ వాకొని యున్నారు.

శ్లో॥ సర్వోపనిషదో గావః దోగ్ధా గోపాలనందనః
పార్థోవత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతమ్ మహత్॥

తా॥ సత్యమగు బ్రహ్మతత్వమును బోధించెడు ఉపనిషత్తులన్నియు ఆవులు, వానిఁ బితికెడు గొల్లవాఁడు శ్రీకృష్ణుఁడే. అర్జునుడు గోవత్సము కాగా పండితులు దానిక్షీరమునుగ్రోలి యానందించెడు వారగుచున్నారు. మఱి క్షీరము మహత్తరమగు గీతామృతమే. ఈ ప్రశంసను కొందఱతిశయోక్తిగాఁ దలంపవచ్చును కాని యింతకు మించిన స్వభావోక్తియని యుండదు.

అదట్లుండ భగవద్గీత నారంభించు శ్లోకము ధర్మక్షేత్రేయను పదముతోనే యారంభమగుచున్నది. అట్లనుట, భగవద్గీత సర్వధర్మములకు క్షేత్రమని సూచించుచున్నది. ఆయుద్దేశ్యమునే కావ్యార్థసూచనగ వ్యాసమహర్షి ప్రయోగించియుండునని యంద తెఱుంగుదురు.

## — వ్యాసమహర్షి —

ఇఁక వ్యాసమహర్షి యన్ననో భగవత్ప్రోక్తమగు గీతాతత్వమును గ్రంథరూపముగఁ బ్రకటించి, లోకమునకు విజ్ఞాన భిక్షపెట్టిన పుణ్యమూర్తి. వ్యాసుఁడు భగవంతుని పదునేడవ యవతారమని, వ్యాసశబ్దమే రూఢిపఱచుచున్నది.

అదెట్లన వేదశాస్త్రములందు ప్రధానప్రయోగములగు నామ వాచకములు, బీజప్రాయములై సార్థకములై యొప్పుచున్నవి. గాని వస్తుతత్వమును దెలుపని నిష్ప్రయోజక పదజాలము మాత్ర మెంత మాత్రము కాజాలదు. అట్టిశబ్దముల సార్థకత 'కాదినవ' 'రాదినవ' 'పాదిపంచ' 'యాద్యష్ట' యనెడు నక్షరసంఖ్యాసూత్రము, అనగా అక్షరములకు నంకెలను దెలుపుచుండెడు శాస్త్రపద్ధతి ననుసరించి, పరికించితిమిపో తెలియగలము. అందువలన దానినిబట్టి వ్యాసశబ్దపు సంఖ్యయు నెఱుంగఁగలము. పై సూత్రమునుఁబట్టి వ్యా.అంకె 1 కాగా స అంకె 7 అయి; 17 అనుసంఖ్య మనకుఁ దెలుచున్నది. అందు వలననే భగవంతుని పదునేడవ యవతారము వ్యాసమహర్షి యని పైఁజెప్పఁబడినది.

ఇదిగాక యీమహర్షి వేదార్థముల బోధించెడు మహాభారతమును రచించెడుచో, 'సోహం' అను అజపాగాయత్రీ బ్రహ్మతత్వమును లేక ఆత్మ తత్వయుక్తమగు లింగదేహ స్వరూపమును తెలిపెడి పదునెనిమిది తత్వములతో నుండునట్లుగా రచించి, దానికి మరల సార్థకత యేర్పడు జయ నామము నొసంగియున్నాఁడు.

పైఁదెల్పిన అక్షరసాంఖ్యసూత్రము ననుసరించి జయశబ్దము పదునెనిమిదికిఁ బర్యాయపద మగుచున్నది. ఇఁక గమనింపుడు. భారత పర్వములు 18, భారతయుద్ధమునఁ బోరాడిన అక్షౌహిణులు 18, కడకు భారతాంతర్గత భగవద్గీతకు నధ్యాయములు 18. ఇవిట్లుండ. వ్యాసమహర్షి రచించిన పురాణములును, నుపపురాణములును గలిసి 18 సంఖ్యగనే యున్నవి.

మఱియును లోకమునం దఖండముగ వెలుగుచుండెడి, భాగవత తత్వవిజ్ఞాన సారస్వతమునకంతయుఁ, గారణమైనవాఁడు వ్యాస మహర్షి యనుట సర్వజనాంగీకారమైన విషయము. అట్టి వ్యాసకృత సారస్వతమున భగవద్గీత నాయకమణియై తన సహస్రదివ్యజ్ఞాన కిరణములతో ప్రకాశించుచు లోకమును పునీతము గావించు

చున్నది.

అట్టి భగవద్గీతాశాస్త్రమునందు భగవానుఁ డర్జునునకు ధర్మ స్వరూపమగు కర్మయోగమును బోధించి, తనచే సృజింపఁబడిన లోకతత్త్వమును చతుర్థాధ్యాయమునం దిట్లు వర్ణించుచున్నాఁడు.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః
తస్య కర్తార మపిమాం విద్ధ్యకర్తా రమవ్యయం॥ 4-13

తా॥ గుణకర్మ విభాగము ననుసరించి, నాలుగువర్ణములతో నొప్పిన యీలోకము నాచే సృజింపఁబడినది. ఇందులకు నేను కర్త నై యున్నాను. నన్ను కర్తనుగా నవ్యయునిగా నెఱుంగుము.

ధర్మస్వరూపమగు లోకతత్త్వము నెఱుంగుటకు నీశ్లోకము బీజప్రాయమగు మూలసూత్రముగ నొప్పుచున్నది. భగవంతునియొక్క యీజగత్సృష్టికి సాధనములు సత్త్వ రజ స్తమోగుణములు మూడును కర్మతోఁ గలిసి నాలుగగుచున్నవి. నాలుగువర్ణములుగానై బ్రాహ్మ, క్షత్ర, వైశ్య, శూద్రులను నభిధానములు గలిగి యొప్పుచున్నవి. ఇట్టి గుణకర్మ విభాగవ్యవస్థయే జగద్వ్యవస్థ యగుచున్నది. ఆజగత్తు మరల నాకాశాది పంచభూతాత్మకమే యగుచున్నది.

లోకమునందలి ప్రతిజీవియందును, ప్రతియణువునందును పంచభూతములే యొప్పుచున్నవి. పైశ్లోకమునందలి 'మయాసృష్టం' అను సమాసమును వచించిన యాతఁ డాకాశతత్త్వమునకుఁ జెందిన సగుణమూర్తియగు నీశ్వరుఁడు. ఆతఁడే శ్రీకృష్ణుఁడను వ్యవహార నామమున నొప్పెను. ఆకాశభూత మవర్ణమైన దంటిమిగదా! తదితరంబులగు వాయ్వగ్నిజలపృథివీభూతములు వర్ణయుతములై యున్నవి. వర్ణమన వర్ణించుటకు లేక గుర్తించుటకు ననువగు లక్షణమని చెప్పవలయును. అందువలనఁ బంచభూతములలో 'మయాసృష్టం' అని వచించిన యాకాశతత్త్వ రూపియగు నీశ్వరుఁడు పోగా మిగిలిన మూడును వ్యవహారధర్మముగల సత్త్వరజస్తమోగుణములకుఁ జెంది

యున్నవి. కనుక పృథివీభూతము కర్మస్వరూప వర్ణమై యుండితీర వలయును.

ఈనాలుగు వర్ణముల సమిష్టిస్వరూపమే లోకమైయున్నది. ఇదంతయు, వానికి నాధారమై, పైదవవాడగు నీశ్వరనిర్మితమై యున్నది. ఈయర్థమునే చాతుర్వర్ణ్యం 'మయాసృష్టం' అను వాక్యములతో భగావానుఁ డనగలిగెను.

సత్వరజస్తమోగుణములు మూడును మూడు వర్ణములతో నొప్పుచున్నవని శ్రుతియు నీక్రిందివిధముగాఁ జెప్పుచున్నది. పరికింపుడు.

శ్రుతి – అజామేకాం లోహిత శుక్లకృష్ణాం నహ్వీం ప్రజా జయంతీం స్వరూపాః॥

సత్వగుణము శ్వేత[ధవళ] వర్ణము, రజోగుణము రక్త[లోహిత] వర్ణము; తమోగుణము నీలవర్ణము కలిగియుండగా కర్మత్రివర్ణ సమ్మేళనచే మిశ్రమవర్ణమై యొప్పుచుండును. ఇట్టివర్ణములకు జనకము ఈశ్వరతత్వమగు ఆత్మ స్ఫటికమువలె స్వచ్ఛమై యొప్పుచున్నది.

ఇట్టి పంచతత్వములకు మూలభూతమగు పరమాత్మతత్వము నిశ్చలమగు తేజోబలముగఁ బ్రకాశించుచుండును. ప్రతిప్రాణియందును ఆత్మయొక్క తేజస్సు, ఆప్రాణికి సహజముగ నేర్పడియుండిన స్వభావ వర్ణము (త్రిగుణాత్మకమగు మనస్సుయొక్కరంగు) సందుఁ బ్రసరించి, వాని కర్మమయమగు స్థూలదేహమునందు వ్యాపించి, ఆ ప్రాణియొక్క యోగ్యతానుసారముగ వానిఁజుట్టునుఁ గొంతదూరము రంగుటద్దముగల లాంతరుసందలి దీపముకాంతివలె వ్యాపించియున్నది. ఇట్లు ప్రతిప్రాణి నావరించి వ్యాపించియుండిన నీలపీతాది వర్ణములతో, నొప్పియున్న యాత్మమయమగు దివ్యతేజము మానవుల కర్మమయములగు చర్మ చక్షుస్సులకు నెంతమాత్రము గోచరింపదు. కర్మమయములగు చర్మ చక్షుస్సులకుం గోచరించునవి కర్మమయములగు స్థూలరూపములు మాత్రమే.

ఈవిషయమునే శ్రీకృష్ణుఁడు పార్థున కీక్రిందిశ్లోకములో నెఱిఁగించియున్నాఁడు.

శ్లో॥ నతుమాం శక్యసే ద్రష్టుం అనేనైవ స్వచక్షుషా
దివ్యందదామితే చక్షుః పశ్యమే రూపమైశ్వరం॥

తా॥ ఓయర్జునా! ఈ నీకండ్లచేత నన్నుగాంచుట శక్యము కాదుగాన. నీకు దివ్యదృష్టి నొసంగుచున్నాను. నా యీశ్వర రూపమును గాంచుము.

మనస్సు లయమొందినఁగాని యాత్మ గోచరింపదు. సాధనరూపములగు భక్త్యభ్యాసాదులవలన, భగవదనుగ్రహము పొందిననే గాని, మనోలయ మేర్పడదు. అట్టి సామర్థ్యము సంపాదించి, యాతేజమును జూడఁగలిగినవారే మహర్షులు. అట్టి మహర్షులకు మాత్రము, ఆత్మయొక్క తేజ మేప్రాణియం దేవర్ణముతో, నెంతదూరము వ్యాపించియున్నదియు, నాప్రాణి స్వభావ మేవర్ణముతో భాసిల్లుచున్నదియు గోచరించుచుండును.

—మహర్షుల కృప—

అట్టి యధికార పురుషులగు మహర్షులు లోకమునందుఁగల సర్వపదార్థములందును, సర్వభూతములందును, ఏయేగుణ మెంత భాగము గలిగియున్నదియు, దాని కర్మస్వభావ మెట్లుండునదియు, ఆభూతములయొక్కయు, ఆపదార్థములయొక్కయుః, బరస్పర మిత్రత్వ శత్రుత్వ సమత్వాదులను బరిశీలించి. భూగోళ, ఖగోళ, పదార్థ విజ్ఞాన, వైద్య, యంత్ర మంత్రాదిశాస్త్రములను, లోకానుగ్రహబుద్ధితో రచించి ప్రజానీకమునకు మహోపకార మొనరించియున్నారు.

మఱియు నామహర్షులు తా మనుభవించిన యానందరూపమగు పరమాత్మను, అందఱును పొంది యానందింప వలయునని యెంచి

ఉత్తమ, మధ్యమ, మందాల్పాధికారుల చిత్తములకుఁ దగినట్లుగ, శ్రుతిస్మృతీతిహాస పురాణాది రూపములలో, నాపరతత్వ విజ్ఞానము నెంతగనో బోధించియున్నారు.

## —బ్రహ్మ విష్ణు మహేశ్వరావతారములు—

అట్టి మహర్షి ప్రణీతంబులగు పురాణాదులయందున్న తాత్వికార్థమును గ్రహించుట సామాన్యవిషయముగాదు. పురాణకథలందు విష్ణుని నాభికమలమునుండి నాలుగు ముఖములుగల బ్రహ్మదేవుఁడు జన్మించి సృష్టికార్యమును సాగించినట్లు వర్ణితమైయున్నది. అధునాతనులైన సామాన్య పండితులు పురాణోద్దేశ్యముల గుర్తింపఁజాలక యవన్నియుఁ బ్రకృతివిరుద్ధములగు నభూతకల్పనలనియు, నందుచే విశ్వాసార్హములు గావనియు, వాకొనుచుండిరి.

ఈవిషయమునుఁ బైఁజెప్పిన యంశములతోఁ సరిపోల్చికొని చూతము. పురాణములందు వర్ణితుఁడైన యాదివిష్ణువు యాకాశమూర్తిగనున్న యాత్మయే యగును. "వ్యాప్నోతీతి విష్ణుః" అను వ్యుత్పత్తినిబట్టి, విష్ణుశబ్దమున సర్వవ్యాపకత్వార్థమునే చెప్పవలయును. అదియే ధాత్వర్థమగును. ఆకాశము సర్వవ్యాపకమగుట వలన, విష్ణుశబ్దము దాని కన్వయించుట మిక్కిలి సమంజసము. అది ఆద్యము, సర్వాధారము, సర్వజనకము, సర్వనియామకమునని పైఁ జెప్పిన యంశములు, విష్ణునామక దైవికశక్తికి ద్యోతము లగును కదా! కాఁబట్టి విష్ణుసంబంధివర్ణితములైన భగవల్లక్షణము లాకాశలక్షణములనుటలోఁ గల వింతయేమి?

ఆకాశమునకు వాస్తవికవర్ణము లేకుండినను, లోకుల చర్మచక్షువుల కది నీలవర్ణభాసితముగ నగుపడుచున్నది, అందువలన విష్ణుని నీలశుభాంగుఁడనుట మిక్కిలి పొందికగ సరిపోయినది. ఇఁక నాదేవుని నాభికమలమున బ్రహ్మ యుద్భవించె ననుట విచారింతము.

నాభి శరీరమునందు సమస్థానమున(నడుమ) నుండునుగదా! అట్టి సమ త్వమునందే బ్రహ్మత్వసిద్ధి గలుగును. సమత్వమే బ్రహ్మత్వము. అదుండనిండు. విష్ణుఁడు పక్షివాహనుఁడని పురాణములు పలుకు చున్నవి. లోకము, సుఖము, దుఃఖము; పాపము, పుణ్యము; దేవతలు, అసురులు; అను పక్షద్వితయముతో [రెండు ప్రక్కలతో]నొప్పుచున్న దని యందఱకుఁ దెలిసిన విషయమేగదా! ఈరెండు పక్షములలో నేదానియందైన మొగ్గుసూపక సమభావముతో, రెంటిపై నధిష్ఠిం చినవాఁడై యుండినందున, భగవానుఁడు పక్షివాహనుఁ డనుటెంత సొంపుగనున్నదో, విజ్ఞులెఱింగిన యంశమే! ఇందువలన నాకాశము ను, మంచి, చెడ్డయను వివక్షలేక, యంతటను సమముగా నుండునది కాదా! మఱి యాకాశము పక్షివాహనుఁడగు నెన్ను డనుటలో నమ్మరానిదేది? ఇఁక విష్ణునకు చతుర్భుజములుఁ గలవని పౌరాణికు లనిరి. ఆకాశమున కాభుజముల నెట్లన్వయింపఁ జేయుటా యను మీమాంస కవకాశమే లేదు. ఆకాశమునకుఁ గర్మసాధనములుగా వాయ్వగ్నిజలపృథ్వీభూతము లొప్పునని పైఁ జెప్పితిమి. భుజములు కర్మసాధనములుగదా! అనాస్తే యాకాశమునకు భుజములనుటయే యందలి యథార్థము.

కాఁబట్టి పిండితార్థమేమన; విష్ణుఁ యందుఁ జతుర్ముఖబ్రహ్మ జన్మించెననగా, నాకాశమునందు వాయ్వగ్నిజలపృథ్వీభూతములు కలిగి నాల్గు ముఖముల సృష్టిని గావించుచున్నవని చెప్పినటులైనది. అదేలన సృష్టియంతయుఁ బై నాలుగుభూతముల సహాయము వలననే కలుగుచున్నదని మనమెఱింగిన విషయమే! అంతేగాదు. పైఁజెప్పఁ బడిన నాలుగుభూతములు నన్యోన్య సహకారములేక, సృష్టికార్య మును సాగింపఁజాలవు.

ఒక చిన్న యుదాహరణము తీసికొందము. ఒక బీజమువలన వృక్షము వెలువడవలయుననిన, దానికి భూమి, నీరు, వేడిమి, గాలి యుపసరములుగదా! వీని సహాయములేనిది విత్తనము వృక్షమగు

టుటులుండ మొలకైన నెట్లునా? కాఁబట్టి లోకనిర్మాణ మంతయును, భూత చతుష్టయముయొక్క, సమిష్టితత్వముననే, జరుగుచున్నదని దృఢముగ చెప్పఁగలిగితిమి. అందువలననే చతుర్ముఖబ్రహ్మ యనిన వాయ్వగ్నిజలపృథ్వీభూతముల సమిష్టి కర్మస్వరూపియని తేలినది.

"కర్మ బ్రహ్మస్వరూపిణి" అను నార్యోక్తి విననివారుండరు. ప్రతికర్మయు నాలుగంగముల సంబంధముతోనే యొప్పుచున్నది. లోకము కర్మస్వరూపమై చాతుర్వర్ణ్యముగా నున్నది. దీనికి జనకుఁడు, ప్రభువు, అయిదవవాఁడే యగుచున్నాఁడు. అతఁడె విష్ణు శబ్దవాచ్యుఁడై, యాకాశమూర్తియై యున్నాడు. ఇదియే పురాణము లందు వర్ణితమైన విష్ణ్వవతార తత్వము.

మఱియుఁ బురాణములలో, శివ, విష్ణు, బ్రహ్మ శక్తి పురాణ ములని వివిధములుగా నున్నవి. వానిలో నే పురాణమునందు నే దేవ తను ప్రధానప్రభువుగ, ప్రధానాధిదైవముగ నొకానొక విశేష్య వాచకములోఁ జెప్పియుండినను, యా దేవత యాకాశమూర్తి యనియే యన్వయించుకోవలయును. శైవ పురాణమునం దంతయు శివుఁడు సర్వాధిదేవతగఁ జేర్కొనఁబడియున్నాఁడు. శివశబ్దములో నుచ్చరిం పఁబడినది మంగళకరమగు నాకాశ భూతమే యగును. శివశబ్దమునకు చెప్పిన విశేషణములన్నియు నాకాశభూతమునకు నొప్పుచున్న వేగాని వేఱుకాదు. అందులో నొక్కయంశమునుఁదీసికొని పరికింతము.

ఆపురాణములం దన్నిచోట్లను శివుఁడు వృషభవాహనుఁడని వర్ణింపఁబడినాఁడుగదా! వృషభ మొక చతుష్పాత్తగు జంతువే గదా! దీని నెక్కుటచేతనే ఆదేవుఁడు వృషభవాహనుఁడై యున్నాఁడు. అజ్ఞానమే ప్రధానమైనదగుట కర్మరూపమగు లోక మొక వృషభ మగుచున్నది. దీనికి నంగంబులగు వాయ్వగ్నిజలపృథ్వులు నాలుగును సమపువాఁ డాకాశమూర్తియగు శంకరుఁ డనుటలో వింత యేమియు లేదు.

నాలుగుపాదము లగుచున్నవి. ఇట్టి యజ్ఞానమూర్తిని ఇట్లు పురాణములందు వర్ణితంబులగు ప్రధాన దేవతలను ఆకాశమూర్తి కన్వయించుకోవచ్చును. మఱొక విశేషము గమనింపుడు. అజ్ఞాన యుక్తము, కర్మస్వరూపము నామరూపాత్మకము, చాతుర్వర్ణ్యము నగు లోకమంతయును క్షేత్ర మనఁబడుచున్నది. నియంతగను, ప్రభువుగ నుండిన ఈశ్వరుఁడు క్షేత్రజ్ఞుఁడని సర్వపురాణములు నేక వాక్యముగ వాకొనుచో, పురాణమందు వెవ్వేరు దేవతలు చెప్పఁబడి రనుకొనుటకంటె వెఱ్ఱితనముండునా?

వేదశాస్త్రములందును, భారత, భాగవత, రామాయణాది సర్వప్రాచీన గ్రంథములందును, మహర్షులచేత అనేక చిత్రవిచిత్రము లగు రచనలతో, కథలతో, రూపకోత్ప్రేక్షాద్యనేకాలంకారములతో వర్ణింపఁబడియున్న సారస్వతమంతయు నీక్షేత్ర, క్షేత్రజ్ఞ, విజ్ఞానమే యని యెఱుంగవలయును.

శ్లో॥ ఋషిభి ర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతు మద్భిర్వినిశ్చితైః॥ గీత13.4

తా॥ ఋషులచే బహువిధములుగా చెప్పఁబడినదియు వివిధములగు వేదములచేత వేర్వేరుగా వర్ణింపఁబడినదియు, యుక్తి యుక్తములు సంశయరహితములగు బ్రహ్మసూత్ర పదములచేత వర్ణింపఁబడినదంతయు నీక్షేత్ర, క్షేత్రజ్ఞ విజ్ఞానమే యని తెలియ వలయును.

ఇట్టి తత్త్వసూత్రముతో, బరిశీలించెడువారికి పురాణాదులందు వైషమ్యభావము లుదయించవు. సర్వము 1. క్షేత్రము (లోకము) 2. క్షేత్రజ్ఞుఁడు(ప్రభువగు ఆత్మ) 3. మూలభూతమగు పరమాత్మగ విభజించుకొని వానిలక్షణములను యెఱింగినయెడల వర్ణితమంతయు సమన్వయ మగుచుండును. క్షేత్రస్వరూపమైయున్న, నామరూపా

త్మకమగు లోకమందుండెడి చరాచర జీవరాసులన్నియు నాలుగు జాతులుగా నొప్పుచున్నవి. అవేవన :

1. జరాయుజ జాతి — మావితోఁబుట్టు భూతములు, మనుష్యులు, మృగాదులు.
2. అండజ జాతి — గుడ్లలోనుండి పుట్టునవి : పక్షులు, పాములు, బల్లులు మొదలగునవి.
3. స్వేదజ జాతి — నీటిచెమ్మచేత జనించునవి : పేలు, నల్లులు, క్రిములు మొదలగునవి.
4. ఉద్భిజములు — భూమిని భేదించుకొని పుట్టునవి : తృణ, వృక్ష, లతా, పర్వతాదులు.

ఇట్టి చతుర్విధ జీవరాసులలో వాయ్వగ్నిజలపృథివీ భూతములయొక్క గుణలక్షణములు ప్రత్యేక విశేషములతో నగుపడుచున్నవి. జరాయుజ జాతికిఁ జెందిన మనుష్యులయందు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాది జాతులును; పశువులయందు గోమహిషాశ్వగజాది జాతులును; మృగాదులయందు ప్రసిద్ధముగ భిన్నజాతులును గలవుగదా!

ఇట్లుఁ బేర్కొనుచుండినఁ బ్రతియొక్కొక భిన్నజాతియందు జన్మసిద్ధములగు రూప స్వభావ క్రియాభేదములతో నవాంతర జాతులనంతముగ వెలయుచున్నవి.

ఉదాహరణకు మామిడినిఁ గైకొందము. అదొక్కజాతియై యుండియు నెన్నియో తెగలుగా నొప్పుచున్నది. ఇట్లు భిన్నజాతులుగ చెప్పఁబడు మామిడిచెట్లయందు ప్రతియొక్కదానియందును ఆకులు, పువ్వులు, కాయలు, పండ్లు, రుచి, గుణము, ఆకారము ప్రత్యేకలక్షణములతో నొప్పుచున్నవిగదా! కాన జాతియనగ జన్మచేతనే తెలియఁబడు సామాన్య రూప, క్రియా, గుణధర్మముఁ గలది

యని భావము తేలుచున్నది.

లోకమునం దిట్టి విభేద లక్షణములతో నొప్పెడి యనేక జాతులున్నను అవి యన్నియును గుణకర్మలయొక్క విభాగ తారతమ్యములవల్ల నేర్పడినవే గాని మూలములగు జాతులు లేక గుణములు మూడును, కర్మయొక్కటియు, గలసి నాలుగే యైయున్నవి. అవియే చతుర్వర్ణములని పలుమారు చెప్పితిమి. వేఱొకవిధమగును. ఉదాహరణ గైకొందము. సంఖ్యలలో దశ, శత, సహస్రాది సంఖ్యలు అనంతములుగ నున్నవిగదా! ఆసంఖ్యలన్నియును, మొదటి పదియంకముల సమ్మేళనమువల్లనే కలుగుచున్నవని యందఱెఱుంగుదురు. అటులనే లోకమం దనేక జాతులున్నను, అవియన్నియు, నాలుగు జాతులనుండియే జనించినవి. ఇట్లు నాలుగు జాతులుగ నొప్పెడి లోకస్వరూపమగు పరమాత్మ నారాధించుట కర్మమార్గమనియుఁ దీనికంతకు గారణముగ నొప్పెడి యీశ్వరస్వరూపమగు పరమాత్మ నారాధించుట జ్ఞానమార్గమనియు, మానవులు తరించుటకు రెండు మార్గములు గలవనియు భగవంతుఁ డిట్లాదేశించియున్నాడు.

శ్లో॥ లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం॥

గీత 3–3

తా॥ ఓయర్జునా! లోకమందు మానవులు తరించుటకు రెండువిధములగు నిష్ఠలు పూర్వము నాచేఁ జెప్పఁబడినవి. సాంఖ్యులకు జ్ఞాననిష్ఠయు, యోగులకు కర్మనిష్ఠయు చెప్పఁబడినవి. భగవంతుడీట్లు నిరూపించిన రెండునిష్ఠలు నిట్లు క్రమముగా నొప్పుచున్నవి.

| | |
|---|---|
| జ్ఞానయోగము | కర్మయోగము |
| బ్రహ్మస్వరూపము | ధర్మస్వరూపము |
| సాంఖ్యము | యోగము |
| నివృత్తిరూపము | ప్రవృత్తిరూపము |

| | |
|---|---|
| జ్ఞానము | కర్మయోగము |
| ఈశ్వరము | లోకము |
| అదృశ్యము | దృశ్యము |
| వర్ణ రహితము | చాతుర్వర్ణ్యము |

సాధకుల కిట్లు రెండునిష్ఠలు చెప్పఁబడియున్నను, ఈ రెండింటికిని; గమ్య మొక్కటియేయని భగవంతుఁ డీక్రిందివాక్యులతో స్పష్టపఱచి యున్నాఁడు.

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి సపశ్యతి॥ గీత5—5

తా॥ సాంఖ్యులచేత నేస్థానము పొందఁబడుచున్నదియో, కర్మయోగులచేతను ఆస్థానమే పొందఁబడుచున్నది. ఎవడు సాంఖ్య కర్మయోగముల రెంటి నొక్కటిగనే తెలిసికొనుచున్నాడో వాడే తెలిసినవాఁడు.

సాంఖ్యమార్గ మద్వైత మగుటవలన మందాధికారులకు సులభసాధ్యముగా నుండదు. యోగమార్గమగు కర్మతంత్రము వర్ణాశ్రమ ధర్మరూపమున చతుర్విధముగ నొప్పుచున్నది. ఈ రెండునిష్ఠలయందుగల తత్వమును భగవద్గీతయందు పేర్కొనిన సాంఖ్య, యోగ, శబ్దాక్షరములే తెలుపుచున్నవి విలోకింపుడు.

—సాంఖ్యశబ్ద నిర్వచనము—

సాంఖ్య శబ్దమునందుగల మూడక్షరములకు అక్షరసాంఖ్య సూత్రము ననుసరించి,

స — అను అక్షరమునకు 7 ఏడు చిహ్నమగును.

ఖ — అను అక్షరమునకు 2 రెండు చిహ్నమగును.

య — అను అక్షరమునకు 1 ఒకటి చిహ్నమగును.

ఈ మూడంకెలను కూడినచో 10 పదివచ్చును.

ఈ దశమసంఖ్య పరిపూర్ణతకుఁ జిహ్నముగ నొప్పుచున్నది. ఏలన లోకమునగల కోట్లకొలది సంఖ్యలన్నియు పదియంకముల నుండియే జనించియున్నవని ముందే చెప్పితిమి.

మఱియును యిట్టి దశమ సంఖ్యయందున్న రెండంకములలో మొదటిదగు ఏకాంకము ఒకటి యేమి తెల్పుచున్నది? ఏకము అద్వితీయమగు బ్రహ్మతత్వ మొక్కటియే గమ్యమైనదియు, సత్య మైనదియు నని తెలుపుచున్నదిగదా!

అట్టి ఏకాంకమును చేరియున్న రెండవదగు శూన్యాంకము సున్న, సత్యమగు ఏకాంకమునకు మిగిలినదంతయును శూన్యమేయని బోధించుచున్నదని యెంతస్పష్టముగ వివరించునో గమనింపుడు.

దీని నే,

"ఆఢ్యుఁడొక్కడున్న నందరు పూజ్యులు
లెక్కమీఁద సున్న లెక్కినట్లు"

అనెడు నార్యోక్తిచే వివరింపవచ్చును. సత్యమగు బ్రహ్మతత్వ మొకటి. యారంభమునందున్నందు వలన నే శూన్యరూపములగు నితర భూతములకెల్లను గణ్యత యేర్పడుచున్నది. అది లేకున్న నివి పూర్ణానుస్వారములే! ప్రథమాంకముపై నాధారపడియున్న సున్నల లో అంకెకు సున్న యెంతదూరమైనది యగుచుండునో, ఆసున్నకు విలువయు నంత తగ్గుచుండును. మఱి అంకెకు సున్న యెంత సామీప్య మునందుండునో దానివిలువయు నంతగ హెచ్చుచుండును.

అటులనే పరబ్రహ్మ సాన్నిధ్యమునకుఁ భూతము లెంతసమీప మునకుఁ జేరియుండునో యాభూతములకు మిగతవానిలో అంతటి విలువ యుండును. దూరమగుకొలదియు విలువ తగ్గుచుండుననియు సామాన్యబుద్ధికిఁ దోచుచుండును.

భగవద్గీతయందలి సాంఖ్యశబ్దమే : "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" యను వేద తాత్పర్యమును చాటి చెప్పుచున్నది.

## —యోగశబ్ద నిర్వచనము—

భగవద్గీతయందు ప్రయోగింపఁబడిన వర్ణాశ్రమ ధర్మరూపమున చతుర్విధమై యుండెడి రెండువదియగు ధర్మతంత్రమును తెలియఁ జేయుచున్న యోగశబ్దమునందుగల రెండక్షరములకు అక్షరసాంఖ్య సూత్రము ననుసరించి యర్థమునుఁ దెలిసికొందము.

యో — అనగ 1 ఒకటి అగును.
గ — అనగ 3 మూడు అగును.

ఈ రెండంకెలను కూడినయెడల 4 నాలుగు వచ్చును. ఈ నాలుగుసంఖ్య కర్మరూపమగు లోకమందుగల చతుర్వర్ణములను బోధించుచున్నది. పై యోగశబ్దమునందుగల అక్షరాంకములు క్రమముగ నుంచినయెడల ముందుభాగమునందు 1 ఒకటవ అంకము, ప్రక్కభాగమునందు 3 మూడవయంకము నేర్పడును.

శ్లో॥ అంకానాం వామతోగతిః

తా॥ "అక్షరాంకములు కుడిదిక్కునుండి యెడమదిక్కునకు వ్రాయవలెను" అనుపలుకుల ననుసరించి పై యంకెలనుంచితిమిపో ముందుగ మూడవయంకము దానిప్రక్కగ ఒకటివచ్చి 31 ముప్పదిఒకటి యగును.

ఇటుల విలోమముగ నేర్పడిన రెండంకములలో ముందు భాగమునందుగల మూడవయంకము కర్మరూపమగు లోకమందు గల చతుర్వర్ణములలోను మొదటగల బ్రహ్మ, క్షత్రియ, వైశ్య వర్ణములకుఁ జెందిన వేదాధికారముగల ద్విజజాతిని తెలుపుచున్నది. భగవంతునిచేత చతుర్వర్ణములుఁ జెప్పఁబడిన సందర్భములో వక్తము లైన సత్వ, రజ, స్తమోగుణములు మూడును ఒకజాతికిఁ జెంది, ముందున్నవిగాన పైఁదెలిపిన యంశమే స్థిరపడుచున్నది. మఱియు

గ్రంథాదిని చతుర్వర్ణములుగాఁ జెప్పఁబడిన వాయ్వగ్నిజలపృథివీ భూతములు నాలుగింటిలో సూక్ష్మరూపము, చలనగుణము, సామాన్య లక్షణముగా కలిగి యొకవర్గముగ నేర్పడి మొదటనున్న వాయ్వగ్ని జలభూతములను మూటినికూడ పై మూడవ యంకమే బోధించు చున్నది.

కార్యరూపమగు నీలోకమునందుండిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు లనియెడివారిలో ద్విజ జాతికిఁజెంది, వేదాధికారము, (ఉపనయనాది సంస్కారములు) గల బ్రహ్మ, క్షత్రియ, వైశ్య జాతులను మూడింటిని పైనుండు మూడవయంకె తెలుపుచున్నది. ఇఁక దానికిముందుండు నొకటి కర్మస్వరూపమగు శూద్రవర్ణ మనఁదగిన పృథివీభూతమును తెలుపుచున్నది. కాఁబట్టి పైఁదెలిసిన యోగశబ్దా క్షరాంక భావములను, భగవద్గీత మఱియొకచోటను, పై విషయము నిట్లు బలపఱచుచున్నది. విలోకింపుడు.

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై గ్గుణైః॥ గీత 18-41

ఈశ్లోకమందు నాలుగుజాతుల వారిని రెండుతరగతులకుఁ జెందిన వారినిగ విభజించి, మొదటితరగతి బ్రాహ్మణ, క్షత్రియ, విశాం అని ఒకవర్గముగా, ద్వంద్వసమాసముతో నొక వాక్యమునందు చేర్చి, "శూద్రాణాంచ" యను పదమును ప్రత్యేకముగా భగ వానుఁడు ప్రయోగించెను. ఇందువలన ముందుఁదెలిపిన యోగశబ్దా క్షరాంకములయొక్క భావములు స్పష్టమగుచున్నవి. మఱియు అక్షర ప్రపంచ సృష్టిని తెలియఁజేయు వ్యాకరణశాస్త్ర మాహేశ్వర సూత్రములందును

"హ-య-వ-ర-ట్" అనెడి సూత్రమందలి నాలు గక్షరం బులచే నాకాశ వాయ్వగ్నిజల భూతంబులను క్రమంబుగఁజెప్పఁబడ "లణ్" అనెడి ప్రత్యేకసూత్రముచేత పృథివీభూతము నొక్కటియుఁ

శై భూతవర్గంబునకు సంబంధము లేని దానినిగాఁ జెప్పఁబడియున్నది.

మఱియును వేదములు నాలుగున్నను ఋగ్యజుస్సామ వేదములు మూఁడు నొకవర్గముగ నొప్పుచుండ నథర్వణవేద మొక్కటియును, ప్రత్యేకముగఁ జెప్పఁబడుచున్నది.

శ్రుతి॥ త్రయోవేదా అజాయంత ఋగ్వేద ఏవాగ్నే రజాయత
యజుర్వేదో వాయోః సామవేద ఆదిత్యాత్॥
ఐతరేయం 5-32

తా॥ మూఁడు వేదములు జనించినవి. అందు ఋగ్వేద మగ్ని వలనను, యజుర్వేదము వాయువువలనను సామవేద మాదిత్యుని వలనను జనించెను. ఇదేవిషయమును-

మనుస్మృతియు నీక్రిందివిధముగాఁ దెలుపుచున్నది.

శ్లో॥ అగ్నివాయు రవిభ్యశ్చ త్రయం బ్రహ్మ సనాతనం
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థం ఋగ్యజు స్సామ లక్షణం॥ 1-2-3

తా॥ యజ్ఞసిద్ధికొఱకు సనాతన శబ్దబ్రహ్మరూపమగు ఋగ్యజుస్సామలక్షణముగల వేదత్రయమును పరమేశ్వరుఁడు జనింపఁ జేసెను.

## -వే దా ధి కా ర ము-

అట్టి వేదపఠనమునకుఁ గల యధికారమునుగూర్చి విచారింతము. లోకమందుగల చతుర్వర్ణముల వారిలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు మాత్రమే ఉపనయన సంస్కారము, ద్విజత్వము, వేదాధికారము గలదని శ్రుతిస్మృత్యాదులు దెల్పుచున్నవి. అందులకుశ్రుతి:

శ్రుతి॥ గాయత్ర్యా బ్రాహ్మణ మసృజ త్రిష్టుభా రాజన్యం జగత్యా
వైశ్యం న కేన చిచ్ఛూద్రం॥

తా॥ పరమేశ్వరుఁడు గాయత్రీ ఛందస్సుచేత బ్రాహ్మణుని

త్రిష్టుప్ ఛందస్సుచేత క్షత్రియుని, జగతీ ఛందస్సుచేత వైశ్యుని సృజించెను. శూద్రుని నేఛందస్సుచేతను సృజించలేదు.

ఇదేవిషయము భాగవతమునం దిట్లున్నది.

శ్లో॥ వివాహమాత్ర సంస్కారం శూద్రోపి లభతాం సదా
నకేన చిత్స మస్పృజత్ ఛందసా తం ప్రజాపతిః॥
భాగవతము 7–11

తా॥ వివాహమాత్రి సంస్కారమే శూద్రునికిఁ గలదు. బ్రహ్మదేవుఁడు ఏఛందస్సుచేతను శూద్రుని సృజించలేదు. మఱియు నాగ్రంథమే అధ్యయన మటులుండ వినుటైనను కూడదనుట కిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ స్త్రీ శూద్ర ద్విజ బంధూనాం త్రయీ న శ్రుతి గోచరా
కర్మశ్రేయసి మూఢానాం శ్రేయ ఏవం భ వేదిహ॥
ఇతిభారత మాఖ్యానాం కృపయా మునినా కృతం॥ 1–4

తా॥ స్త్రీలు, శూద్రులు, ద్విజాధములు వేదములు వినఁగూడనివారు. కాన వారి శ్రేయస్సునకై కృపతో వ్యాసమహర్షి వేదార్థమునుఁ దెలిపెడి భారతమును రచించెను.

ఈవిషయమున నిట్టి ప్రమాణము లింక నెన్నియోగలవు, బ్రహ్మసూత్రములయం దపశూద్రాధికరణమం దీవిషయము చక్కని హేతువాదములతో చర్చించఁబడి, మహర్షులచేత నిశ్చయింపఁబడి యున్నది. కాని మానవులలోఁ గొందఱకు వేదాధికారము గలదనుటయుఁ, గొందఱకు లేదనుటయు, భగవంతునికి పక్షపాతముండియూ లేక బ్రాహ్మణకల్పితమగు మోసమా? అని కొంద ఱాధునికులు తీవ్రవాదనకు దిగుచున్నారు. భగవంతునికి పక్షపాతము గలదనుట మిక్కిలి యవివేకము, ఏలందురా, గీతయందు భగవానుడే,

శ్లో॥ సమోహం సర్వభూతేషు నమే ద్వేష్యోస్తి నప్రియః
గీత 9–29

తా॥ నేను సర్వభూతములందును సముఁడనై యున్నాను. నాకు శత్రువుగాని, మిత్రుఁడుగాని లేఁడు. అని నుడివియున్నాడు.

కాన భగవంతునికి పక్షపాతబుద్ధి లేదని నిర్ధారణమగుచున్నది. ప్రకృతి యెప్పుడును బీజరూపమునుండి ఫలరూపముగను, ఫలరూపము నుండి బీజరూపముగ ననేక పరిణామ దశలతో నుండుట లక్షణంబుగా గలిగియున్నది. అటులనే మానవునందును బీజరూపమగు అత్యంత ముగ్ధావస్థ మొదలుకొని ఫలరూపమగు పరిపూర్ణ విజ్ఞానావస్థవఱకు గల యనేకతరగతు లున్నవి. వారివారి స్వభావములకు తగినట్లు వారి జాతియు, జాతికి తగిన విధి నియమములు, కర్మలును భగవంతునిచేత నిష్పక్షపాత దృష్టితో నిర్ణయింపఁబడియున్నవి.

వారి యోగ్యతానుసారముగ సర్వభూతములను దర్శించుటయే భగవంతుని యాశయము. ఇందులకు ప్రాపంచిక విషయము నుదాహరణగా పాఠశాలయందలి ఉపాధ్యాయునిఁ గైకొందము. అన్ని తరగతులలోని విద్యార్థులకును విజ్ఞానమును కలిగించుటయందు, నందఱయెడల నతఁడు సమభావము గలవాఁడుగనే యుండునుగదా! అట్టి ఆదర్శసిద్ధికి ఏతరగతి విద్యార్థులకు నేనియమములు విధించి, యెట్టి శిక్షణముతో, నేగ్రంథముల నెట్లుబోధించిన వారికిఁ గ్రమవికాసము కలుగునో గుర్తించి, యటుల నొనరించుచుండునుగదా! అట్టిచో విద్యార్థులయందు భేదభావముగలిగి కొందఱ కెక్కువఁ, గొందఱకుఁ దక్కువ పాఠముల బోధించు పక్షపాత ముపధ్యాయుఁడు కలిగి యున్నాఁడనుట పిచ్చి ప్రసంగము గాదా!

## —వేదమంత్రములు—

అందువలనఁ బైచెప్పినట్లునే నేకొందఱో యధికారముగల

వేదమంత్రముల ప్రాశస్త్యమును విచారింతము. మంత్రము వేదస్వరూపము. అది మనస్సుచేతను వాక్కుచేతను జనించుచున్నది. కనుకనే దానికి ద్విజత్వము(రెండుమార్లు పుట్టుట) ప్రాప్తించుచున్నది. మనస్సు త్రిగుణముల సంపుటియేగదా! మంత్రములయందు శబ్దాత్మకములగు అక్షరములయొక్క సంపుటీకరణశక్తియు, మనశ్శక్తియు మిళితమై యున్నది. దానికి అంగముగ క్రియాశక్తి వెలయుచున్నది.

జగద్వ్యాప్తములై యున్న అక్షరరూప శబ్దములను రేడియో యంత్రము ఆకర్షించి, మనము కోరినట్టి సంగీతాదులను మనకు వినిపించుచున్నట్లు బ్రహ్మాండవ్యాప్తమైయున్న అక్షరదేవతాస్వరూప చైతన్యశక్తిని మంత్రములు ప్రత్యక్షము సేయుచుండును. కాన మంత్రములయందు అక్షరరూపమున చైతన్యశక్తి యొప్పుచున్నది.

ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులకు మంత్రాక్షరములు సంచలనమును కలిగించి, ఇష్టార్థముల నిచ్చుచున్నవి. విద్యుచ్ఛక్తి యంత్రాలయు మెప్పుడును చైతన్యశక్తి భరితమైనదే యైయున్నను, చక్కని సంధానక్రమ మెఱిఁగి, ఆతంత్రులను సంధానము చేయగలిగినప్పుడే దానియందున్న విద్యుచ్ఛక్తి నియమిత కార్యములను చేయుచున్నది. అటులనే అక్షరములయందు చైతన్యశక్తి సర్వదా యొప్పుచున్నను, అనుసంధాన క్రమమెఱిఁగి యుపయోగించుకొనవలయును.

రసాయనశాస్త్రవేత్తలు భౌతికములగు వస్తువులలో నేయే వస్తువులను నేసంస్కారములతో నెంతెంత పరిమాణముగా చేర్చి యెట్లెట్లు పాకమొనర్చిన వానినుండి యేయేమిశక్తులు కలుగుచున్నవో ఆయాశక్తులవలన లోకమున కెట్టి యుపయోగములు చేయవచ్చునో గుర్తించి, వారు అభౌతికములగు వస్తువులతో తమ శాస్త్రీయవిధానముల కారణమున ననేకాద్భుతకార్యములనుఁ జేయుచున్నట్లు మహర్షులును, శక్తివంతములగు అక్షరములలో నేయేయక్షరముల నేయే స్వరములతో నేయేశబ్ద సమాస ఛందస్సులతో దేశకాలాదుల

నెటెంగి యెట్లెట్లు ప్రియోగించిన నేమేమిఫలములు సిద్ధించగలవో గుర్తించి, అక్షరశబ్ద విన్యాసవిధానములలో మంత్రవేత్తలై లోకోప కారమునకై వాని నేర్పఱచియున్నారు.

భౌతిక యంత్రప్రయోగములకు ఆశాస్త్రాధికారు లెట్లు అర్హు లగుచున్నారో, అట్లే మంత్రప్రయోగములకును, అట్టి తత్వవేత్తలే అర్హు లగుచున్నారని వేఱుగఁ దెలుప నవసరమేమి? మారణాస్త్ర కర్మాగారములయందు సంచరింపఁగల నైపుణ్యము తదధికారులకుఁ గలదుగాని. తెలియనివారు సంచరింమచే తటస్థించిన ప్రమాదముల పాలు గావలసివచ్చునుగదా! మఱొక విషయమును గమనింపుడు.

మా॥ మంత్రోహీన స్స్వరతో వర్ణతోవా మిథ్యాప్రయుక్తో నతమర్థమాహ
సవాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్ర శతుస్స్వరతో పరాధాత్॥

తా॥ స్వరహీనముగనో అక్షరహీనముగనో మంత్రమును ప్రయోగింపరాదు. అట్లు ప్రయోగించిన యెడల వజ్రమువంటి వేద వాక్కు ఇంద్రశత్రువగు వృత్రుఁడు. ఇంద్రునిపై స్వరవ్యత్యాస దోషముతోఁ బ్రయోగించిన మంత్రము, వానినే హింసించినట్లు, దానిని ప్రయోగించిన యజమానినే హింసించును.

శ్లో॥ హస్తహీనం తుయో ధీతే స్వరవర్ణ వివర్జితం
ఋగ్యజుస్సామ భిర్దగ్ధో వియోని మధిగచ్ఛతి॥

తా॥ వేదమంత్రము నెవ్వఁడు విన్యాసక్రమము లేక స్వరాక్షర హీనముగ చదువునో వాఁడు ఋగ్యజుస్సామములచేత దహింపఁబడి, తిర్యగ్జాతి యోనియందు జనించును.

మంత్రములయం దొకవిధమగు అలౌకిక దేవతాశక్తి గలదనుట సత్యము. లోకమునందు ఇప్పటికిని అట్టినిదర్శనము లెన్నియో సంభ వించుచున్నవి. కనుక నే,

శ్లో॥ దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనం తు దైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదేవతా॥

అనెడి యార్యోక్తి అమోఘమై వ్యాపించియున్నది,

## —మంత్రవర్ణముల విధి ప్రయోజనములు—

నామరూపములతో నొప్పుచుండిన సమస్తప్రకృతియు ఆత్మ శక్తిచేత నెల్లప్పుడును చలించుచుండును. జీవులకు సాధులుగ నేర్పడిన స్థూలసూక్ష్మశరీరములు. ఆజీవులయొక్క పూర్వకర్మ స్వభావముతో చలించుచుండును. మంత్రములును మఱియు పవిత్రపదార్థములను అట్టి జీవులయొక్క స్థూలసూక్ష్మశరీరములకు కలిగెడి అరిష్టదాయకములగు దుష్టచలనాదులును నిరోధించి, వానికి సద్వర్తనమును కలిగించుటయందు మిక్కిలిగా నుపయోగపడుచున్నవి. మంత్రములు శబ్దాక్షర ధ్వనులతో నొప్పుచుండును. మంత్రములయందలి, ఆయా అక్షరశబ్దధ్వనులు ఒక్కొక్కటియు సూక్ష్మలోకమునందు ఒక్కొక్క రూపవర్ణమును[రంగును] కలుగఁజేయుచున్నవి. స్థూలప్రపంచ వ్యవహారముల కధికారపదవి వహించిన దేవతలును సూక్ష్మలోకమునందు వివిధరూపవర్ణములుగల ఆకారములతో నొప్పియున్నారు. శాస్త్రీయ క్రమవిధానములతో మానవు లుచ్చరించెడి మంత్రాక్షరశబ్దములకు [ధ్వనులకు] అనురూపములగు రూపవర్ణములు, సూక్ష్మలోకమునందు జనించి, శబ్దవర్ణములతో సమాన రూపవర్ణముగల దేవతి నాకర్షించును. ఆదేవతి మానవుఁ డుచ్చరించిన మంత్రాక్షర శబ్దమువలన జనించిన రూపమునందు ప్రవేశించి, ఆశబ్దము నుచ్చరించిన పురుషునితో సంబంధముగలది యగుచున్నది.

సూక్ష్మదృష్టిగల మంత్రవేత్తలు భూలోకమందలి మానవులకు ఇష్టార్థముల నొసంగెడి సర్వకర్మలను ఫలింపఁజేయుటకు వాని స్వభావమునుఁబట్టి ఏయేకర్మలు ఫలించుటకు ఏయేదేవతలు అధి

కారులై యున్నారో వారియొక్క స్వరూప స్వభావవర్ణము లెట్టి వియో యెఱింగి అట్టి దేవతాస్వరూపమును జనింపఁజేయుగల శబ్దాక్షర మంత్రములను నిరూపించి, ఆయామంత్రములు ఫలించుటకుఁ దగిన ద్రవ్యకాలక్రియావిధులను నిర్ణయించియున్నారు. ఏమంత్ర మందు ఏదేవత బంధింపఁబడియున్నదియో, ఆదేవతయొక్క శరీర స్వభావము ననుసరించి, ఆమంత్రము నుచ్చరించు వానియొక్క స్థూలసూక్ష్మశరీరములకు చలనమును గలిగించుచుండును. మంత్రము నుచ్చరించువానియొక్క పారిశుద్ధ్యము ఏకాగ్రత భక్తి మొదలగువాని ననుసరించి, ఫలసిద్ధులకు అవధు లేర్పడియుండును. మంత్రము నుచ్చరించెడివాని శరీరమందు మంత్రదేవతయొక్క వర్ణరూప స్వభావముచే కలిగిన తీక్ష్ణచలనమును భరింపజాలని మలినప్రకృతి గలిగియుండిన యెడల ఆమంత్రము నుచ్చరించువాని శరీరమునందు మిక్కిలిబాధ జనించును. అట్టి తీక్ష్ణచలనమును భరింపఁజాలక ఒకప్పుడు ఉచ్చరించు వాని స్థూలశరీరముగాని, సూక్ష్మశరీరముగాని, రెండునుగాని చెడినను చెడవచ్చును. కావున దుష్టమగు మలినస్వభావము గలవాఁడు, గొప్ప తేజోవంతమగు మంత్రము నుచ్చరించినను, వినినను కడకు సమీపమందున్నను విశేషబాధలు పొందితీరును.

కొన్నితత్వంబులుగల శరీరులకు మంత్రములవలన స్మృతి చెడుటయు, ఆవేశాదులుఁ గలుగుటయు మనకు ననుభవగోచరమే యగుచున్నది గదా! మంత్రంబులే యననేల, కొన్ని వాద్యంబులయొక్క ధ్వనులు సైతము [చిందుతప్పెట, రణధ్వని]కొన్ని శరీరతత్వంబులకు ఆవేశాదు లనుఁ గలిగించుచుండుట చూచుచున్నాము. అదృశ్యంబగు సూక్ష్మ లోకమందు (అవకాశంబుగల బయలు)నియమ యుక్తమగు వర్ణరూప స్వభావంబుగల దైవీప్రకృతియు; నియమరహితంబును, వికారవర్ణ రూపస్వభావంబునుగల అసురీప్రకృతియు; వ్యాపించి యొప్పుచుండును. నియమబద్ధమగు దైవీప్రకృతికంటెను, నియమరహితమగు అసురీ ప్రకృతి విశేషవ్యాప్తి గలదై, లోకమందు నియమబద్ధులగువారి

కర్మనియమంబులకు విఘాతంబులు గలుగఁజేయుచుండును. కనుకనే లోకమందు నియమబద్ధులగు వారికన్నను, నియమరహితులు అధిక సంఖ్యలతో నొప్పుచుందురు. కాఁబట్టి నియమమే దైవతత్వము. నియమరాహిత్య మాసురతత్వమని యెఱుంగవలయును. లోకమందు శాస్త్రీయ నియమయుక్తంబులగు ధ్వనులన్నియును సూక్ష్మలోకమందలి దేవతాస్వరూపంబులను కలుగఁజేయుచున్నవి. దేవపూజాది కర్మలారంభించునపుడు ముందుగ ఆప్రదేశమందు అంతటను విశేషంబుగా వ్యాపించియుండిన ఆసురీప్రకృతిని వైదొలగంగఁ జేయుటకును దైవీ ప్రకృతి నాకర్షించుటకునై, తేజోవంతము బ్రహ్మరూపమగు ఓంకార ధ్వనిని కలుగఁజేసెడి ఘంటానాద మొనర్పవలెనని శాస్త్ర మాదేశించి యున్నది.

శ్లో॥ ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం
కుర్యా ఘంటారవం తత్ర దేవతాహ్వాన లాంఛనం॥

తా॥ దేవతల నాహ్వానించుటకును, రాక్షసులను వెడల నంపుటకును గుర్తుగ పూజాకాలమందు ఘంటానాదంబుఁ జేయుము.

మఱియు లోకమందలి ప్రతి శుభకార్యమందును శాస్త్రీయ విధి నియమంబులుగల మంగళ శుభవాద్యంబులును ప్రయోగించుటంతయు నియమయుక్త కర్మ ఫలసిద్ధి నొసంగెడి దేవతల నాహ్వానించుటకును, నియమరహితులగు రాక్షసులను పోద్రోలుటకునై యున్నది.

ప్రతి శుభకార్యము నారంభించుటకు ముందుగ సర్వవిఘ్న నిరాసనార్థంబుగఁ జేయబడెడి స్వస్తివాచక కర్మయం దిట్లు చెప్పఁ బడినది,

వాక్యము॥ యంకృత్వా సర్వవేద యజ్ఞక్రియా కరణ కర్మారంభాశ్శుభా
శ్శోభనాః ప్రవర్తంతే తమహ మోంకార మాదిం కృత్వా
భవద్భిరనుజ్ఞాతః పుణ్యం పుణ్యాహం వాచయిష్యే॥

తా॥ దేనినొనర్చిన సర్వవేదకర్మలు శుభప్రదంబులుగ

ప్రవర్తిల్లునో, యట్టి ఓంకారము నాదిగఁ జేసికొని మీచే యనుజ్ఞాతుఁడనై పుణ్యాహ వాచనంబుఁ జేయుచున్నాను.

సంస్కృతమునఁ బ్రతి యక్షరమునకు నేదోయొక దేవతా సంబంధముఁ గలదనుటకు స్కాంధపురాణ మహేశ్వరఖండమందు అక్షరదేవతా స్వరూపాదు లిట్లభివర్ణించి యున్నారు.

శ్లో॥ అకారః కథితో బ్రహ్మా ఉకారో విష్ణురుచ్యతే
మకారశ్చ స్మృతో రుద్ర స్త్రియశ్చైతే గుణాస్మృతాః ౧

అర్ధమాత్రాచ యామూర్ధ్ని పరమ స్ససదాశివః
ఏవ మోంకార మాహాత్మ్యం శ్రుతిరేషా సనాతనీ॥ ౨

ఓంకారస్యచ మాహత్మ్యం యధాత్మ్యేన నశక్యతే
వర్ణానా మయుతేనాపి గ్రంథకోటిభి రేవవా॥ ౩

పునర్వ్యత్సార సర్వస్వం ప్రోక్తం తచ్ఛ్రూయతాం పరం
అః కారాంతా అకారాద్యాః మనవస్తే చతుర్దశా॥ ౪

స్వాయంభువశ్చ స్వారోచిః ఔత్తమో రైవతస్తథా
తామసశ్చ చాక్షుషస్తథా వైవస్వతోధునా॥ ౫

సావర్ణి ర్బ్రహ్మసావర్ణి రుద్రసావర్ణి రేవచ
దక్షసావర్ణి రేవాపి ధర్మసావర్ణి రేవచ। ౬

రౌచ్యో భౌత్యస్తథాచాపి మనవోమీ చతుర్దశ
శ్వేతః పాండు స్తథారక్త స్తామ్రం పీతశ్చ కాపిలః ౭

కృష్ణ శ్యామస్తథా ధూమ్ర స్సుపిశంగః పిశంగకః॥
త్రివర్ణ శ్శబలోవర్ణః కర్కంధుర ఇతి క్రమాత్॥ ౮

వైవస్వతః క్షకారశ్చ శాతకృష్ణః ప్రదృశ్యతే
కకారాద్యా హకారాంతా స్త్రియస్త్రింశచ్చ దేవతాః ౯

కకారాద్యా ఠకారాంతా ఆదిత్యాద్వాదశ స్మృతాః
ధాతా మిత్రో ర్యమా శక్రో వరుణశ్చాంశు రేవచ॥ ౧౦

భగో వివస్వాన్ పూషాచ సవితా దశమస్తథా
ఏకాదశ స్తథా త్వష్టా విష్ణు ర్ద్వాదశ ఉచ్యతే॥ ౧౧

జఘన్య జస్ససర్వేషాం ఆదిత్యానాం గుణాధికః
డకరాద్యా బకారాంతాః రుద్రాశ్చైకాదశైవతు॥ ౧౩

కపాలీ పింగళో భీమో విరుపాక్షో విలోహితః
అజక శ్శాసన శ్శాస్తా శంభు శ్చండో భవ స్తథా॥ ౧౩

భకారాద్యా మకారాంతా అష్టౌహి వసవ మతాః
ధృవో ఘోరశ్చ సోమశ్చ ఆపశ్చైవ నలో2నలః॥ ౧౪

ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ అష్టౌతే వసవ స్మృతాః
సోహశ్చైత్వశ్వినా ఖ్యాతా త్రయ స్త్రింశదిమే స్మృతాః॥౧౫

అనుస్వారో విసర్గశ్చ జిహ్వామూలీయ ఏవచ
ఉపధ్మానియ ఇత్యేతే జరాయుజా స్తథాండజాః ౧౬

స్వేదజా శ్చోద్భిజా శ్చేతి తత్రో జీవాః ప్రకీర్తితాః
భావార్థః కథితశ్చాయం తత్వార్థం శృణు సాంప్రతం॥ ౧౭

ఏవమూం సర్వ్వమూన్ దేవాన్ సమాశ్రిత్య క్రియాపదాః
అర్థ మాత్రాత్మకే నిత్యే పదేలీనాస్తు ఏవహి॥ ౧౮

చతుర్ణాం జీవయోనీనాం తత్రైవ పరిముచ్యతే
యదాభూ న్మనసావాచా కర్మణాచయ జేత్సురాన్॥ ౧౯

యస్మిన్ శాస్త్రే త్వమీదేవాః మానితా నైవసాక్షిభిః
తచ్ఛాస్త్రం హీనమంతవ్యం యది బ్రహ్మాస్వయం వదేత్॥౨౦

అమీచ దేవా స్సర్వత్ర శ్రుతౌ మార్గే ప్రతిష్ఠితాః
పాషండ శాస్త్రే సర్వత్ర నిషిద్ధాం పాపకర్మభిః॥ ౨౧

తదమూన్ యోవ్యతిక్రమ్య తపోదాన మఖోజ్జ్వలం
ప్రకుర్వంతి దురాత్మానో వేపంతే మరుతః పథి॥ ౨౨

అహో మోహస్య మాహాత్మ్యం పశ్యతా విదితాత్మనాం
పతంతి మాతృకాం పాపాః మన్యంతే నసురానిహ॥ ౨౩

తా॥ అకారము-బ్రహ్మ, ఉకారము-విష్ణువు, మకారము-రుద్రుడు. ఇవిమూడును సత్వరజ స్తమోగుణములు. ఈమూడక్షరములుచేరి, ఓంకారమగుచున్నది. ఓంకారముయొక్క శిరోభాగమునందున్న అర్ధమాత్ర శివరూపమగు పరమాత్మ, వేదమిట్లు ఓంకారమహాత్మ్యమును వచించుచున్నది. ఓంకారమహాత్మ్యమును కొట్ల

కొలది గ్రంథములైనను పదివేల సంవత్సరములకైనను, చక్కఁగ వర్ణింపఁజాలవు.

అకారము మొదలుకొని అఃకారమువరకును గల అచ్చులు, చతుర్దశ మనువులు : 1. స్వాయంభువుఁడు 2. స్వారోచి, 3. ఔత్తముఁడు, 4. రైవతుఁడు. 5. తామసుఁడు, 6. చక్షుషుఁడు, 7. (ఇప్పటి) వైవస్వతుఁడు, 8. సావర్ణి, 9. బ్రహ్మసావర్ణి, 10. రుద్రసావర్ణి, 11. దక్షసావర్ణి, 11. ధర్మసావర్ణి; 13. రౌచ్యుఁడు, 14. భౌత్యుఁడు అనువారు. వీరికి క్రమముగ 1. శ్వేతవర్ణము 2. పాండువర్ణము 3. రక్తవర్ణము 4. తామ్రవర్ణము 5. పీతవర్ణము 6. కాపిలవర్ణము 7. కృష్ణవర్ణము 8. శ్యామవర్ణము 9. ధూమ్రవర్ణము 10. సుపిశంగ వర్ణము 11. పిశంగవర్ణము 12. త్రివర్ణము 13. శబలవర్ణము 14. కర్కంధురవర్ణము లుండును. మిగత అక్షరములలో చివరి భాగమునందుండిన క్షకారము యముఁడై యున్నాఁడు. అతఁడు కృష్ణ వర్ణముతో నొప్పుచుండును. కకారము మొదలుకొని హకారము అంతముగాగల 33 అక్షరములు ముప్పదిముగ్గురు దేవతలై యున్నారు. వీరిలో కకారము మొదలుకొని ఠకారమువరకుగల 12 అక్షరములు ద్వాదశాదిత్యులై యున్నారు. వారు క్రమముగా 1. ధాత 2. మిత్రుడు 3. అర్యముఁడు 4. శక్రుఁడు 5. వరుణుఁడు 6. అంశువు 7. భగుడు 8. వివస్వంతుఁడు 9 పూషుఁడు 10. సవితృఁడు 11. తృష్ణ 12. విష్ణువు అనఁబడుచున్నారు. వీరిలో క్రమముగా పై వానికన్నను క్రిందచెప్పఁబడిన ఆదిత్యుఁడు గుణాధికుఁడై యుండును.

డకారము మొదలుకొని బకారము వఱకునుగల పదునొకండక్షరములు ఏకాదశ రుద్రులై యున్నారు. వీరు క్రమముగ 1. కపాలి 2. పింగళుఁడు 3. భీముఁడు 4. విరూపాక్షుఁడు 5. విలోహితుఁడు 6. అజకుఁడు 7. శాసనుఁడు 8. శాస్త 9. శంభుఁడు 10. చండుఁడు 11. భవుఁడు అని పిలువఁబడుచున్నారు.

భకారము మొదలుకొని షకారము వఱకుగల ఎనిమిదిఅక్షు

రములు అష్టవస్తువులు, వీరు క్రమముగ 1. ధ్రువుఁడు 2. ఘోరుఁడు 3. సోముఁడు 4. అప్పు 5. నలుఁడు 6. అవలుఁడు 7. ప్రత్యూషుఁడు 8. ప్రభాసుఁడు అని పిలువఁబడుచున్నారు.

సకార హకారములు అశ్వనీదేవతలై యున్నారు.

పైనఁ జెప్పఁబడిన వసు రుద్రా దిత్యాశ్వనీదేవతలతో వారి సంఖ్య 33 అగుచున్నది. ఇఁక 1. అనుస్వారము 2. విసర్గ 3. జిహ్వా మూలీయము 4. ఉపధ్మానీయము ఇవినాలుగును జరాయుజాండజ స్వేదజోద్భిజములగు చతుర్విధ జీవజాతులు అని భావార్థము చెప్పఁ బడియున్నది,

అందలి తాత్వికార్థ మిట్లు చెప్పఁబడుచున్నది. ఏపురుషులు అక్షరస్వరూప దేవతలను సేవింపుచు, క్రియాపరు లగుచుందురో, వారు క్రమముగ అర్ధమాత్ర స్వరూపమగు పరమపదమున లీను లగుదురు.

మానవులు త్రికరణశుద్ధిగ ఫలాపేక్షను వదలి దేవతాప్రీతిగా యజ్ఞము లొనర్చినపుడే విముక్తి నొందుదురు. ఏశాస్త్రమందు పాపాత్ములచేత నీ యక్షరరూప దేవతలు సమ్మానింపఁ బడకుందురో, యట్టి శాస్త్రము నింద్యమైనదని బ్రహ్మ స్వయముగ చెప్పెను.

వేదమార్గమునందు క్రమముగ నీ యక్షరరూప దేవతలు ప్రతిష్ఠింపఁబడి యున్నారు. పాషండశాస్త్రములయందు పాపాత్ములు వీరిని సమ్మానింపరు. కావ నవి నింద్యములని చెప్పితిమి. ఎవ్వఁడు పైన చెప్పఁబడిన అక్షరరూప దేవతలను పూజించక తపస్సు, దానము, జపము మొదలగునవి జేయునో, అట్టి దురాత్ముఁడు బ్రహ్మ పదమునుఁ జేర్చెడి దేవమార్గమునుండి క్రిందికి గాలిచేత కొట్టఁబడు చున్నాడు. అజ్ఞానులయం దుండెడి మోహమాహాత్మ్యము మిక్కిలి ఆశ్చర్యము. ఏలన పాపాత్ములు సైతము తమ వాగ్జాలమునందు అన్ని

అక్షరములనుఁ బలుకుచుందురేగాని అక్షరదేవతలను పూజింప కుందురు!

—నవీనుల మంత్రపరిశోధన—

దివ్యజ్ఞాన సమాజమునకుఁ జెందిన 'లెడ్‌బీటర్ థామస్' అనెడి పాశ్చాత్య తత్త్వవేత్తలు వేదమంత్రములయొక్క శక్తిని గూర్చి తాము మిక్కిలి పరిశోధనలు గావించినట్లును, విధి విహిత బాహ్యాభ్యంతర శౌచాది నియమములుగల తత్త్వజ్ఞుఁడు స్వరయుక్త ముగ గాయత్రీమహామంత్రము నుచ్చరించినపుడు సూర్యమండలము నుండి యొక తేజస్సు బయలుఁదేరి, ఆమంత్రము నుచ్చరించెడివాని స్థానమునకువచ్చి, ఆస్థానమును ప్రకాశింపఁ జేయుననియు, అదే మంత్రమును అపస్వరముగ నుచ్చరించినయెడల, ఆవచ్చిన జ్యోతిస్సు తగ్గి వెడలిపోవుననియు, నందువలన సుస్వరమంత్రోచ్చారణమే ఆ యా దేవతల నాప్రదేశమునకు రప్పించుటయు సత్యమనియు ప్రకటించి యున్నారు. [ఈవిషయము ది. 20-10-47 త్రిలింగ పత్రిక యందలి అంజనేయశర్మగారి వ్యాసమునుండి గ్రహింపఁబడినది.]

మఱియు పాశ్చాత్య భౌతికశాస్త్రవేత్తయగు 'రాస్' అను పండితుఁడు తన యంత్రములద్వారా దేవతామంత్ర మహిమలను నిరూపించియున్నాఁడు. (1898 ప్రాంతమున వెలువడిన విద్యుచ్ఛక్తి పత్రికయందు నీవిషయము ప్రకటింపఁబడినట్లు జ్ఞాపకము)

వేదమంత్రములయందు కర్మలను ఫలపరిద మొనర్చునట్టి మహామహిమగల దేవతాశక్తి యొప్పుచున్న దనుట పరమసత్యమని యీపైకథనముయొక్క సారాంశము. అట్టి వేదమంత్రంబులయం దధికారము స్త్రీలకును, శూద్రులకును లేదని పరమ ప్రమాణమగు వేదము సహేతుకముగనే వచియించినది. లోకమందలి సర్వకర్మలును చతుర్విధంబులుగ నున్నవి. అవేవన 1. నిశ్చయించుట 2. చెప్పుట 3. చేయించుట 4. చేయుట యనునవి.

ఈనాల్గింటిలో మొదటిమూడు కర్మలను నిర్వర్తించుటకు జ్ఞానశక్తి, బుద్ధిబలము, నాలోచనయు నవసరంబులై యున్నవి. నాల్గవది నిర్వర్తించుటకుఁ బైమూటితో నవసరము లేదు. ఉదాహరణ కొక విషయము తీసికొందము. యుద్ధకర్మలో సాధకబాధకంబు లాలోచించి సరియగు కర్తవ్యమును నిశ్చయించువాఁ డొకఁడును, అట్టి నిశ్చయకర్తవ్యమును వివరముగఁ దెలిపి శాసించువాఁ డొకఁడు నుండురు. ఆచెప్పినవిధముగ సైన్యములను నడిపి యుద్ధముఁ జేయించువాఁడు మూఁడవవాఁడగును. యుద్ధ మొనర్చెడి సైన్యము నాల్గవ దగునుగదా! సైనికులను సైనికాధికారి యెటుల నాజ్ఞాపించునో వా రట్లు చేయవలయునేగాని, ఆలోచించి చేయవలసిన బాధ్యత వారి కుండదు. సైనికులకు మవశ్శక్తి లేకుండినను సైయధికారులకు మాత్ర మీా వివేక మెంతయో యుండవలయును.

## —మానవజీవితము—

మానవజీవితము, బీజము తల్లిగర్భములోఁ జేరినది మొదలు ప్రారంభమగుచున్నది. బీజమందు మానవునియొక్క శరీరాద్యవయవములును, ఆత్మబుద్ధి, మనస్సు, ఇంద్రియములను నిట్టివన్నియు నవ్యక్తములుగ నున్నవి.

క్రమక్రమముగ నవి క్షణక్షణంబునకు బరిణామము నొందుచు తల్లిగర్భమునుండి శిశురూపమున భూపతన మగునప్పటికి, శరీరాద్యవయవములు ప్రసిద్ధమగు స్ఫుటరూపములతో నుండును. అప్పటికిని ఆశిశువునందు మనోబుద్ధ్యాదులు అవ్యక్తములుగా నణగియే యుండును. కాన శైశవదశయంతయు మూఢావస్థతోనే యొప్పుచున్నదని చెప్పనేవలయును. మానవుని ప్రథమదశయగు శైశవము శూద్రవర్ణమై పరిణామ మందుచు క్రమముగ చాతుర్వర్ణ్య దశలను బొందుచున్నది.

శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః

తా॥ మానవుఁడు పుట్టుకచేత శూద్రుఁడుగ జనించు చున్నాడు. కర్మచేత ద్విజుఁ డగుచున్నాఁడు.

శిశుత్వమునందు మనశ్శక్తి స్ఫుటముగ లేని శరీరము మాత్రమే యుండును. అట్టి మూఢావస్థయు శూద్రవర్ణము పిదప క్రమముగ శిశుత్వమువీడి యుక్తాయుక్తము లాలోచించి, నిశ్చయించుకోఁగల మనశ్శక్తి దృఢమైనపుడు యుక్త కర్మార్హతఁ గలిగినపుడు, ద్విజుఁ డగును. సంగ్రహంబుగఁ జెప్పవలెననిన సదసద్వివేకమే ద్విజత్వము నకు లక్షణము. మానవునియం దెటుల క్రమపరిణామదశలు గలవో యటులనే మానవ సంఘంబునందును నవిగలవని సూక్ష్మబుద్ధులు గ్రహింపఁగలరు!

మానవసంఘంబునందు శైశవావస్థయందున్న జాతిని శూద్ర జాతియని వేదశాస్త్రంబులు నుడువుచున్నవి. వారికి మనశ్శక్తి మిక్కిలి యల్పముగ నుండును.

వారు శారీరక శ్రమోపజీవులైయుందురు. అట్టివారిని, మనస్సుతో నంతగ నిమిత్తములేనిదియు, శరీరాంగములతో మాత్రము చేయదగి నదియు నగు కర్మయందే నియోగించుటబాగు. ఆలోచించి నిశ్చ యించి చేయవలసియున్న బాధ్యతాయుత కర్మలయందు వారిని నియమించిన సంకల్పితఫలము చేకూరక పోవచ్చును.

మనస్సుపై నధికారము లేనివారికి వేదాధికారముండదు. వేదములు కార్యాకార్యములను చర్చించి, నిశ్చయించునవియై యున్నవి. త్రిగుణాత్మకమైనది మనస్సు, త్రిగుణాత్మకములైనవి వేద ములని వివరముగా ముందే తెల్పితిమి.

---

ఇది సామాన్యవిషయము. ఒకానొక శూద్రునందు మనోబుద్ధులు ప్రత్యేక వృద్ధి నందియుండుటకుఁ బెక్కు నిదర్శనములు గలవు.

ఉదాహరణకొక విషయమును గైకొందము. పాఠశాలయందలి యుపాధ్యాయుడు బాలురను మనస్సుతో నంతగ నిమిత్తములేని యక్షరములను దిద్దుచుండెడి శారీరక కర్మయందు గొంతకాలము అభ్యాసపఱచును. పిదప మనశ్శక్తి క్రమంబుగ వికాసంబు నొందుచుండ వానికి దగిన అంకెలు, లెక్కలు మొదలగువానిని నేర్ప నారంభించును.

అందువలన మనోదార్ఢ్యము లేనివానికి నాలోచించి నిశ్చయించవలసిన బాధ్యతలు, చిక్కులు, సంసారమునందు మిక్కుటముగ సంభవించినయెడల, వాడు రోగగ్రస్తుడగుటయో, ఉన్మత్తుడగుటయో సంభవించును. కాబట్టి సర్వులహితమును గోరియే వేదశాస్త్రము లెవరికి దగినకర్మలను వారికి విధించినవి. కాని పక్షపాత కల్పితము లెంతమాత్రముగావు. శక్తినెఱిగి పని కల్పించుట వాని ప్రధానాశయము.

మానవునికి జన్మప్రభృతి మరణాంతమువఱకు గలుగుచుండెడి క్షణక్షణ పరిణామదశలను చతుర్విధములుగ విభజించి వానికి చతుర్విధాశ్రమము లనెడిపేళ్లు వేదశాస్త్రము లాదేశించినవి.

అటులనే మానవ సంఘమునందు బహువిధ స్వరూప స్వభావములతో నొప్పుచుండెడి వారిని విభజించి చతుర్వర్ణము లనెడి పేళ్లు వేదములు నిర్దేశించినవి. మానవసంఘమునందిలి చతుర్వర్ణంబులలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు ఉపనయనాది సంస్కారములను విధించి, మంత్రియజ్ఞముల నాదేశించినవి. మంత్రియజ్ఞములనిన కాయిక, వాచిక, మానసికము లనెడి త్రికరణములతో, నీశ్వరార్పణముగ జేసెడి కర్మలని తెలియవలయును. అందువలన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు విధింపబడిన ప్రతికర్మయందును, త్రికరణము లేకీభవించి యుండవలయును. లేకున్న, గర్మలు నిరుపయోగములగును. ఆవిషయము వివరింతము.

కర్మయందు ఈశ్వరార్పణబుద్ధితో మనస్సు నేకాగ్రము చేయుట ప్రధానమైన విషయము. అట్లుండి ఏ కార్యముయొక్క ఫలసిద్ధికి ఏయే దేవతలు అధికారులలో తెలిసికొని ఆ దేవతలకు ప్రీతికరములగు శబ్దాక్షర నాదములుగల మంత్రసూక్తముల నుచ్చరించుట రెండవది. ఆ కర్మలకుఁ దగిన సాధనములతో శారీరక క్రియలనుఁ జేయుట మూడవది.

ఆ వేదములే స్త్రీశూద్రులకు అమంత్రయజ్ఞములను విధించినవి. అమంత్రయజ్ఞము లనగా మనస్సుతోడను, వాక్కుతోడను అంతగ నిమిత్తము లేని శారీరక కర్మలని తెలియవలెను. అంతేగాదు, ప్రతి మానవున కిట్లే యేదియో యొకవిధముగ యజ్ఞము(కర్మ) విధింపఁబడియే యున్నది.

—యజ్ఞతత్వము—

ఇఁక నా యజ్ఞతత్వమునుగూర్చి యోచింతము. లోకకల్యాణార్థమై భగవత్ప్రీతిగఁ జేయఁబడు చతురంగములతో కూడిన (చతుర్వర్ణములతోఁ గూడిన) సమష్టి రూపమగు కర్మయజ్ఞమని వివరింపవచ్చును.

ఈశ్వర స్వరూపమగు లోకమునందుగల సమస్త ప్రాణికోటులకు సర్వసౌఖ్యములు ఆనందము పుష్కలముగ లభింపలయునన్న యనేకములగు గృహములు, పాత్రలు, పదార్థములు, ధాన్యములు, సాధనములు, శయనము లెన్నియో. విధములుగాఁ గావలసి యుండును.

ఇట్టి స్వరూపసిద్ధి గలిగిన ప్రతిపదార్థము అనేకతరగతులతో నొప్పెడి యనేకజాతులయొక్క వివిధములైన వారివారి కర్మలచేత జనించిన సమిష్టిరూపమగు ఫలమై యున్నది. ఏజాతియందు జనించి యున్నవాఁ డెంతటి సమర్థుఁడై యున్నను, తా ననుభవించుటకును, జీవించుటకుఁ గావలసియున్న పదార్థములు తన కర్మవలననే సృష్టిం

చుకొనఁజాలఁడు. సర్వపదార్థములును మానవుల పరస్పరకర్మల సహాయమువలననే జనింపవలసి యున్నవి. కాన వివిధజాతి ప్రజలు వివిధములగు స్వకర్మల నొనర్చుచు పరస్పర సహాయ మొనర్చుకొనిననేగాని లోకకల్యాణము సేకూరఁజాలదు. కనుకనే శ్రీకృష్ణ భగవానుఁ డర్జునున కిట్లు శాసించి యున్నాఁడు.

శ్లో॥ నియతం కురుకర్మత్వం కర్మజ్యా యోహ్యా కర్మణః
శరీర యాత్రా పిచతే నప్రసిద్ధ్యే దకర్మణః॥ గీత 3–8

తా॥ ఓయర్జునా! నీవు నీకు నియతమై యుండిన కర్మ నొనరింపుము. కర్మ చేయకయుండుటకంటెఁ గర్మ చేయుట శ్రేష్ఠము. కర్మ చేయకుంటివేని నీకు దేహయాత్రగూడ సాగదు.

ప్రతిమానవునకు స్వభావానుగుణమగు జాతియును, జాతికి నియమితమై యుండిన కర్మయు సహజసిద్ధమై యొప్పుచున్నది. ప్రతి మానవున కిట్లు జననమాత్రమున విధివిహితమై యొప్పుచుండిన కర్మకే ధర్మమని పేరు. ప్రతిమానవుఁడును ధర్మమువలన అర్థము, అర్థము వలన కామసిద్ధియు నొందవలయుననియే విధినియమము. అందువలన నేజాతియందు జనించినవా రాజాతికర్మలను జేయుచున్నయెడల నర్థ కామములు తప్పక సిద్ధించును. అట్టియర్థకామ సిద్ధిచే సర్వుల కానందమును ప్రాప్తించును. అట్లొనర్పక, పరజాతికర్మల నొనర్చినయెడల తనజాతివలన లోకమునకుఁ గావలసిన కర్మలాభమునకు తాను భంగ మేర్పఱచిన వాఁడగుటయేగాక తానే పరజాతి కర్మ నొనరించునో ఆజాతియందు జన్మించియున్నవానికి లభించవలసిన అర్థకామములకు భంగము గలిగించినవాఁడై యీ పెఱజాతిహాని యసూయా ద్వేషముల కాస్పదుఁ డగుచున్నాఁడు. అదటులుండ స్వకర్మ నీశ్వరార్పణబుద్ధితోఁ జేసిన నది యజ్ఞ మగుచున్నది. ఫలాపేక్షతోఁ జేసిన యెడలఁ గర్మయగుచున్నది. యజ్ఞము మోక్షహేతువుకాగా కర్మ బంధన హేతువగుచున్నది.

ఈవిషయమునే భగవద్గీత యీక్రింది శ్లోకముతో నుదహరించుచున్నది.

శ్లో॥ యజ్ఞార్థా త్కర్మణో౽న్యత్ర లోకో౽యం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ సమాచర॥ గీత 3-9

తా॥ ఈశ్వర ప్రయోజనముకంటె నితరమగు కర్మ బంధకమైనది. కనుక యర్జునా! ఆసక్తి వదలి కర్మ చేయుము.

కర్మబంధము వలననే జన్మ మేర్పడుచున్నది. అందువలన మానవుఁడు కర్మఁజేయక క్షణకాలమైన నుండఁజాలఁడు.

శ్లో॥ నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥ గీత 3-5

తా॥ సర్వప్రాణులును ప్రకృతిబద్ధులై, స్వాతంత్ర్యములేక కర్మఁ జేయుచున్నారు. అందువలన నొకానొకనాఁడైన నొక క్షణకాలమైన నేదియేని కర్మఁ జేయక యుండలేరు.

శ్లో॥ సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వం ఏషవో౽స్త్విష్ట కామధుక్॥ గీత 3-10

తా॥ సృష్ట్యాదియందు బ్రహ్మదేవుఁడు యజ్ఞముతోసహా ప్రజలను సృష్టించి, యీయజ్ఞముతో మీ రభివృద్ధి నొందుఁడు. ఈ యజ్ఞము మీ కభీష్టముల నిచ్చుగాక యని వచించెను.

లోకమునం దొక్కొక్కరి కొక్కొక్కవిధమగు యజ్ఞము (కర్మ) స్వభావానుగుణముగ విధింపఁబడి యున్నదని చెప్పితిమిగదా! కాఁబట్టి వారాచరింపవలసిన యజ్ఞములు (కర్మలు) అనేకములు గలవు. లోకమునం దెవరేజాతియందు జనించియుండినను వారు వారిజాతికి సహజసిద్ధమై యుండిన కర్మ (ధర్మమువలన) అర్థము నార్జించి, ఆయర్థమువలన కామోపభోగము లందవచ్చును. కాని,

యట్లనుభవించెడి కామోపభోగములు శాస్త్రీయ స్వధర్మ జనితములై యుండవలయునే గాని లౌల్యప్రధానములై యుండరాదు.

శ్లో॥ ధర్మాऽవిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ॥

తా॥ ఓయర్జునా! ధర్మమునకు విరుద్ధముగా నుండని కామ స్వరూపుఁడనై నే నున్నానని తెలియుము.

సర్వమానవులును తమకు విధివిహితమగు కర్మను ప్రతిఫలాపేక్షలేక లోకస్వరూపమగు భగవదర్పణ బుద్ధితో నొనరించిన యెడల నది యజ్ఞమై వారికి బ్రహ్మస్వరూపమగు యానందసిద్ధి నొసంగును.

ఈవిషయము సర్వజాతులవారికిని బ్రహ్మానందము నొందుటకు సమానమగుహక్కును ప్రతిపాదించునదై యున్నది. ఇం దుచ్చ నీచ తర తమ భేదము లెంతమాత్రమును నుండవని భగవాను డిట్లు నుడివి యున్నాఁడు.

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం ఏనసర్వ మిదం తతం
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవాః॥ గీత 8–46

తా॥ ఏపరమాత్మవలన సర్వభూతములకును ప్రవృత్తి గలుగుచున్నదో, ఎవ్వనిచేత నీకగుపడు సర్వము వ్యాపింపఁబడియున్నదో అట్టి పరమాత్మను స్వకర్మ (పుట్టుకవలన తనకు విధివిహితమైయున్న ధర్మము) చేత పూజించినయెడల ప్రతి మానవుఁడును సిద్ధిని పొందుచున్నాడు.

భగవంతుఁ డిట్లు సర్వమానవులకును పురుషార్థములగు ధర్మార్థ కామమోక్షములను సమానముగ పంచిపెట్టి యున్నాఁడు. కాఁబట్టి ఇందు భగవంతుని పక్షపాతముగాని బ్రాహ్మణ కల్పిత మోసముగాని కొంచమైన నగుపడదు.

దేశమును పరిపాలించెడి రాజు వ్యవహారసౌలభ్యము కొఱకు

రాజ్యాంగమును నానాశాఖలుగ విభజించి, ఆయాశాఖల పరిపాలనమునకు తగిన యధికారపురుషులను నియమించి, వారివలన తన రాజ్యమునందున్న సర్వప్రాణులకు రక్షణ పోషణాదుల నొనరించుచున్నట్లుగనే భగవంతుఁడును తనరాజ్యమగు బ్రహ్మాండమును పాలించుటకు సూర్యచంద్రేంద్రాగ్నియమాదిదైవతములను శాఖాధికారులనుగ నియమించి, వారివలన లోకపాలన మొనరించుచున్నాఁడు.

రాజనియుక్తులగు నధికారపురుషుల యనుగ్రహము వలననే ప్రజలకు సర్వసౌఖ్యములు లభించుచున్నట్లే భగవన్నియమితులగు దైవముల యనుగ్రహము వలననే సకాలవర్షములు, సస్యములు ఫలించుటయును, రోగోత్పాతాదులు లేకుండుటయు సంభవించునని గ్రహింపనగును.

రాజనియుక్తాధికార పురుషుల జీవితము ప్రజలిచ్చెడి పన్నులపైననే యాధారపడియున్నట్లు భగవన్నియమిత దైవముల జీవితములును లోకు లొనర్చెడి యజ్ఞముల (సత్కర్మల) పైననే యాధారపడి యున్నవని రూఢిగఁ దెలుపనగును.

రాజ్యమందలి ప్రజలు అధికారులను, అధికారులు ప్రజలను పరస్పరానురాగములతో సన్మానించు కొనుచుండిన యెడల నుభయులకు సర్వసౌఖ్యములు గలుగుచుండునటులే లోకులు విధివిహిత శాస్త్రీయ సత్కర్మ లొనర్చుచు కర్మఫల లాభములను దైవార్పణ మొనర్చినయెడల దేవతలును లోకులకు సర్వసౌఖ్యములనుఁ చేకూర్తురని వేఱుగఁ జెప్పనెందులకు? ఇట్లొనర్చినయెడల నుభయలోకములకును కల్యాణము సేకూరును. ఇది భగవంతుని శాసనము కూడను.

పై విషయ మీక్రిందిశ్లోకమున వివరింపఁబడినది గమనింపుడు.

శ్లో॥ దేవా న్భావయ తానేన తే దేవా భావయంతువః
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥ గీత 3-11

తా॥ బ్రహ్మదేవుఁడు ప్రజలను యజ్ఞములతో సృష్టించి

యిట్లు వచించెను. మీరీ యజ్ఞములతో దేవతలను పూజింపుఁడు. ఆ దేవతలు మిమ్ముల రక్షింతురు. ఇట్లు పరస్పర సన్మానములవలన నుభయులును శ్రేయస్సు నొందఁగలరు.

శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హివో దేవా దాస్యంతే యజ్ఞ భావితాః
తైర్దత్తాన ప్రదాయైభ్యో యోభుంక్తే స్తేన ఏవసః। 3-12

తా॥ దేవతలు మీరొనర్చు యజ్ఞములతో తృప్తినొంది మీ కిష్టభోగార్థముల నిత్తురు. దేవతలచే నివ్వఁబడిన అన్నాదులను వారి కొసంగక (దేవతాప్రీతిగ త్యాగ మొనరింపక) యెవ్వఁడు భుజించునో వాఁడే దొంగ యగుచున్నాఁడు.

శ్లో॥ అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్న సంభవః
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః॥ గీత 3-14

తా॥ అన్నమువలన భూతములు తృప్తి యగుచున్నవి అన్నము వర్షమువలనను, వర్షము యజ్ఞము వలనను, యజ్ఞము కర్మలవలనను గలుగుచున్నవి.

శ్లో॥ అగ్నౌ వాజ్యాహుతిస్సమ్యక్ ఆదిత్య ముపతిష్ఠతే
ఆదిత్యా జ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః॥

తా॥ అగ్నియందు వ్రేల్చఁబడిన ఆజ్యాది హోమద్రవ్యము సూర్యునియందుఁ జేరుచున్నది. సూర్యునివలన వర్షము, వర్షమువలన అన్నమును, అన్నమువలన ప్రజలును గలుగుచున్నారు.

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
అఘాయురింద్రియా రామో మోఘం పార్థ సజీవతి॥
గీత 3-16

తా॥ ఇట్లు నాచే ప్రవర్తితమైయున్న వేదయజ్ఞరూపమగు జగచ్చక్రము నెవ్వఁ డనుసరింపకుండునో అట్టి విషయలోలుఁడు

పాపజీవనుఁడై వ్యర్థముగఁ బ్రతుకుచున్నాఁడు.

పుట్టగొడుగులవలె పుట్టి గిట్టుచుండెడి మానవకల్పితములగు ఇక్కాలపు ప్రణాళికల (ఇజముల) వలెగాక భగవంతుఁడు లోకకల్యాణమునకై భగవద్గీతారూపమగు ప్రణాళిక నేర్పఱచి, యనుగ్రహించి యున్నాఁడు. ఆప్రణాళికయందు అనేక గుణకర్మస్వభావములతో అనేక జాతులుగ మానవులు జన్మింతురనియును, వారికి జన్మమాత్రముననే విధివిహితమగు పిత్రియజాతి వృత్తికర్మ (సధర్మము) యేర్పడియున్నదనియు, వారాకర్మను విధిగఁ జేయుచు, తత్కర్మఫలములను లోకకల్యాణమునకై త్యాగ మొనరింపవలెననియు, తా మనుభవించు కామోపభోగములు, ధర్మజనితములై యుండవలెననియు ప్రతివానిని శాసించుచున్నవి. ఇది, జాత్యహంకారములకుగాని, అసూయాద్వేషములకుగాని, సోమరితనమునకుగాని ఎంతమాత్రము చోటీయక సర్వులకును తృప్తియు, నానందమునుఁ గలుగఁజేయుచు సర్వులకు లోకస్వరూపమగు భగవత్సేవనే విధించియున్నది. ఆ విషయమును భగవంతుఁ డిట్లు సెలవిచ్చి యున్నాఁడు.

శ్లో॥ గీతాజ్ఞాన మువాశ్రిత్య త్రీన్ లోకాన్ పాలయామ్యహం॥

తా॥ గీతాజ్ఞానము నాధారముగఁ జేసికొని మూఁడులోకములను పాలించుచున్నాను.

ఇప్పుడు లోకమునందు వ్యాపించియుండిన సంకర వాతావరణమువలన ఈప్రణాళిక కొందఱకు రుచింపక పోవచ్చును. కాని, యే నాటికైనను లోకమునకు శ్రేయస్సు లభించుటకు గీతాప్రణాళికయే శరణ్యము గాకతప్పదు.

ఈ విధమున వర్ణితంబులగు ఫలకర్మల కాధారభూత మగునది జగత్తు. ఇది యొక చక్రము. అట్టి జగచ్చక్రమునుగూర్చి యిఁకఁ గొంత విచారింతము.

## —జగచ్చక్రము—

జగచ్చక్రము కుమ్మరిసాలెవలె నొప్పుచున్నది. కనుకనే జగత్తత్త్వమును దెలుపుటకు వేదాంతు లుపమానముగ కుమ్మరిసాలెను గ్రహించియున్నారు. కుమ్మరిసాలెకు వంకెలు నాలుగుండును. ఇవి జగత్తునందుగల చతుర్వర్ణములను దెలుపుచున్నవి. ఈ వంకె లిరుపార్శ్వములయం దుండెడి వంకెలతో పరస్పరము జేరుచు చక్రమున కనుకూలముగ వంగియుండును. అవంగియుండుట జగత్తునందలి చతుర్వర్ణములయొక్క పరస్పర సహాయావలంబనమును సూచించుచున్నది గదా! ఈ నాలుగువంకెలకును నాలుగాకులు సంధింపబడియున్నవి. ఈయాకులు నాలుగును చతుర్వర్ణములయొక్క విధివిహితములగు చక్కని సహజధర్మములను దెలుపుచున్నవి. కుమ్మరిసాలెకు మధ్యభాగమునందు పై నాలుగాకులు చేరుచుండెడి మధ్యకేంద్ర ముండును గదా! అది చతుర్ముఖ బ్రహ్మస్వరూపమును దెలుపుచున్నది.

కుమ్మరిసాలెలోని మధ్యకేంద్రము చక్కగ నిలిచియుండిన అచలమగు ఇనుప యిరుసుమీద నాధారపడియుండునుగదా! అది సర్వాధారభూతమగు నిర్గుణబ్రహ్మమును దెలుపుచున్నది. ఈ చక్రమును ద్రిప్పువాడు కుమ్మరి. అతడు సగుణరూపుడగు ఈశ్వరుని తెలుపును. దీనినుండి జనించెడు నానావిధములగు పాత్రలు సృష్టిభూత పదార్థములను దెలుపుచున్నవి. కాబట్టి లోకమునందుగల ప్రతి భూతమును ప్రతిపదార్థమును, ప్రతికర్మయును భగవంతుని జగద్రూపమగు చిద్విలాసమునే బోధించుచున్నవి,

వేయేల కాలక్షేపముకొఱకు వినోదార్థముగ నాడుకొనుచుండెడి 'విశ్వేట్', చతురంగము (చదరంగము), పులిజీతము, పరమపదసోపానపఠము, ఓమనగుంతలు, మొదలగు నాటలయందును ధర్మస్వరూపమగు జగత్తత్త్వ బోధన మెంతయో గోచరించుచున్నది.

ఉదాహరణమున 'విశ్వేట్' అనెడి ఆటను గైకొందము.

## -విశ్వేట్ (Playing Cards)-

ఈయాటఁ దెలియనివా రరుదు. ఇది నాలుగుజాతుల చిత్ర పత్రములతో నాడుకొను నొక క్రీడయై యున్నది. దీని యథార్థ నామము విశ్వస్ఫుటము లేక విశ్వస్ఫోటము అని చెప్పుదురు. అట్లనగా జగత్తత్వమునుఁ దెలిపెడిదని యర్థము. ఈనామము జగద్విధానమంతయు నొక ఆటయే యని తెల్పుచున్నది, దీనివిషయము తెల్పుటకు ముందు విశ్వశబ్ద సాంకేతికార్థము వివరింతము.

## —విశ్వము—

విశ్వమనగా బ్రహ్మాండము లేక జగత్తు; ఇది పదమూడువిధములుగ నొప్పుచున్నది. అక్షరసాంఖ్యసూత్రము ననుసరించి విశ్వశబ్దము నందుగల మూడక్షరములకు ఈక్రిందిసంఖ్యలు తేలుచున్నవి.

వి — 4 నాలుగు సంఖ్య అగును.
శ — 5 ఐదు సంఖ్య అగును.
వ — 4 నాలుగు సంఖ్య అగును.

ఈమూడు సంఖ్యలను కూడిన 13 పదమూడు సంఖ్య యేర్పడును. కాఁబట్టి విశ్వమనగా పదమూడవసంఖ్యకు సంజ్ఞయని తేలినది గదా! ఇఁక 'విశ్వేట్' ఆటవిధానము గమనింపుఁడు.

దీనియందు 1. విశ్వేట్ 2. కళావర్ 3. ఆటీన్ 4. డైమన్ ♦ అనెడి నాలుగురకములగు చుక్కలు బొమ్మలుగల దళసరికాగితములు ఏబదిరెండుండును. ఆకాగితములయొక్క వెనుకభాగములన్నియు నొకటే విధమగు ఆకార స్వరూప ప్రమాణ వర్ణములతో నొప్పియుండును. ఈకాగితము లన్నియును నాలుగుజాతులుగ మాత్రముండి యుం

♦ (Spade, Clubs Hearts, Diamonds – ) అను ఆంగ్లపదములకు మనదేశపు వాడుకపదము లీఁబడినవి.

దొక్కొక్కజాతికి 13 కాగితము లుండును. 10 కాగితములు 1 మొదలు 10 వఱకును గల చుక్కలగుర్తులతో నుండును. మిగిలిన మూడుకాగితములును బొమ్మలుగలిగి యుండును. ఈకాగితములన్నియు నొకపెట్టె యందుండును.

ఇఁక దీనిఁగూర్చిన తత్త్వార్థమును వివరింతము. ఈపెట్టె బ్రహ్మాండమును సూచించుచున్నది. దీనియందుగల నాలుగుజాతుల కాగితములు బ్రహ్మాండమునందుగల చాతుర్వర్ణ్యజీవరాసులనుఁ దెలుపుచున్నవి. ఈకాగితములయొక్క వెలిభాగములు బ్రహ్మాండమునందలి జీవరాసుల స్థూలశరీరములను సూచించుచున్నవి. మఱియందలి పదిచుక్కల కాగితములు బ్రహ్మాండమునందలి జీవరాసులలోని ఏకేంద్రియ, ద్వీంద్రియ, త్రీంద్రియ, చతురింద్రియాది దశవిధేంద్రియ జీవులవఱకు నుండుట సూచించును. బ్రహ్మాండమునం దిట్టి యేకేంద్రియాది దశవిధేంద్రియ పర్యంతముగల ప్రత్యేకజీవములు గలవని ఆయుర్వేద శిక్షాదర్శనమను గ్రంథమున సూత్రస్థానము పదియవ అధ్యాయములో ద్రివ్యము అనుశీర్షికలో వ్రాయఁబడియున్నది విలోకింపుఁడు.

ఇట్టిజీవరాసులలో మానవుఁడు మాత్రమే పదియింద్రియములను పరిపూర్ణస్వరూపముగాఁ గలవాఁడై యున్నాఁడు. అదియునుగాక పైఁజెప్పినయంకములలో దశమాంకము పరిపూర్ణతకు చిహ్నముగ నొప్పుచున్నది. విశ్వేట్ నందు పదిచుక్కలకు తర్వాతనే మానవత్వమునకు చిహ్నమైన సర్వావయవములునుఁ గలిగిన బొమ్మలుఁ గలిగియుండుట గమనింపఁ దగినది. ఆబొమ్మలలో జాకీయనుబొమ్మ నపుంసక తత్వమునుఁ దెలుపుచున్న దందురు. దానికి పైనుండిన రాణీయనుబొమ్మ స్త్రీత్వమును సూచించుచున్నది. దానికిఁ దర్వాతనుండిన రాజుబొమ్మ పురుషతత్వమును తెలియఁజేయుచున్నది.

బ్రహ్మాండంబునం దిట్లు పదమూఁడువిధములగు స్వరూపములు

గల జీవరాసు లుండునని యీయాట సూచించెడినిగదా!

"పురుషోయం లోకసమ్మితః".

పురుషుఁడు లోకమునకు సమానుఁడు. అనెడు వచనమునుఁ బట్టియు పిండాండమగు మానవునియందును పదమూడు తత్వములుఁ గలవు. మానవునియందుఁ బది యింద్రియములును వానికిఁ బైన నపుంసకలింగమునకుఁ జెందియున్న మనస్సును, మనస్సుకుపైన స్త్రీలింగమునకుఁ జెందియున్న బుద్ధియును, దానికిఁబైగా పుంలింగంబునకుఁ జెందిన పురుషస్వరూపుఁడగు ఆత్మయు నుండుటవలన మానవుఁడు పదమూడు తత్వంబులతో నొప్పుచున్నాఁడని చెప్పితిమి.

పిండాండమునందలి విశ్వతత్వములను భగవద్గీత యిట్లుగాఁ బేర్కొనుచున్నది.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరాబుద్ధిః యోబుద్ధేః పరత స్తుసః॥ గీత 3-42

తా॥ పది యింద్రియములు శ్రేష్ఠములు. ఇంద్రియములకంటె మనస్సు శ్రేష్ఠమైనది. మనస్సునకంటెను బుద్ధి శ్రేష్ఠమైనది. బుద్ధికంటెను ఆత్మ శ్రేష్ఠుఁడు.

కాఁబట్టి ప్రతిమానవునియం దిట్లు విశ్వరూప మొప్పుచున్నదని చెప్పవలయును.

## —విశ్వేటు విశేషములు—

విశ్వేటుపెట్టెయందు 54 కాగితము లుండును. ఒక్కొక్క జాతికి 13 ప్రకారము నాలుగు జాతులకును 52 కాగితములును, వీనికి దోడుగ 'జోకర్' అను వికార స్వరూపముగల బొమ్మ యొకటి యుండుఁ గాన్పించును. ఈ'జోకర్' కాగిత మన్నిజాతుల కాగితములందు నన్నియాటలయందును జేరుచుండును.

ఈ 'జోకర్' బ్రహ్మాండమందుగల సర్వభూతములందును జేరియున్న కర్మాభియుక్త త్రిగుణాత్మికయగు మాయను సూచించు చున్నది. సర్వవికారములును మాయకుఁ జెందియుండుననుట లోక విదిత విషయమే. కనుక జోక రట్టిదిగాఁ జూపఁబడినది. ఈ యేబది మూడు కాగితములుగాక ఆ పెట్టెయం దేయేవిధమగు చుక్కగాని బొమ్మగాని లేని యొక తెల్లకాగిత ముండును. ఈకాగిత మేయాట లోగాని నేకాగితముతోగాని సంబంధము లేనిదిగా నుండును. ఇది మాయకు పరమందున్న నిస్సంగము, నిర్వికారమగు పరమాత్మయని రూఢిగఁ దెలుపవచ్చును.

ఇఁక దీనిలో నాఁడబడెడు నాటల గమనింతము. జోకర్ కాగితము మొదలుకొని నాలుగుజాతుల కాగితములుఁ జేరి యనేక విధములగు ఆటల కాస్పదమగుచున్నవి. మఱియును ఆ యాటలన్నియును లాభాలాభ, సుఖదుఃఖ, కామక్రోధాదులను జనింపఁ జేయునవిగనే యుండును. ఈకాగితముల నాయా యాటలోఁ, బా ల్గొనువారల కందఱకును కలిపి సమానముగ పంచుదురు. పంపక ములో ఆటలోఁజేరిన ప్రతివానికిఁ గొన్నికాగితములు వచ్చుచుండును. అట్లు వచ్చిన కాగితములు పొందినవాని కొకప్పుడు సుఖదాయకము గను, లాభకరముగను మఱియొకప్పుడు నష్టకరముగను, ఇంకొకప్పుడు మిశ్రమ భావజనకముగా నుండునుగదా! ఈకాగితములయొక్క పంప కపుసామ్యము ప్రతియొక్క జన్మమందును ప్రాణికి స్వకర్మానుసార ముగ గలుగుచుండెడి సుఖదుఃఖాదులను సూచించును. ఈయాటలో గలిగెడి సుఖదుఃఖాదులకు దైవప్రయత్నము, పురుష ప్రయత్నమను నీరెండును కారణములై యొప్పుచున్నవి.

ఆపంపకములో వచ్చిచేరెడి కాగితములను దైవప్రయత్నంబు ను, ఆవచ్చిచేరియున్న కాగితములను తానాడెడి యా యాటయందు మంచితెలివితోఁ జక్కగ నుపయోగించుకొనుటలో పురుషప్రయత్న

మును కూడియుండునుగదా! ఈయాటయం దిట్టి జగత్తత్వంబునుఁ దెలుపు సామ్యంబులింక నెన్నియో యున్నవి గాని విస్తరభీతిని మానవలసివచ్చెను.

ఈయాటనుఁబట్టి జగత్తంతయును చతుర్వర్ణంబులతో నొప్పుచు సర్వక్రీడలకును స్థానమై లాభాలాభ, సుఖదుఃఖ, కామక్రోధాదులను గలిగించుచు, విడువని యనురాగమును జనింపఁ జేయుచున్నదని రూఢియగుచున్నది. జగత్తునం దిట్లు చతుర్వర్ణాశ్రమ కర్మానుష్ఠాన మనెడి ధర్మంబు సనాతనంబుగ సహజమై యొప్పుచున్నదని శ్రుతి స్మృతి పురాణాదు లనేకవిధములగు రచనలతో నిరూపించుచున్నవి. కొన్ని యథాప్రకారంబుగ నీక్రింద పొందుపఱతును.

శ్రీమద్భాగవతమునందు ధర్మరాజు సనాతన ధర్మతత్వము నెఱుంగఁగోరి బ్రహ్మపుత్రులలో శ్రేష్ఠుఁడగు నారదమహర్షితో నిట్లనెను.

శ్లో॥ భగవన్ శ్రోతు మిచ్ఛామి నృణాం ధర్మం సనాతనం
వర్ణాశ్రమా చారయుతం యత్పుమాన్ విందతే పరం॥
భాగ. 7స్కం. 11అధ్యా.

తా॥ ఓనారదా! దేని విజ్ఞానమువలన మానవుఁ డుత్తమగతిని పొందగలఁడో; అట్టి వర్ణాశ్రమాచార యుక్తములగు మానవ సనాతన ధర్మము మీనుండి వినఁగోరుచున్నాను.

అని ప్రశ్నించిన ధర్మరాజుతో నారదమహర్షి యిట్లనుచున్నాడు.

శ్లో॥ నత్వా భగవతే ఽజాయ లోకానాం ధర్మసేతవే
వక్ష్యే సనాతనం ధర్మం నారాయణ ముఖాచ్ఛ్రుతం॥
భాగ. 7స్కం. 11అధ్యా.

తా॥ లోకములకు ధర్మానుసంధాతయగు బ్రహ్మదేవునికి నమస్కరించి, నేను స్వయముగా నారాయణమూర్తివలన వినియున్న

సనాతన ధర్మమునుఁ జెప్పుచున్నాను.

అని భగవద్గీతయందు ప్రతిపాదించిన చతుర్విధ వర్ణాశ్రమ రూపమగు ధర్మమునే సవిస్తరంబుగ బోధించియున్నాఁడు. ఆగ్రంథ ములం దది చూడనగును.

## —ధర్మ రక్షణము భగవత్కృత్యము—

గుణకర్మలయొక్క విభాగములవలన కోట్లకొలది జాతి స్వరూప స్వభావములతో నొప్పిన చాతుర్వర్ణ్య భూతములకు సహజములై యుండిన విధివిహిత కర్మానుష్ఠానములకు బాధగలిగి యెపుడు వ్యత్యస్తమేర్పడునో అపుడు భగవానుఁ డవతరించును. ఆవిషయము సీ క్రింది శ్లోకము స్థూఢి యొనర్చుచున్నది.

> శ్లో॥ యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
> అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥ గీ 4-2

తా॥ ఎపుడెపుడు అధర్మబాధచే ధర్మమునకు హాని గలుగునో అపుడు అధర్మ నిర్వాపణమునకై నన్ను నేను సృజించుకొనుచున్నాను.

> శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
> ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగేయుగే॥ గీ 4-8

తా॥ సాధువులను (మతవిహిత కర్మానుష్ఠాతలను) రక్షించుటకును, దుష్కృతులను (విరుద్ధకర్మల నొనర్చువారిని) శిక్షించుటకును ధర్మమును నిలఁబెట్టుటకును ప్రతియుగమునందును జనించుచున్నాను.

## —గుణకర్మవిభాగము—

ఈపుస్తకమునం దచ్చటచ్చట గుణకర్మవిభాగ మనియును,

చాతుర్వర్ణ్య మనియును పలుమార్లు పేర్కొనఁబడి యున్నది. త ద్విషయ మిఁకఁ గొలఁదిగ విచారింతము. లోకనిర్మాణమునకు భగవంతునిచే సృజింపఁబడిన గుణకర్మ విభాగముచే నొప్పిన చాతుర్వర్ణ్య మెట్లు కారణమై యున్నదోనాయీపుస్తకరచన కంతటికిని,

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః॥ గీ 4-13

అనెడి భగవద్గీతాశ్లోకమే బీజరూపముగు కారణమై యున్నది. ఈగ్రంథమంతయు దాని వివరణమనియుఁ జెప్పనగును. కాఁబట్టి భావదార్ఢ్యముకొఱకు పునరుక్తి యగునని యైనను, శంకింపక పలుమఱు వ్రాయుటగుచున్నది.

గుణవిభాగమున సత్వరజస్తమోగుణములు ప్రత్యేకములయ్యును, పరస్పర సమ్మేళనము గలవై ప్రతియొక్కటియు మిగిలిన రెండు గుణములతో చేరియుండును. ఇట్లు చేరుటలో నవి సమానాంశములుగఁ జేరక, యెక్కువతక్కువ భాగములుగాఁ గలిసి యుండును. అందువలన నొక్కొక్కప్రాణి యొక్కొక్క గుణవిభాగముతో, జనించుటవలన లోకమునందు కోట్లకొలది చేష్టలుండగా భిన్నభిన్న స్వభావములుగల భూతము లనేకములై విలసిల్లుచున్నవి.

ప్రాణికోటుల యుత్పత్తికి గుణవిభాగంబును, కర్మవిభాగంబును రెండును కారణములై యొప్పుచున్నవి. ప్రాణికి వ్యవహార దశయందు స్థూలసూక్ష్మ కారణంబు లనెడి మూడు శరీరములు గలవు. అందు సూక్ష్మకారణ శరీరములు రెండును గుణవిభాగంబుచేతను, స్థూల శరీరము కర్మవిభాగంబుచేతను ప్రవర్తిల్లుచున్నవి. కర్మవిభాగమనగ స్త్రీపురుష శుక్ల శోణిత విభాగవ్యవస్థయై యున్నది.

శ్లో॥ భూతభావో ద్భవకరః విసర్గః కర్మసంజ్ఞితః॥ గీ 8-2

తా॥ భూతభావములనగ ప్రాణుల శరీరములు. వీనిని బుట్టించెడి విసర్గమనగ శుక్లశోణిత విభాగవ్యవస్థ. ఇది కర్మవలన

జనించునదిగాక కర్మసంజ్ఞచే నొప్పుచున్నది. విసర్గమనగ నక్షర సమమ్నాయమునందు రెండు బిందువుల చేరికగ 8. నిట్టిరూపము చూపఁబడుచున్నది. అటులేర్పడిన రెండు బిందువులలోఁగల భావము పరికింపుఁడు.

| గుణమయము | కర్మమయము |
|---|---|
| శుక్లము | శోణితము |
| పురుషతత్వము | స్త్రీతత్వము |
| స్వతంత్రము | అస్వతంత్రము |
| పోషకము | పోష్యము |
| సేవ్యము | సేవకము |

ఆత్మ కారణముగ నిట్లు గుణకర్మలు రెండును కలియుట వలననే సర్వభూతసృష్టియు నేర్పడుచున్నది. మానవునకు గుణవిభాగమువలన జనించిన సూక్ష్మకారణ శరీరములు రెండును ప్రత్యేకములగునవిగావు, కాన వాని విభేదములు తెలియఁబడవు. అనుమేయములై యుండును. కర్మవిభాగమువలన యేర్పడిన స్థూలశరీరములన్నియో ప్రత్యక్షానుభవములు.

—దాంపత్యము—

స్త్రీపురుష సంయోగము వలననే సృష్టియంతయును సాగుచున్నదనుట నిర్వివాదాంశమై యున్నదిగదా!

పిండాండ స్వరూపుఁడగు మానవునియందు కర్మమయమగు స్థూలదేహమునకును, గుణమయుఁడగు జీవునకును నెట్టి పరస్పర సంబంధము గలదో లోకమందలి స్త్రీపురుష దాంపత్య వివాహసంబంధ మట్టిదేయని తెలియవలయును.

జీవుఁడు స్వతంత్రుఁడగు ఆత్మమూర్తియే యైయున్నను, అజ్ఞాన

వశమున కర్మానురాగముచేత బద్ధుఁడై కర్మసాధనమగు స్థూలదేహ మును కల్పించుకొని, దానితో క్రీడించుచుఁ దన్మయుఁడై సృష్టిరూప మగు సంసారమునుఁ బెంచుకొనుచున్నాఁడు. ఇందులకు భగవద్గీత యిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ పురుషః ప్రకృతిస్థోహి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణ సంగోఽస్య సదస ద్యోని జన్మసు॥ గీ 13-21

తా॥ పరాప్రకృతి రూపుఁడగు జీవుఁడు అపరాప్రకృతి రూపము అవిద్యాలక్షణమగు దేహేంద్రియాది సంఘాతమును తనదిగా కల్పించుకొని, దానివలన జనించిన సుఖదుఃఖాదులను పొం దుచున్నాఁడు. ఈజీవునకు తదనురాగమే సదసజ్జన్మలకుఁ గారణ మగు చున్నది. అనగ దేహాభిమానమే సంసార జన్మహేతువని భావము.

అపరాప్రకృతి స్వరూపము కర్మజన్యమగు దేహమునకు పరా ప్రకృతి స్వరూపుఁడు గుణమయుఁడు నగు జీవుఁడు భర్తయై యున్నాఁడు. 1. దేహము 2. జీవుఁడు అను నీరెంటిలో దేహము స్త్రీతత్వము, అస్వతంత్రమైనది. జీవుఁడు పురుషతత్వము, స్వతంత్రమై యుండునది, మానవులయం దీరెంటికిని మూలకారణమైన పురుషోత్తముఁ డనఁ బడెడు పరమాత్మయు, నుపద్రష్టయై భర్తయై, సర్వస్వతంత్రుఁడై యొప్పుచున్నాఁడు.

శ్లో॥ ఉపద్రష్టానుమంతాచ భర్తాభోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః
గీత 13-12

తా॥ పైనఁ జెప్పిన స్త్రీపురుష తత్వములగు దేహజీవుల కంటె నుత్తముఁడగు పురుషుఁ డీదేహమునందు పరమాత్మయని పిలువఁబడుచున్నాఁడు. అతఁ డీరెంటికిని భర్తయు, భోక్తయు, మహే శ్వరుఁడునై యున్నాఁడు.

అను పై విషయము భగవదుక్తిచే నిరూఢ మగుచున్నది. కాఁబట్టి పై విషయమును మఱింత వివరముగఁ దెలుపుచో 1. పరమాత్మ 2. జీవుఁడు 3. దేహము అను ఈమూఁడింటిలో దేహమునకు జీవుఁడు భర్త స్వతంత్రుఁడు కాఁగా, దేహజీవులకు పరమాత్మ భర్తయై, సర్వతంత్ర స్వతంత్రుఁడై యున్నాఁడు. జీవుని సేవించుట దేహమునకు ధర్మము. దేహమును సహాయముగాఁగొని పరమాత్మను సేవించుటా జీవుని ధర్మమైయున్నది. ఇట్టి ధర్మము నే లోకమునందలి దంపతులకు వేదశాస్త్రములు విధించుచున్నవి. పురుషుఁడు స్వతంత్రుఁడనియును, స్త్రీనిఁ గైకొని రక్షించి, పోషించుట పురుష ధర్మమనియు, కర్మ స్వరూపిణియు నస్వతంత్రయునగు స్త్రీకి పతిసేవయే పరమధర్మమనియు వేదశాస్త్రములు నుడువుచున్నవి,

ఇట్లు వచించుటలో వేదశాస్త్రములకు రాగద్వేషములుఁ గలవని తలంచుట పొరపాటు. ఏలందురా శాస్త్రములలోకెల్లను మిక్కిలి శ్రేష్ఠమైనదిగను, "యద్వై మనురవ దత్తద్భేషజం" అని వేదముచే స్తుతింపఁబడిన మనుస్మృతియను శాస్త్రము స్త్రీల నెంతగ గౌరవించినదియోఁ జూడుఁడు.

శ్లో॥ పితృభి ర్భ్రాతృభి శ్చైతాః పతిభి ర్దేవరై స్తథా
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభిః॥
యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వా స్తత్రా ఫలాః క్రియాః॥
శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులం
నశోచంతి తు యత్రైతాః వర్ధతే తద్ధి సర్వదా॥
జామయో యాని గేహాని శపంత్య ప్రతిపూజితాః
తాని కృత్యా హతానీవ వినశ్యంతి సమంతతః॥
తస్మా దేతాః సదాపూజ్యా భూషణా చ్ఛాద నాశనైః
భూతి కామైర్నరై ర్నిత్యం సత్కారే షూత్సవేషుచ॥
సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవచ
యస్మి న్నేవ కులేనిత్యం కల్యాణం తత్ర వైధ్రువం॥

తా॥ శుభఫలములను గోరెడి తండ్రులు, అన్నదమ్ములు, భర్తలు, బావలు, మఱదులు స్త్రీలను వస్త్రభూషణాదులచేత పూజించవలెను. ఎచ్చట స్త్రీలు పూజింపఁబడుదురో, యచ్చట దేవతలు సంతోషింతురు. ఎచ్చట స్త్రీలు పూజింపఁబడరో యచ్చట సర్వకర్మలును విఫలములగును. ఎచ్చట వదినెగార్లుగాని, మరదండ్లుగాని, దుఃఖింతురో యావంశము వేగముగ నశించును. వారెచ్చట దుఃఖింపకుందురో ఆ వంశ మెల్లప్పుడు అభివృద్ధి నొందును.

వారు పూజింపఁబడక యేగృహములఁ జూతురో యాగృహములు ఖడ్గముచే కొట్టఁబడినట్లు నశించును. అందువలననే శుభైశ్వర్యములను గోరు పురుషులు వీరిని అన్నవస్త్ర భూషణాదులచేతను, గౌరవ సత్కారోత్సవాదులచేతను పూజింపవలయును. భార్యచేత భర్తయును, భర్తచేత భార్యయు నేవంశము నందు నిత్యము సంతోషము నందుదురో యావంశమునం దెప్పుడును నిశ్చయముగ శుభము సేకూరుచునే యుండును.

శాస్త్రములందు స్త్రీలకు విధించిన ధర్మము లన్నియును చక్కగ యోజించినయెడల, వారి తత్త్వములకు హితమగునవియే గాని పక్షపాతకల్పితము లెంతమాత్రమును గావని తెలియఁగలము. ఆ ధర్మతత్త్వరహస్యములు దెలియక పోవుటవలన నవి విపరీతము లైనవిగాఁ దోచుచున్నవి.

శాస్త్రములయం దచ్చటచ్చట స్త్రీనిందారూప వాక్యములును, గనుపట్టుచున్నవి. లేదనలేదు. అదేలన శాస్త్రదృష్టిలో జ్ఞానము, పురుషతత్త్వముగను అజ్ఞానము స్త్రీతత్త్వముగను భావింపఁబడి యున్నది. జ్ఞానస్వరూపుఁడు భగవంతుఁ డొక్కఁడే పురుషశబ్దముతో వ్యవహరింపఁ దగినవాఁడు. తదన్యు లందఱు నజ్ఞానయుక్తులే. గాన అట్టివారు స్త్రీలనియే వేదతాత్పర్యము. అట్టి స్త్రీత్వ సంయోజితులఁ గూర్చి యా నిందావాక్యము లనిన నెంతయుఁ దగియుండును,

అజ్ఞానరూపమగు స్త్రీత్వము నింద్యమైనదని వేదశాస్త్ర వచనాభిప్రాయముకాని స్త్రీలని తీసికొనరాదు. అజ్ఞానము నివృత్తి యగువఱకును స్త్రీపురుషులగు సర్వమానవులును పతియను భగవంతుని సేవించి, ధ్యానించి, యారాధించి భగవదైక్యతను పొందవలయునని వారిభావము. ఇది సర్వమానవులకును విధియై యున్నది. లోకమునందుగల సర్వవర్ణములవారిలో పురుషులైనను, స్త్రీలైనను జ్ఞానసిద్ధి నందియున్నవా రెందఱో గలరు.

శ్లో॥ జైగీషవ్యో యథావిప్రః యథా హ్యసితాదయః
క్షత్రియా జనకాద్యస్తు తులాధారా దయో విశః

ధర్మవ్యాధా దయస్సప్త శూద్రాశ్చేల వకాదయః
మైత్రేయీ సులభా గార్గీ శాండిలీచ తపస్వినీ॥

ఏతే చాన్యేచ బహవో నీచయోని గతా అపి।
జ్ఞాన నిష్ఠాం పరాం ప్రాప్తాః॥

తా॥ జైగీషవ్యుఁడు, అసితుఁడు మొదలగు బ్రాహ్మణు లెట్లు జ్ఞానసిద్ధి నందియున్నారో, అటులనే జనకుఁడు మొదలగు క్షత్రియులును, తులాధారుఁడు మొదలగు వైశ్యులును, ధర్మవ్యాధుఁడు ఇలవకుఁడు మొదలగు శూద్రు లేడుగురును జ్ఞానసిద్ధి నందియున్నారు. మైత్రేయియు, సులభయు, గార్గియును, తపస్వినియగు శాండిలినియు నిట్టివారే! మఱి యనేకులు స్త్రీలు నీచయోనిజన్మ గలవారైనను, జ్ఞానసిద్ధి నందియున్నారు. లోకమంతయును భగవంతుని చిద్విలాస నాటక మనెడి భావమును సర్వులు గుర్తెఱింగిన యెడల నీనాటకమునందు జేరిన, మానవు లందఱును స్త్రీవేషధారులైనను, పురుషవేషధారులైనను ఏజాతికిఁ జెందిన వేషములు ధరించియున్నను, ఆయా వేషములయొక్క పాత్రౌచితిని పాటించవలసినవారై యున్నారనుట మఱువఁగూడదు.

ఈజగన్నాటకము నందలి వేషధారు లందఱును ఆయా వేష

ములను స్వీయముగఁ గోరుకొనియే జగన్నాటక రంగమునందుఁ బ్ర వేశించి యున్నారు. గాన ప్రతివారును తమకు విధివిహితములగు పాత్ర నియమములను చక్కగా పాటించవలయును. ఇందుచ్ఛనీచత లెంతమాత్రము నుండవు. కనుక విషయ మర్థము చేసికొనఁజాలక వేదశాస్త్రములయొక్క ధర్మనిర్ణయ విధులను నిష్కారణముగ నిం దింపకుందురుగాక.

## —వేద జాతులు—

ఋగ్వేదము లోకమునంతయును విరాట్పురుష రూపముగ వర్ణించుచుఁ దద్దేహాంగముల నిట్లు పేర్కొనుచున్నది.

> బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూ రాజన్యః కృతః
> ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత॥

తా॥ విరాట్పురుషునకు బ్రాహ్మణుఁడు ముఖమును, క్షత్రి యుఁడు చేతులును, వైశ్యుఁడు తొడలును, శూద్రుఁడు పాదము లాయెను.

పురుషదేహావయవము లెన్నియో యున్నను, వేదము ముఖ్యముగా నాలుగంగములనే పేర్కొనియుండుటకు హేతు వీచెప్ప బడిన నాలుగంగములయందే సర్వాంగములును జేరియుండుటయు, శరీరమునం దివి ప్రత్యేకముగా గుర్తించుటకు వీలగునట్లు విభజింపఁ బడియుండుటయునై యున్నది. వీనియందుఁ గ్రమముగ సత్వరజ స్తమోగుణ కర్మ తత్వములు నాలుగును ప్రత్యేక విశిష్ట లక్షణముల తో నొప్పియుండుట వలనను వాని వ్యాపారములు ప్రసిద్ధముగఁ జతుర్విధములై యుండుటవలనను చాతుర్వర్ణ్యబోధకు చక్కని యుపమానములై యుండెనని యూహింపనగును.

మఱియును ద్విజవర్ణమునకుఁ జెందిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యజాతులు మూడును, విరాట్పురుషునకు శిరస్సు, బాహువులు,

తోడలుగ వర్ణింపఁబడి యుండుటకు హేతువు శరీరమునందు పై మూడంగములు నొకదానిక్రింద నొకటి చక్కగ నిలబడి యొకవర్గమునకు జెందియున్నట్లగుపడుచుండుటయే యని యెఱుంగవలెను. శూద్రవర్ణమునుఁ దెలిపెడి పాదములుమాత్రము పైయంగములవలె చక్కగ నిలబడియుండక పై మూడంగములను భరించుచు, నడ్డముగ నుండుటచేతనే తమ ప్రత్యేకతనుఁ దెలుపుచున్నవి.

గుణకర్మ స్వరూపములతో నొప్పిన నాలుగుజాతులకునుఁ జెప్పబడిన శర్మ, వర్మ, గుప్త, దాస లక్షణములు క్రమముగ శిరోబాహూరుపాదములయందు ప్రత్యేక విశిష్టత నొందుచున్నవి. ఈచతురంగములను తమతమ నియతవ్యాపారములయందు ప్రవర్తింప జేయు దైవ మైదవకారణమై యున్నది. మానవున కానందము సిద్ధింపవలయునన్న పైనఁ బేర్కొనియున్న చతురంగములయొక్క పరస్పర సహాకారమును దైవిక పక్షమునను నీరైదును కారణములై యున్నవి.

అటులనే లోకమునకు కల్యాణము సేకూరవలయునన్నచో, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగుజాతుల పరస్పర సహకారమును దైవానుగ్రహమును కారణములై యుండవలెను. మానవుఁ డొనర్చెడి యేకార్యమైనను సిద్ధి గాంచుటకు నీరైదును తోడ్పాటు నొసంగవలసి యున్నది.

ఈవిషయమును భగవద్గీత యిట్లు వివరించుచున్నది.

శ్లో॥ పంచైతాని మహాబాహో కారణాని నిబోధమే.
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వ కర్మణాం॥
గీత 18–13

అధిష్ఠానం తథాకర్తా కరణంచ పృథగ్విధం
వివిధాశ్చ పృథ క్చేష్టాః దైవంచై వాత్ర పంచమం॥
గీత 18–14

తా॥ ఓయర్జునా! మానవు లొనర్చెడి యుక్తాయుక్తము

లగు సర్వకర్మలయొక్క సిద్ధికి వేదాంతమునందు ఐదు కారణములు చెప్పఁబడినవని తెలియును. ఇందులో నొకటి అధిష్ఠానమగు శరీరము. రెండవది కర్తయగు జీవుఁడు, మూడవది ఇంద్రియసమూహము, నాల్గవది వివిధములగు చేష్టలు, అయిదవది దైవమునై యున్నవి. ఇందులో పై నాలుగు కారణములు మానవ కృత్యములు, నైదవది దైవకృత్యమై యున్నదిగదా!

జ్ఞానవాసిష్ఠ గ్రంథమునందు ప్రతికార్యసిద్ధికి నిట్లు కారణములు వచింపఁబడి యున్నవి.

శ్లో॥ ద్రవ్యమంత్ర క్రియా కాల శక్తయస్సాధు సిద్ధిదాః॥

తా॥ ద్రవ్యము, మంత్రము, శరీరవ్యాపారము, కాలము, శక్తి అను నైదును సమకూడినగాని కార్యములు సిద్ధింపవు.

వాస్తవ మిటు లుండుటఁబట్టియే లోకములో నేదియైన కార్యము చెడిపోయిన యెడల దానికి పంచకము బాగుండలేదనెడి ప్రతీతి యేర్పడినది. మఱియును నలుగురుఁ జేరినగాని యేకార్యమును సఫలము గాదను వాడుకయు లోకమునం దేర్పడుటయు, నీవిషయమునే చూపును. మానవునకు సౌఖ్యము, నానందము లభించవలయునన్న, శరీరావయవము లన్నియును తమతమ వ్యాపారములనుఁ జక్కఁగఁ జేయుచు పరస్పర సహాయకములై యుండవలయునుగదా!

అటులనే లోకమునకు సౌఖ్యము, నానందము లభింపవలయుననిన జాతులన్నియును స్వస్వవృత్తులఁ జేయుచు, పరస్పర సహాయకములుగ నుండితీరవలయును. శరీరావయవములలో నీచము నిరుపయోగమునగు నవయవ మొక్కటియును లేనట్లే, లోకములో నీచమై నిరుపయోగమైన జాతియొక్కటియును లేదు. వేద మీ యభిప్రాయమునుఁ దెలుపుటకే లోకమునందలి చాతుర్వర్ణ్య జాతులకు నుపమానముగ విరాట్పురుషుని చతురంగములను పేర్కొనినది.

మఱియును కఠోపనిషత్తు మానవత్వము నిట్లు సాలంకారముగ వర్ణించుచున్నది. గమనింపుడు.

ఆత్మానం రథినం విద్ధి శరీరగ్ం రథ మేవచ
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవచ॥
తృతీయవల్లి॥ 3 మంత్రం

ఇంద్రియాణి హయానాహుః విషయాస్తేషు గోచరాన్
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యా హుర్మనీషిణః॥
తృ॥ 4 మంత్రం

యస్త్వవిజ్ఞాన వాన్భవ త్యయుక్తేన మనసా సదా
తస్యేంద్రి యాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః
తృ॥ 5 మంత్రం

తా॥ మానవునియందా దాత్మ రథికుఁడు, శరీరము రథము, బుద్ధి సారథి, మనస్సు పగ్గము, ఇంద్రియములు గుఱ్ఱములు, విషయములు మార్గములు. ఆత్మేంద్రియ మనోయుక్తుఁడగు వానిని భోక్త యందురు. బుద్ధి (సారథి) అవివేకమైనయెడల మనస్సు(పగ్గము) బుద్ధి వశమున నుండదు. గాన ఇంద్రియములు (గుఱ్ఱములు) వశములుగాక రథికుని హానికిఁ దార్చును.

ఆత్మను బుద్ధి యనుసరింపవలయును. బుద్ధిని మనస్సు, మనస్సును ఇంద్రియములు ననుసరించుచుండిన నానందము సిద్ధించునని విశేషభావము.

'పిండాండ వద్బ్రహ్మాండం'

అనెడు సూక్తి ననుసరించి, లోకమునందు ఆత్మరూపమగు బ్రాహ్మణతత్వమును బుద్ధిరూపమగు క్షత్రియతత్వ మనుసరింప వలయును. దీనిని మనోరూపమగు వైశ్యతత్వము పైవాని రెంటి ననుసరింపవలయును. ఇంద్రియ రూపమగు శూద్రతత్వము పైమూడు తత్వములకు హితముగ వర్తించవలయునని చక్కగ పైవిషయములఁబట్టి తెలియు

నగును. లోకమిట్టి నియమములతో నుండిన ప్రతియొకరికి నానందము సిద్ధించును.

ఈ నియమ మాకాలమునం దుండెడిదని శ్రీమద్రామాయణ మం దిట్లు వచింపఁబడియున్నది.

శ్లో॥ క్షత్రం బ్రహ్మముఖం చాసీత్ వైశ్యా క్షత్ర మనువ్రతాః
శుద్రాః స్వధర్మ నిరతాః త్రీన్ వర్ణా నుపచారిణః॥
బాలకాం. 6 సర్గ 19 శ్లోకము

తా॥ బ్రాహ్మణులను క్షత్రియులు, క్షత్రియులను వైశ్యులును ఆ మువ్వురను శూద్రులు ననుసరించి వర్తించుచుండిరి.

ఇట్టి చాతుర్వర్ణ్య వ్యవస్థ మానవులయందేగాక దేవతలయందు నున్నట్లు బృహదారణ్యకోపనిషత్తు ప్రథమాధ్యాయము నాల్గవ బ్రాహ్మణములో 11 మొదలు 15 వరకుగల మంత్రములలో వర్ణింపఁ బడియున్నది. అందలి సారాంశమునుమాత్రము పేర్కొందును. దేవతలలో అగ్ని బ్రాహ్మణుఁడై యున్నాడు. ఇంద్రుఁడు, వరుణుఁడు, చంద్రుఁడు పర్జన్యుఁడు, యముఁడు, మృత్యువు, ఇషానుఁడు అను వీరు క్షత్రియులైయున్నారు. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, విశ్వేదేవతలు, మరుత్తులు అను వీరు వైశ్యులై యున్నారు. మఱి పుషానులు శూద్రులై యున్నారు. అందువలన వర్ణవ్యవస్థ వేదబోధితమేగాని మానవకల్పిత భేదబుద్ధిజనిత మెంతమాత్రమును గాదని తెలియగలదు. లోకమునందు ముఖ్యముగా బ్రహ్మ, క్షత్రములు రెండును వీర్యవంతములై యొప్పుచుండినయెడల కల్యాణము సేకూరగలదని భగవద్గీత యిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణః యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతిః ధ్రువానీతి మతిర్మమ॥ గీ18–27

దీని భావార్థ మేమన ఎచ్చట స్వధర్మము ననుష్ఠించు బ్రహ్మ

తత్త్వమగు శ్రీకృష్ణుఁడును, స్వధర్మమునకు గడంగిన క్షత్రియ తత్త్వమగు అర్జునుఁడును గలరో, యచ్చట సంపదయు, విజయము, ఐశ్వర్యము, నీతియు ధ్రువమై యుండును.

లోకమునందు ముఖ్యముగ ధర్మము నుద్ధరించవలసిన బాధ్యత విశేషించి బ్రాహ్మణ క్షత్రియులయందే గలదు. కనుకనే శాస్త్రము బ్రాహ్మణక్షత్రియులకు నితరులకంటెను యెక్కువ కఠిన నియమములను విధించుచున్నది. బ్రహ్మక్షత్రియులు తమకర్మనిష్ఠల యందసమర్థులైనయెడల నధర్మము విద్యుద్వేగముతో వ్యాపించును. కనుకనే వారు మిక్కిలి సుశిక్షితులుగా నుండవలయును. వారి ధర్మ మసిధారవంటిది. వారు స్వధర్మనిష్ఠులు గాకుండినయెడల వారు చెడుటయే గాక లోకమును చెఱచినవా రగుదురు.

శాస్త్రములయందు స్త్రీవైశ్యశూద్రులు తర తమ భేదములతో నొప్పిన తమోగుణ స్వభావులు. వారికి ప్రమాదము సహజము గావున వారికి విధించిన కర్మలయం దంతటి కఠిననియమములు లోపించియుండుట గమనించవలెను.

తమోగుణమునకు రజోగుణమును, రజోగుణమునకు సత్త్వగుణమును ఉద్ధారకము శిక్షకమునై యుండును. రజోగుణవిశిష్టుఁడగు క్షత్రియుని యుక్త కార్యములయందు నియోగింపవలసిన బాధ్యత సత్త్వగుణ విశిష్టుఁడగు బ్రాహ్మణునియందే గలదు. లోనమునం దిపుడింతటి యధర్మము వ్యాపించుటకుఁ బ్రధానకారణము బ్రాహ్మణుఁడే యనుట నిర్వివాదాంశము. స్వధర్మము నతఁడు చక్కగ ననుష్ఠింపఁ దొడంగిన యెడల సర్వమును జక్కఁబడును. బ్రహ్మమూర్తియగు శ్రీకృష్ణుఁడు సర్వభూత సమత్వరూపమగు స్వధర్మమును తా ననుష్ఠించుచు, మోహవశమున స్వధర్మమునుండి ప్రమాద పడుచుండిన యర్జునునకు కర్తవ్యమును బోధించి యుండినందుననే తొల్లి ధర్మము సుప్రతిష్ఠితమైనది. బ్రాహ్మణుఁడు స్వధర్మనిష్ఠఁ దప్పకుండిన నగు

ఫలమును భగవద్గీత యిట్లు సూచించుచున్నది.

శ్లో॥ యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదేవే తరోజనాః
సయత్ప్రమాణం కురుతే లోకస్తదను వర్తతే॥ గీ 3-21

తా॥ శ్రేష్ఠుఁడగువాఁ డెటు లాచరించుచుండునో యితరుఁ డటులనే యాచరించును. అతఁ డేది ప్రమాణమని నిరూపించునో లోకము దానినే యనుసరించి వర్తించును.

లోకమునం దిపుడు బ్రహ్మ క్షత్రియ, వైశ్య, శూద్రులను వారెవ్వరో గుర్తించుటైన కష్ట మనిపించు సాంకర్య మేర్పడి యున్నది. ఈసాంకర్యము పరాకాష్టను పొందుటనుబట్టి వర్ణమనినను, జాతియనినను, కులమనినను, ఆశ్రమ మనినను లోకము రోతపడు స్థితి యుదయించినది. అట్లు రోతపడుటకు మనము రోషపట్టి ప్రయోజనములేదు. కాని దినదినమునకు కులమత జాతిద్వేషములు ప్రబలుచున్నవని విచారపడవలెను. వీనికి కారణము కాలమేయని, బ్రాహ్మణుల స్వధర్మ నిరాసమేయని భావింపవలయును.

*బ్రాహ్మణ—నింద*

కాని యథార్థము నెఱుంగదలంపని కొందఱు కులమతవర్ణాశ్రమ విభేదముల కన్నిటికిని బ్రాహ్మణులే కారణమనియు, వాని దెల్పు గ్రంథములు ధూర్త బ్రాహ్మణ కల్పితములనియు, బ్రాహ్మణ జాతినే బూతులతో దూషించుచున్నారు. అట్లు దూషించవచ్చును గాని ఇపు డన్నిజాతులవారిలో నధర్మపరత యధికముగా నుండుట గమనింపకుండిరని విచారింపవలెను. ఇది కాలచోదితమని సమాధానపడవలయును.

శ్లో॥ నైవం ప్రజ్ఞా విశేషేణ కోని వర్తితు మర్హతి
విధాతృ విహితం మార్గం నకశ్చిదతి వర్తతే॥

కాలమూల మిదం సర్వం భావాభావౌ సుఖాసుఖే
కాలః సృజతి భూతాని కాల స్సంహరతే ప్రజాః॥

కాలోహి కురుతే భావా న్సర్వ లోకే శుభాశుభాన్
కాలస్సం క్షిపతే సర్వాః ప్రజావి సృజతే పునః॥

అతీతా నాగతా భావాః యేచవర్తంతి సాంప్రతం
తాన్ కాల నిర్మితాన్ బుధ్వా నసంజ్ఞాం హాతు మర్హసి॥
భారతము ఆదిపర్వానుక్రమణిక

తా॥ దైవము నెవఁడు స్వకీయప్రజ్ఞతో నివర్తింపఁ గలడు? విధివిహితమార్గము నెవ్వఁ డతిక్రమింపఁగలడు? భావాభావ సుఖ దుఃఖ రూపమగు సర్వము కాలమూలమై యున్నది. భూతములను సృజించునదియును, సంహరించునదియును కాలమే! సర్వప్రజలను కాలము సంక్షేపించుచున్నది. మఱియు విడచుచున్నది. కడచిపోవు నవి, రాబోవునవి వర్తించుచున్న స్వభావములును, కాలముచే నిర్మింపఁ బడినవిగా నెఱింగి ప్రజ్ఞను వీడకుందుము.

ఒక సంవత్సరకాలములో మంచు ఎండ గాలి వాన ఎటుల ఋతుధర్మములని దలంచుచున్నామో! ప్రకృతి విలాసమని గ్రహించి సహించుచున్నామో లోకమం దిపుడు వర్తించుచున్నది కలియుగమని యెఱింగి యట్లే దానిని సహించవలెను.

చతుర్విధములగు గుణకర్మలలో సత్వగుణవిశిష్టమగు బ్రాహ్మణ కృతయుగము గడచిపోయినది. దానికిఁ బిదప వచ్చిన రజోగుణ విశిష్టమగు క్షత్రియ త్రేతాయుగము చెల్లిపోయినది. దానికి దర్వాత తమోగుణవిశిష్టమగు వైశ్య ద్వాపరయుగము గతించినది. ఈ నాడు కర్మవిశిష్టమగు శూద్ర కలియుగము వర్తించుచున్నది. ఇందు కర్మమయులగు స్త్రీశూద్రులకు ప్రాధాన్యత యేర్పడుట దీనికి సహజ లక్షణమైనది. అది విజ్ఞుల కనుభవవేద్యము కూడను. మఱియును సత్వగుణవిశిష్టమగు బ్రాహ్మణతత్వమున కిది విరుద్ధము. గాన నిపుడు

బ్రాహ్మణతత్వ మధమస్థితి నొందుటయు, నిందాపాత్రి మగుటయు సహజముగనే యగుపడును. కాబట్టి మన మీమార్పును ప్రికృతి విలాసమని దలంచవలయునేగాని, దూషించరాదు.

శాస్త్ర మిట్లనుచున్నది.

శ్లో॥ యుగేయుగేతు యేవిప్రాః తేషుతేషుచ యేద్విజాః
తేషాం నిందా నకర్తవ్యా యుగరూపా హితే ద్విజాః॥
పరాశరస్మృతి 11-50

తా॥ ప్రతియుగమునందే ధర్మములు గలవో యేబ్రాహ్మణులుగలరో ఆధర్మములను ఆబ్రాహ్మణులను నిందించగూడదు. ఏలన వారు యుగానురూప ధర్మరూపము గలవారై యుందురు.

ఇదే విషయమశ్వమేధ పర్వమున నిట్లు వివరింపఁబడి యున్నది.

శ్లో॥ యుగేష్వావర్తమానేషు ధర్మోప్యావర్తతే పునః
ధర్మేష్వావర్తమానేషు లోకోప్యావర్తతే పునః

తా॥ యుగధర్మములు తిరిగి వచ్చుచుండగ యుగానురూపముగ ధర్మమును తిరిగి వచ్చుచుండును. ధర్మములు మరల వచ్చునట్లుగనే జనులును తిరిగి వచ్చుచుందురు.

## *కలి-ధర్మము*

కలిధర్మమునుఁ గూర్చి పరాశరస్మృతి యీవిధముగ వర్ణించుచున్నది.

శ్లో॥ జితో ధర్మో హ్యధర్మేణ సత్యం చైవా నృతేనచ
జితా శ్చోరైస్తు రాజానః స్త్రీభిశ్చ పురుషాః కలౌ॥ 1-30

సీదంతి చాగ్నిహోత్రాణి గురుపూజా ప్రణశ్యతి
కుమార్యశ్చ ప్రసూయంతే తస్మిన్ కలియుగే సదా॥ 1-51

తా॥ ధర్మము అధర్మముచే జయింపఁబడును. సత్య మసత్యముచేత జయింపఁబడును. దొంగలచేత రాజులు జయింపఁబడుదురు. స్త్రీలచేత పురుషులు జయింపఁబడుదురు. అగ్నిహోత్రములు శిథిలములగును. గురుపూజ నశించును. పెండ్లిగాని కన్యలు ప్రసవింతురు. కలియుగమునం దెప్పుడు నిట్లు జరుగుచునే యుండును.

శ్లో॥ యదా యదా సతాం హానిః వేద మార్గానుసారిణాం
తదా తదా కలేర్వృద్ధి అనుమేయా విచక్షణైః॥
విష్ణు పురాణము

తా॥ వేదచోదిత మార్గములందు జరించువారి కెప్పుడెప్పుడు హాని గలుగునో అపుడపుడు పండితులచేత కలియొక్క వృద్ధి యూహింపఁబడును.

శ్లో॥ ఆద్యే కృతేతు యోధర్మః స త్రేతాయాం ప్రవర్తతే
ద్వాపరే వ్యాకులీభూతః ప్రణశ్యంతి కలౌయుగే॥
లింగపురాణము

తా॥ మొదట కృతయుగమునందున్న ధర్మము త్రేతయందు వ్యాపించి, ద్వాపారమందు సంకులమై కలియందు నశించును.

మ॥ వనితా దుర్బల దీనబంధుజన సర్వస్వాపహారుల్ సుహృ
జ్జన మాతాపితృ పుత్రహంతలు యదృచ్ఛాకర్మశీలుల్ ధరణ్
జన సంపూజితులై చరింతురు వినష్ట శ్రీకులై విప్రులా
జనులన్ జేరి పరిగ్రహించెద రవజ్ఞా పూర్వ దుర్వృత్తముల్॥
అరణ్యపర్వము

ఇదే విషయ మీక్రింది గ్రంథములం దిటులున్నది. భావము సుగమ మగుటవలన శ్లోకములమాత్ర ముదహరింతును.

శ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః సంగిరంతం పరస్పరం
శూద్రతుల్యా భవిష్యంతి తపస్సత్య వివర్జితాః॥
భారతము—అరణ్యపర్వము

భూమిర్నద్యో నచాశ్చైతే సిద్ధా దేవర్షయస్తథా
కాలం సమను వర్తంతే తథాభావా యుగేయుగే॥

సర్వే ధర్మాః కృతే జాతాః సర్వేనష్టాః కలౌయుగే॥
పరాశరస్మృతి

అల్పాయుషోల్పపుణ్యాశ్చ దుర్బలాశ్చాల్ప మేధసః
స్వభావ చంచలా మూఢాః కామక్రోధాది దూషితాః॥

  

మాధ్యేన పశుతుల్యాశ్చ కర్మ శ్రద్ధాం నకుర్వతే
తథావిధానాం స్త్రీణాంతు నకలౌ కర్మసిద్ధయః॥
కలిధర్మోత్తరం పారథర్మణి

ఇట్లు సంస్కృత గ్రంథములేగాక యాంధ్రగ్రంథము లనేకములు కలిమహాత్మ్యమును బహువిధముల వివరించియున్నవి. అందుఁ గొన్నిటి నుదహరింతును.

కం॥ సుతు డవమానించు జనకుఁ
బతి నవమానించు భార్య పడతులు పతులన్
మతి నొండొరువుల మెచ్చక
సతతము చరియింతు రిష్ట సంచారములన్॥

కం॥ నడువవు దేవ పితృక్రియ
లుడుగును వేదార్థ సమ్య గుపదేశములున్
గడగును మోహాతమంబులు
పుడమి సమస్తంబు కుజన భూయిష్టమగున్

కం॥ క్షత్రియజాతులు శూద్ర చ
రిత్రంబున శౌర్యమును నెరియు దేజంబున్
మైత్రియును లేక చెదరి ధ
రిత్రీశ్వర శూన్యులై చరించెద రెందున్॥

కం॥ శ్రుతి ధర్మంబులు శూద్రులు
ప్రతిభం జెప్పంగవినుచు బ్రాహ్మణ జాతుల్

ధృతి జెడి తత్స్వవశులయి
యతి నిందిత కర్మకారు లయ్యెద రధిపా॥

తరువోజ॥ ఉక్కున శూద్రు లత్యుగ్రులై కవిసి యొండొండఁ బె
క్కండ్ర సుడుగక చంప
దిక్కెవ్వరును లేక దీనులై వసుమతీ జనుల్ నాలుగు దెసల
బాఱెదరు
ప్రుక్కిడి చోరులు ముట్టి నిరవశేషముగ ధనావలి గొని
మొగి వధింపంగ
స్రుక్కి కాకులయట్లు శూన్యులై చెదరి సోంపేది యడవులను
సొచ్చెదరు జనుల్
॥

మత్తకోకిల॥ దేవతా యతనంబులున్ జగతీ సురావసథంబులున్
పావనాశ్రమ భూములున్ జెడి పాదగున్ శుభవృక్ష వ
ల్లీవనంబులు నాశమొందు కలి ప్రవేశము నందుదు
స్త్రీవిహారము మద్యపానము జెల్లుఁ బెల్లుగ నెల్లెడన్

గీ॥ అన్న విక్రియ మొనరింతు రఖిలజనులు
వేదవిక్రయ మగుదురు విప్రవరులు
పణ్యయోషులు నగుదురు పద్మముఖులు
కష్టతరమైన యక్కలికాలమందు॥

శాస్త్రపురాణాదులయం దిట్టివెన్నియో కలిధర్మములుగ వచింపఁబడి యున్నవి. అవి యన్నియు నొక్కటియైనఁ దప్పనట్లు మనకుఁ బ్రత్యక్షానుభవము లగుచునే యున్నవి.

ఇట్లు వర్తమాన కలియుగమునందేగాక నీకల్పమునం దెన్ని మారులు కలియుగము వచ్చినను యిట్టి పరిస్థితులే సంభవించు చుండునని స్కాందపురాణమునందు శౌనకాది మహర్షులకు సూతుఁడు పూర్వకలియుగ పరిస్థితులను దెలుపుటనుఁబట్టి తెలియుగలము.

శ్లో॥ శ్రుణుధ్వమాత పురాకల్పే కలౌ కాలేతు పాపిని
రాజను చ్యుత ధర్మేషు నాస్తికేషు దురాత్మసు॥

వంచకా నీచజాతీయాః కర్మ భ్రష్టాశ్చ దస్యవః
శూద్రావవృద్ధిరే ధాన్యైః ధనై రపిసుఖైస్తథా

భో విప్రాః కలికాలేస్మిన్ ఆస్తిక్యం బహు దుర్ఘటం
జీవనం దుర్లభం నృణాం ధార్మికే పథి నాన్యథా॥

  

శిల్పాని సంపదశ్చైవ కురాజా వంచయంతివః
స్వధా వైదికీ వృత్తిః భవతా మద్యదుర్లభా॥

అంతతో నాగక వ్యాసుఁడు కలిలో నుండఁబోవు మానవ లోకమునుగూర్చి యిట్లనియె నఁట.

ఆచండాల మనుప్రాప్తాః సర్వే వాణిజ్య కర్మణి
శూద్రా స్వతంత్రతాం నీతాః కురాజాహాంతు ముద్యతాః॥

కృషికర్మాణి వాణిజ్యం విప్రః కుర్యాత్తథాపది
ఇత్యుక్తం జీవనోపాయం పరిగృహ్యాద్య సాధయేత్

భవంతస్తేన కుర్వంతు షట్కర్మాణ్యపి శాస్త్రితః
యథాబలం యథాయోగం సర్వం నస్సుగమం భవేత్

ఈవిధముగా పూర్వకలియుగ స్థితిని వర్ణించి యుండుటఁబట్టి కలియుగ మెప్పటికిని బ్రాహ్మణతత్వమునకును వేదమార్గానుసారు లకును బాధను కలిగించునదిగ నుండుననియే స్పష్టమగుచున్నదిగదా! ఆ పూర్వకలియుగముయొక్క ప్రతిబింబముగనే వర్తమానకలి యుగము వర్తించుచున్నదని మన సామాన్యబుద్ధికిఁ దోఁచుచున్నది. ఇటులనే గుణకర్మ తత్వములతో నొప్పిన నాలుగు యుగములును క్రమముగ నెల్లప్పుడు చరిత్ర ప్రదర్శనములగు టాకీరాళ్లవలె (Mile Stones of History) తమయందున్న చరిత్రలను ప్రదర్శించు చుండును. పగటికాలము గడచిన పిదప రాత్రికాలమును, రాత్రికాల ము గడచినపిదప పగటికాలము నెట్లనివార్యముగ వచ్చుచుండునో అటులనే యుగధర్మమును తప్పనిసరిగా వచ్చుచునే యుండును. "History repeats itself" అనిఅనుభవజ్ఞు లందురు.

జ్ఞాన వాశిష్ఠగ్రంథమునందలి భుసుండోపాఖ్యానమునందీవిష యమును వసిష్టమహర్షి చిరకాలజీవియగు భుసుండుడను కాకిని ప్రశ్నింపగ తాఁ జూచిన యుగకల్పములయొక్క సృష్టివైచిత్ర్యముల నిట్లు తెలిపినటు లున్నది.

మునే తే బ్రహ్మపుత్రస్య జన్మాష్టమ మిదంకిల
సంస్మరా మ్యష్ట మే సర్గే తస్మిం స్త్వం మమ సంగతః॥

స్మరామి ద్వాదశం చేద మమృతాం భోధిమంథనం
వారత్రయం హిరణ్యాక్షో నీతవా న్వసుధా మధః

నిర్వాణప్రకరణం 155

ఈ విషయమునే శ్రుతియు నిటులఁ దెల్పుచున్నది.

"ధాతా యధా పూర్వమ కల్పయేత్"

తా॥ సృష్టికర్త సర్వ ప్రపంచమును మునువున్న రీతినే సృష్టించెను.

బ్రహ్మసూత్రములు ప్రథమాధ్యాయము తృతీయపాదము నందుగల 30 సూత్రము నీభావమే తెల్పుచున్నది.

సమాన నామరూపత్వా చ్చా వృత్తావప్య విరోధో దర్శనా
త్స్మృతేశ్చ

మఱియును స్మృతి యిట్లు వచించుచున్నది.

యథాభి మానినోతీతా స్తుల్యాస్తె సాంప్రతై రిహ॥

కడచిపోయిన కాలమున నుండువారు నిప్పు డుండువారితో సమానులే యని పై వాక్యముల భావము. అదేవిషయమును శ్రీమద్భగవద్గీత యందు శ్రీకృష్ణుఁడువచించుచున్నాఁడు.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప॥ గీ 4—5

నత్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః
నచైవన భవిష్యామః సర్వే వయ మతః పరం॥ గీ 2–12

భావమేమన "ఓయర్జునా! నాకును నీకును బహుజన్మలు గడచినవి. వానిని నేనెఱుఁగుదును, నీవెఱుగవు. నే నొకప్పుడైనను లేదనునది లేదు. నీవును యీరాజులును లేరనునది లేదు."

ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావృత్తి నోర్జునా॥ గీ 7–16

అనగా బ్రహ్మమొదలు సమస్తలోకములును పునరావృత్తిఁ గలిగియున్నవిసుమా యని భావము.

దేహికి కౌమారము, యౌవనము, వార్ధక్యము దేహాంతర ప్రాప్తి యెటుల గలవో గుణకర్మతత్వములు నాలుగును యుగనామములతో నొకదానివెంట నొకటి క్రమముగా వచ్చుచునే యుండును. ప్రకృతియందున్న యీ చాతుర్వర్ణ్య స్వభావంబులను గుర్తించి, లోకంబునకుఁ దెలిపినవారు బ్రాహ్మణులేనైనను, మఱెవ్వరైనను యిందు వారు కల్పించిన యసత్య మొక్కటియు వివేచనగలవారి కగుపడదు.

ఒకవేళ కొందఱు దలంచుచున్నట్లు బ్రాహ్మణ కల్పితమోనమేయనిఁ దలంచుటకు వారి కిందువల్ల గల్గెడి లాభమేదో గాఢముగ నాలోచించినను స్ఫురింపకున్నది. వారీ చాతుర్వర్ణ్య జాతి వ్యవస్థ మానవులయందు మాత్రమేఁ గలదని వచించి యుండలేదు. ఈచాతుర్వర్ణ్య వ్యవస్థ నామరూపాత్మకమగు సర్వప్రకృతియందును గలదని వక్కాణించి యున్నారు. ఖగోళమందలి జ్యోతిర్గ్రహముల యందును బ్రాహ్మణ, క్షత్రియాదిజాతులును స్త్రీపురుషాది తత్వము లున్నట్లు వచించియున్నారు. పరికింపుడు.

క్రూరా భాను తమశ్శని ధ్వజికుజా శ్శుక్రార్క్య సౌమ్యేందవకి
సౌమ్యాస్తే పురుషాః కుజార్క గురవో రాహ్వేందు శుక్రాస్త్రి
యః

తచ్ఛేషాస్తు నపుంసకా గురుభృగుర్వి ప్రౌ కుజార్కౌ నృపౌ
వైశ్యౌ చంద్రబుధౌ తదన్య కులజో మందస్తు వర్ణేశ్వరః॥
కాలామృతం

తా॥ రవి, కుజ, శని, రాహు, కేతువులు పాపగ్రహము లు. చంద్రి, బుధ, గురు, శుక్రులు శుభగ్రహములు. రవి, కుజ, గురువులు పురుషులు. చంద్ర, శుక్రులు స్త్రీగ్రహములు. మిగిలినవి నపుంసక గ్రహములు. గురు, శుక్రులు బ్రాహ్మణులు. రవి, కుజులు క్షత్రియులు. చంద్ర, బుధులు వైశ్యులు. శని శూద్రుఁడు.

ఇట్లు శాస్త్రకారులు వచించుటవలన వారికి గ్రిహనక్షత్రా దులయందును, అసూయాద్వేష పక్షపాతాదులు గలవనిఁ జెప్పవల వలయునుగదా! అంతకంటె నవివేక ముంఘునా! అట్టి విభేదము గ్రహములయందే గాక అక్షరములయందును చాతుర్వర్ణ్యజాతు లున్నట్లుఁ దెలిపి యున్నారు. అక్షరములలో స్వరములు పదునారును క–చ–ట వర్గాక్షరములు పదునైదును బ్రాహ్మణజాతికిఁ జెందినవి. త–వ వర్గాక్షరములు పదియును, రేఫవకారములు రెండును క్షత్రియ జాతివి. దంత్యములగు చ–జలు రెండును ఙకార శకారములు రెం డును శూద్రజాతియని శారదాదర్పణమను గ్రింథమునం దిట్లు చెప్పఁ బడినది.

స్వరాః కచట వర్గాశ్చ ధర సీసుగ మాతృకాః
తపవర్గా సమావతస్థా బాహు సంభవ మాతృకాః॥

ఇత్యాది శ్లోకములతో అక్షరజాతులును అక్షరదైవములు మొదలగునవి వచింపఁబడినవి. ఇట్లే రత్న గజాశ్వ సర్ప వృశ్చిక కీటాదులయందును జాతివ్యవస్థ యున్నట్లు ఆయాశాస్త్రములయందు బరికింపనగును,

వేయేల గీతాశాస్త్రమునందు సర్వము గుణకర్మవిభాగమున చాతుర్వర్ణ్యముగ నాచే సృజింపఁబడినదని భగవానుఁడు స్పష్టపరచి

యున్నాఁడని పలుమాఱు చెప్పితిమిగదా! అట్టిచో జాతిభేదములు బ్రాహ్మణకల్పితము లనుట పొరబాటుగాక యేమగును.

*జాతులు - కర్మలు*

అంతియగాక జాతులకు తగినకర్మలును భగవంతునిచే విధింపఁ బడినవేగాని మానవ కల్పితములుగావు. పరికింపుఁడు.

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చపరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః॥ గీ 18-41

తా॥ ద్విజవర్గమునకు జెందిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకును వారివారి స్వభావములందుగల సత్వరజస్తమోగుణములకు తగినట్లు వారివారికి కర్మలు నాచే ప్రత్యేకముగ విభజింపఁబడి యున్నవి.

భగవానుఁడు జాతులకు కర్మల నిట్లు ప్రత్యేకముగ విభజించి యుండిన కారణమున నతఁ డిందులకు కర్తయై యున్నను, వారివారి స్వభావముల ననుసరించి వారు కోరినట్లు విభజించి యుండుటవలన నతఁడు అకర్తగనే భావింపఁబడుచున్నాఁడు. అందులకు భగవద్గీత యిట్లనుచున్నది.

తస్య కర్తార మపిమాం విద్ధ్యకర్తార మవ్యయం॥ గీత 4-13

తా॥ దానికి నేను కర్తనై యున్నాను. కాని నీవు నన్ను అకర్తనుగ తెలియుము. అని తన యకర్తృత్వము భగవంతుఁడు ప్రకటించి యున్నాఁడు.

ఇంతదూరము వివరించినమీఁద మానవులందఱును జన్మచేత నొక్క జాతిగ పుట్టి పిదప వారు చేసెడి వృత్తికర్మలచేత వేఱువేఱుజాతు లగుదురనుట పైవాదమువలన సమంజసముగా నుండదాయని కొందఱు

వచింతురు. ఇందలి సత్యము నెఱుంగుటకు భగవద్గీతకంటెను వేఱు శాస్త్ర ప్రమాణముండబోదు. ఏలందురా? యీతత్వములనుం దెలుపుటకే యీశాస్త్రము ప్రవృత్తమై యున్నది.

అర్జునుఁడు జన్మచేత క్షత్రియుఁడై యున్నాఁడు. అతఁడు తనకు విధి విహితమైయున్న యుద్ధకర్మ పాపహేతువైనదని దలంచి, భిక్షాకర్మ నవలంబింప దలంచి, యుద్ధరంగమునుండి మఱలుట కుద్యమించెననికదా యీయుద్గ్రంథ మారంభమైనది. అట్టి విషమావస్థయందు ధర్మ రక్షణార్థమై యవతరించిన శ్రీకృష్ణుఁడు స్వధర్మము నుండిప్రమాదము నొందుచుండిన యర్జునునకు గీతాశాస్త్రము నుపదేశింపవలసివచ్చినది, గాన భగవద్గీతయే ప్రమాణమని దలంచెడువారు పుట్టుకవలననే జాతియును, ఆజాతికి నిధివిహితమగు కర్మయు, నేర్పడి యున్నదనెడి గీతాసిద్ధాంతము నొప్పుకొనక తప్పదు.

*ధర్మనిర్ణయము కష్టమైనది*

ధర్మమనగ భగవత్స్వరూపమగు సత్యతత్వము. అది మానవుల యుక్తివాదముల కందనిది. మానవులకు భ్రమప్రమాదములు సహజములు. ధర్మము నెఱుంగుటకు ప్రతివిషయమునందును సత్యతత్వమును దర్శించగల మహర్షి కావలెను. కనుకనే భగవానుఁడు,

శ్లో॥ కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥
గీ 4–16

తా॥ ఎది ధర్మము ఏది అధర్మము అనెడి విషయములో పండితులైనను ప్రమాదపడుచున్నారు. ఏది యెఱింగిన మానవుఁడు అశుభమునుండి విడువఁబడునో అట్టిధర్మమునుఁ జెప్పుచున్నాను.

శ్లో॥ కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః॥ గీ 4–16

తా॥ విహితకర్మయొక్కయు, నిషిద్ధకర్మయొక్కయు, అకర్మయొక్కయు తత్త్వము తెలియఁదగినది. అందుచేతఁ గర్మతత్త్వము మిక్కిలి గహనమైనది.

అని యర్జునుని బోధించియున్నాఁడు. లోకమునందధర్మము నాచరించువారు రెండు విధంబులుగ నుందురు. ధర్మంబు నెఱుంగక నాచరించువారును, ధర్మంబు నెఱింగియు లోభావేశమున తద్విరుద్ధంబుగ నాచరించువారు నొప్పుచున్నారు.

శ్లో॥ ధర్మోపదేశ సమయే జనాస్సర్వేపి పండితాః
తదనుష్ఠాన సమయే మునయోపి నపండితాః॥

అనినట్లు ధర్మోపదేశమున నందఱు పండితులేగాని తదనుష్ఠాన కాలమునఁ బండితులు నవివేకు లగుచున్నారు. అందువలననే భారత యుద్ధరంగమునందు మోహప్రమాదము నొందిన యర్జునుండును సత్యధర్మము నెఱింగిన వానివలెనే శ్రీకృష్ణునితో నిట్లు వచించెను. "కృష్ణా! నేనీయుద్ధము నొనర్పను రాజ్యము, విజయము, సుఖము, నాకక్కర లేదు. గురువులు, తండ్రులు, తాతలు, కుమారులు, బంధువులు మొదలగువారినిఁ జంపినయెడల పాపము రాకతప్పదు. రాజ్యలోభినై వంశక్షయ మిత్రద్రోహ పాపములను పై వేసికోఁజాలను. నాకులస్థులనుఁ జంపినయెడల సనాతన వంశధర్మములన్నియునుఁ జెడును. అధర్మము వ్యాపించును. అందువల్ల కులస్త్రీలు చెడుదురు. వర్ణసంకర మేర్పడును. దీనివలన పితృవర్గములకు పిండ తిలోదకములు లోపించును. అబ్బబ్బ! ఇట్టి వర్ణసంకర మొనర్చిన కులఘ్నునికి మహానరకమే గతి. గాన దీనికన్నను వారిచేఁ జచ్చుటయే మేలు. లేకున్న భిక్షమెత్తుకొనియే జీవింతును." అని మహత్తర ధర్మోపన్యాసముఁ జేసెను. (అర్జున విషాదయోగమునుఁ జూచునది) అర్జునుఁడు వచించిన పై వాక్యములు ధర్మముగాకున్నను ధర్మములైనవిగనే సామాన్యమానవులకు గన్పట్టుచున్నవిగదా!

అర్జుననంతటి ధీశాలికి అధర్మమే ఇట్లు ధర్మమని తోఁచి యున్నపుడిక సామాన్యులు ధర్మము నెఱుంగఁగలరా? దాని నాచరణలోఁ బెట్టఁగలరా? లోకమునందు కొన్ని కార్యములు మానవుల దృష్టికి ధర్మములుగ గనుపట్టుచున్నను, నిజమున కధర్మంబులై యున్నవి. కొన్ని అధర్మములుగ గనుపట్టుచున్నను సూక్ష్మంబుగఁ జూచిన ధర్మంబులై యగుపడకపోవు. దివ్యదృష్టిచేత ధర్మాధర్మములను, అత్మయందు చూడగలిగినవారే ధర్మనిర్ణయాధికారులు. వారివాక్యములే ప్రమాణంబులుగాని తాత్కాలిక లాభాలాభదృష్టితోఁ జెప్పినవి ధర్మంబులుగావు.

శ్రీమద్రామాయణమునందు జాబాలియను బ్రాహ్మణుఁడు పితృవాక్యపాలనకై మునివృత్తి దాల్చి, చిత్రకూటపర్వతమునుఁ జేరి యున్న శ్రీరాముని చెంతకేగి వేదధర్మవిరుద్ధమగు నాస్తికోపన్యాసము నొనర్చుచు శ్రీరామునితో నిట్లు నుడివెను.

శ్లో॥ అష్టకా పితృదైవత్య మిత్యయం ప్రసృతో జనః
అన్నస్యోప ద్రవం పశ్య మృతోహి కిమశిష్యతి॥

యదిభుక్త మిహాన్యేన దేహ మన్యస్య గచ్ఛతి
దద్యాత్ప్రవసతశ్శ్రాద్ధం నతత్పథ్యశనం భవేత్॥

దాన సంవన నాహ్యేతే గ్రంథా మేధావిభిః కృతాః
యజస్వ దేహి దీక్షస్వ తపస్తప్యస్వ సంత్యజ॥

సనాస్తి పరమిత్యేవ కురుబుద్ధిం మహామతే
ప్రత్యక్షం యత్తదాతిష్ఠ పరోక్షం పృష్ఠతః కురు॥
అయోధ్య కాండము 108 సర్గ 14, 15, 16, 17

తా॥ ఓ రామా! లోకము నిష్కారణముగ చనిపోయిన తలిదండ్రులను గుఱించి ప్రతిసాంవత్సరిక మనెడి పితృశ్రాద్ధమునుఁ జేయుటను నిది వృథా అన్ననాశమని యెఱుంగుము. శ్రాద్ధమందు పెట్టఁబడిన యన్నమును చచ్చినవాఁడుఁ దినుచున్నాఁడా? లోకములో

యొకడు దినిన యన్నంబును మఱియొకని దేహంబునకుఁ జేరి వాని యాకలిఁ దీర్చుచున్న యెడల ప్రవాసంబునం దున్నవానికై శ్రాద్ధంబుఁ జేయవచ్చును. ఇంటిలో పెట్టఁబడిన యన్నంబు మార్గస్థునికి చెందుట లేదు గాన అదంతయు అన్న నష్టమేగాని వేఱుగాదు. దానముల కొఱకు వశీకరణోపాయపరులగు ద్రవ్యగ్రహణ బుద్ధుల చేత "కర్మ చేయుము", "దాన మొసంగుము", "దీక్షితుఁడవు గమ్ము", తపస్సు చేయుము", ధనేషణాదులను వదలుము" అనెడి సూక్తులు వ్రాయఁబడినవి. గాన బుద్ధిశాలివగు ఓరామా! నీవు పరలోక మేలేదని గ్రహింపుము. ప్రత్యక్షమైనదానిని స్వీకరింపుము. ఏది పరోక్షమో దానిని వదలుము."

అని యిట్లు తర్కరూపములగు నాస్తిక వాక్యముల నుపదేశించిన జాబాలిని గాంచి శ్రీరాముండిట్లు నుడివి యున్నాఁడు.

శ్లో॥ భవన్మే ప్రియకామార్థం వచనం యదిహోక్తవాన్
అకార్యం కార్యసంకాశం అపథ్యం పథ్య సన్నిభం॥
109 సర్గ 2

తా॥ బ్రాహ్మణోత్తమా! నీవు నాయందు ప్రీతితో నిపుడుఁ బలికిన వాక్యము, సిద్ధాంత కార్యంబువలె గనుపట్టుచుండెడి అకార్యంబుగను పథ్యమైనదిగ దోచుచుండెడి యపథ్యంబునై యున్నదినుమా!

శ్లో॥ అధర్మం ధర్మవేషేణ యదీమం లోకసంకరం
అభిపత్స్యే శుభం హిత్వా క్రియావిధి వివర్జితం॥ 109 సర్గ 6

శ్లో॥ కశ్చేతయానః పురుషః కార్యాకార్య విచక్షణః
బహుమన్యతిమాం లోకే దుర్వృత్తం లోకదూషణం॥
109 సర్గ 7

ప్రత్యగాత్మ మిమం ధర్మం సత్యం పశ్యామ్యహం స్వయం
భార స్సత్పురుషా చీర్ణ స్తదర్థ మభిమన్యతే॥ 109 సర్గ 19

తా॥ లోకమును సంకర మొనర్చునట్టియు, క్రియావిధులు లేనట్టి యానీచే జెప్పఁబడిన యధర్మంబును నేను శుభదాయక మగు వేదకర్మను విడచి ధర్మవేషముతో నంగీకరించి దుర్వృత్తి నవలంబించినచో, లోకదూషితుఁడు నగు నన్ను యుక్తాయుక్త పరిజ్ఞానములుగల యేవిజ్ఞుఁడు సత్కరించును ఇపుడు నే నాచరించుచుండెడి సత్యమగు వేదధర్మమును, ఆత్మయందు ప్రత్యక్షముగ నేను జూచుచున్నాను. గాన సత్పురుషులచే నాచరింపఁబడిన యీ జటావల్కల భారమును అంగీకరించుచున్నాను.

అని శ్రీరామమూర్తి వేదధర్మము నాత్మయందు దర్శించుచు నాచరించుచున్నానని జాబాలికి సమాధాన మొసంగియున్నాఁడు.

ధర్మాధర్మముల నాత్మయందు స్వయముగ జూచు సామర్థ్యము మహర్షులకే గలదు. వారి నిర్ణయములే శాస్త్రము. శ్రీమహాభారతమునందు నీవిషయమును భగవంతుఁ డిట్లు నుడివియున్నాఁడు.

శ్లో॥ శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే యస్తా ముల్లంఘ్య వర్తతే
ఆజ్ఞా ఛేదీమమ ద్వేష్యః సమేవధ్య తమో మతః॥

తా॥ వేదశాస్త్రములు నాయాజ్ఞలు. ఎవ్వఁ డట్టియాజ్ఞల నుల్లంఘించి వర్తించునో వాఁడు నాయాజ్ఞను ఛేదించినవాఁడై నాకు ద్వేష్యుఁడును, దండదగినవాఁడునై యుండును.

ధర్మమును గుర్తించు సామర్థ్యము మానవుల కుండదు గాన వారు వేదశాస్త్రములుఁ జెప్పిన ట్లాచరించవలయును. అందులకై, మనుస్మృతి యిట్లు వచించుచున్నది.

శ్లో॥ వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యాదతం ద్రితః
తద్ధి కుర్వ౯ యథాశక్తి ప్రాప్నోతి పరమాంగతిం॥

తా॥ వేదచోదితమగు స్వజాతికర్మను ప్రమాదపడకుండ,

నిత్యము యథాశక్తిగ నాచరించువాఁ డుత్తమగతి నొందును. అదే విషయము కూర్మపురాణమునం దిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ యథాశక్తి చరేత్కర్మ నిందితాని వర్జయేత్
విధూయ మోహకలిలం లబ్ధ్వాయోగ మనుత్తమం॥

గృహస్థో ముచ్యతే బంధాత్ నాత్ర కార్యా విచారణా॥

తా॥ విధివిహిత కర్మను యథాశక్తిగఁ జేయుచు నిందిత కర్మలను విడచు గృహస్థుఁడు అజ్ఞానముక్తుఁడై యోగసిద్ధినంది బంధమునుండి విడువఁబడుచున్నాడు.

శాస్త్రము లిట్లేకవాక్యముగ సత్యము వచించుచుండుటవల్ల మానవు లెవరే స్వభావముచేత నేజాతియందు జన్మించి యున్నారో, ఆజాతికి విధివిహితకర్మ అదెట్టిదైయున్నను యథాశక్తిగ నాచరించు చుండిన యెడల పాపవిముక్తులై సుఖానందముల నొందగలరు. ఆ విషయము నెంతరూఢిగ శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడో వినుఁడు.

శ్లో॥ స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతికి కిల్బిషం।
గీ 15-42

భగవద్గీత మానవులకు వారివారి స్వభావములవల్ల జాతులును కర్మలు భగవంతునిచే నేర్పఱుపఁబడి యున్నవని, దెలుపుట యథార్థమేయైనను స్వభావశబ్దమునకు నిజమగు యర్థమేమియోఁ దెలిసిన గాని జాతికర్మలకు హేతువు పూర్తిగ తెలియజాలము. గీతయందు ఆ స్వభావశబ్దమును ఎక్కడెక్కడ నేయేయర్థములందు వాడినదియు గమనించినగాని దాని తాత్పర్యము బోధపడదు. కొన్ని యట్టి నిదర్శనముల నిచ్చుచున్నాను. గమనింపుడు.

శ్లో॥ స్వభావస్తు ప్రవర్తతే। గీ 5-14

శ్లో॥ దేహినాం సాస్వభావజా। గీ 17-2

శ్లో॥ కార్పణ్య దోషో పహత స్వభావః। గీ 12-7

శ్లో॥ బ్రహ్మకర్మ స్వభావజం। గీ 18-42

శ్లో॥ స్వభావ నియతం కర్మ॥ గీ 18-47

శ్లో॥ స్వభావ జేన కౌంతేయ॥ గీ 18-60

ఇత్యాది స్థలములయం దన్నిచోట్లను స్వభావశబ్దమునకు అంతఃకరణము ప్రకృతి అనియర్థమే రూఢిగఁ జెప్పఁబడినదని యర్థవిదులెఱుంగగలరు. భగవద్గీతకు సరియైన యర్థమును ప్రయోగిత పదములఁబట్టి చెప్పినది శంకరాభాష్యమని పండితు లెఱుంగుదురు. అందులకై శ్రీవారి భాష్యమునుండి కొంత వివరింప యుత్నించెదను.

శంకరభాష్యము స్వభావశబ్దము నెట్లు వ్యాఖ్యానించెనో గమనింపుడు,

శ్లో॥ స్వభావః అవిద్యాలక్షణ ప్రకృతిః గుణమయీ॥ గీ 5-24

శ్లో॥ జన్మాంతరకృతో ధర్మాధి సంస్కారః
మరణకాలే అభివ్యక్తః స్వభావ ఉచ్యతే॥ గీ 17-2

స్వభావమనగ పూర్వజన్మ దేహముయొక్క మరణకాలమునందుండిన అంతఃకరణము లేక ప్రకృతియని తాత్పర్యము. అందువలన మానవునిజన్మ దేనిపై నాధారపడియున్నదని విచారింతము.

*తొలి - మలి జన్మల సంబంధము*

ప్రాణికి మరణసమయమునం దెట్టిభావముగల యంతఃకరణము (ప్రకృతి) గలిగియుండునో అప్రకృతి ఆభావముయొక్క సిద్ధికి పునర్జన్మయం దనుకూలమగు శరీరమును గలిగించును. అందులకు నాధారమును విలోకింపుడు.

శ్లో॥ యం యం వాపి స్మరన్ భావం త్యజ త్యంతే కళేబరం
తంతమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః గీ 8-6

తా॥ జీవుఁ డేయేభావమును (ఆకృతిని) గోరుచు దేహము ను విడచునో ఆభావమునే పొందును. ఎల్లప్పుఁ డేభావమును స్మరించు చుండునో ఆసమయమున నాభావము గలుగును.

మరణసమయమునం దంతఃకరణమునందు సాత్వికభావ మధిక మై యుండిన యెడల అది బ్రాహ్మణజాతి దేహమును గలిగించును. దానికి శమము, దమము, తపస్సు ఇత్యాదులు విధివిహితకర్మలుగా నుండును. తమోగుణమునకంటే రజోగుణము అధికముగనుండినపుడు మరణము గల్గినయెడల నది క్షత్రియజాతి దేహమును గలిగించును. దానికి శౌర్యము, తేజస్సు నొప్పెడికర్మలు విధివిహితము లగును. సత్వమునకంటే తమస్సు, తమస్సునకంటే రజోగుణము అధికమై యున్నపుడు మరణము గలిగిన నది వైశ్య దేహమును గలిగించును. దానికి కృష్యాదులు కర్మలుగా నొప్పును,

సత్వమునకంటే రజస్సు, రజస్సునకంటే తమోగుణము అధి కమై యుండినపుడు మరణము గలిగిన యెడల నది శూద్రదేహమును కలిగించును. సేవాదులు దానికర్మలుగా నుండును. మరణకాలమం దేయాకృతిగల కర్మయం దతఃకరణము వర్తించుచుండునో ఆకర్మకు తగిన దేహము నది గలిగించును.

ఇందులకుఁ దార్కాణముగ స్కాందపురాణమందలి హేమ కూటఖండము నందలి యొకకథ నుదహరింతును.

పూర్వము పంపాక్షేత్రమునందలి తుంగభద్రాతీరమునం దొక వేశ్య పూర్వపుణ్యావశమున యోగినియై పర్ణశాల కల్పించు కొని వసించుచుండెను. ఆమె దైవానుగ్రహమున పూర్వజన్మ జ్ఞాన

మును అణిమాది సిద్ధులను గలిగియుండినది. జనులు స్వాభీష్టఫల సిద్ధులకై ఆమెను తండోపతండములుగా సేవించుచుండిరట. ఇట్లుండ నొకప్పుడు శండిలుఁడను ఋషి స్నానార్థమై తుంగభద్రానదికిఁ బోవుచు నచ్చట జనసమూహములతో నొప్పుచున్న జటావల్కల భస్మరుద్రాక్షులను ధరించియున్న యోగినియగు వేశ్యనుగాంచి, కర్మవశమున నామెపై నసూయఁజెంది "ఆహా! ఏమి యీజనుల యజ్ఞానము. నీచకులమునందు బుట్టిన వేశ్య నిట్లుల సేవించుచున్నారో" అని ఆమెను మనస్సునందు నిందించుచుండెను.

ఆయోగిని తనయాత్మబోధమున నదియెఱింగి యాఋషిని గాంచి "మహాత్మా! మీరేల నన్ను నిష్కారణముగా మనసులో నిందించుకొనుచున్నారు?" అని వినయముతో ప్రశ్నింపగ నాఋషి యామెతో నిటుల బలికెను.

"నేను నిన్ను నిందింపలేదుగాని నీవు సాధుగర్హితమగు వేశ్య కులమున బుట్టినదానవు. నీకు తపస్సు జ్ఞానమెక్కడిది. లోకులజ్ఞానులై వ్యర్థముగ నిన్ను సేవించుచున్నారే. అని నామనంబున నవ్వుకొనుచుంటిని."

అనిఁబల్కిన శండిలునితో "ఓబ్రహ్మమూర్తీ! మీరు పరుల నిటుల నిందింపఁదగునా" అని యిట్లనెను.

శ్లో॥ విప్రో భవతి పూర్వస్మి న్నిదానీం పూర్వజన్మజాః
శూద్రో విప్రత్వ మాయాతి విప్ర సంకర జన్మజాః

తా॥ పూర్వజన్మమందు శూద్రుఁడుగఁ బుట్టినయొకానొకఁడు బ్రాహ్మణుఁ డగుచున్నాఁడు. ఇపుడీజన్మయందు బ్రాహ్మణుఁడుగఁ బుట్టియున్నవాఁ డొకకారణమున సంకరజన్మ నొందుచున్నాడు. ప్రాణుల కర్మగతి నెవ్వఁ డెఱుంగఁగలడు. వ్యర్థముగ బ్రాహ్మణుఁడను, పండితుఁడనను గర్వము నొందకు"మని, జెప్పి వెడలిపోయెను.

ఋషియు నచ్చటనుండి తన యాశ్రమమునకు వెడలిపోయెను.

పిమ్మట కొంతకాలమునకు భూరియను పేరుగల చండాలుఁడు సంతానార్థియై ఆయోగినిని సేవించి ప్రార్థింపగ, నామె యాచండాలునితో "నీవు మంచిచర్మముతో పాదుకలను జేసి, యీంవై శాఖమునం దీక్షేత్రమునందు వసించుచున్న శండిలుఁడను బ్రాహ్మణున కిచ్చిన యెడల నీకు పుత్రుఁ డుదయించు"నని పలికెను.

అపుడా చండాలుఁడు మంచిపాదుకలను నిర్మించి శండిలమహర్షి వసించెడు నాశ్రమ బహిఃప్రదేశమునం దుంచి వెడలిపోయెను. పిమ్మట శండిలుఁడు స్నానార్థమై బయలుదేర త్రోవలో నా మంచిపాదరక్షలుఁ గన్పించినంత సంతసించి, వానిఁ గ్రహించి యుపయోగించెను. దైవయోగమువలన నాపాదరక్షలయం దనురాగమును శండిలునకు వృద్ధికాఁజొచ్చెను. పాదరక్షలయం దిట్లు ఋషిమనస్సు నిల్పియున్నసమయమున నతనికి మరణముఁ గలిగెను.

ఆదోషమువలన శండిలఋషి భూరియనెడి చండాలునిభార్య గర్భమునందుఁ జేరి స్వకర్మకై చింతించుచు ప్రసవసమయ మేతెంచి నను బయటకు రాక నిరోధించుచు బాధ గలిగించుచుండెను. చండాలుఁడు తద్బాధా నివారణమునకు మరల నాయోగినిని ప్రార్థింపగ నే యరుదెంచి, యామె గర్భమందున్న శిశువుతో నిటులఁ బలికెను.

"ఓబ్రాహ్మణుడా! ఏల బాధ గలిగించెదవు. గర్భమునుండి వెడలిరమ్ము. పూర్వార్జిత దోషము ననుభవింపక తీరునా? నిన్ను ఆవుపాలచే పోషించున ట్లేర్పాటుఁ జేయింతునని తెలిపి చండాలునిలో నట్లే సలుప నాజ్ఞాపించి వెడలిపోయెను.

వెంటనే యతఁడు భూరికి పుత్రుఁడై జన్మించెను. భూరి సంతోషించి యాశిశువునకు నిత్యయోగియని పేరువెట్టి యోగిని జెప్పిన విధమున బోషించుచుండెను. కొంతకాలమునకు నిత్యయోగి పెద్దవాఁ

డయ్యెను. పూర్వపుణ్యవిశేషమున నతఁడు జన్మప్రభృతి ఆత్మజ్ఞానియై వర్తించుచుండెను. ఒకనాఁడు తండ్రియగు భూరి గ్రామాంతరమున కేగియున్న సమయమునం దాపట్టణమున రాత్రి జాగరణ మొనరింప వలసినపనికై చిత్రసేనుఁ డనురాజు భూరికొఱకు భటునిఁ బంపెను. భూరి గ్రామమునలేఁడు. రాజాజ్ఞ నిర్వర్తింపక తప్పదు. గాన భూరి భార్య కుమారుఁడగు నిత్యయోగి కాసంగతిఁ దెలిపెను. తానాపనిఁ జేసివత్తునని తల్లితోఁజెప్పి ఆపట్టణమునం దారాత్రి ప్రజలను జ్ఞాన ప్రబోధక వాక్యములతో జాగరణ మొనర్చెను. ఆరాజావాక్యములు రాత్రి విని ఉదయమున నిత్యయోగినిఁ బిలిపించి నీవెవ్వఁడవని ప్రశ్నించెను. ఆతఁడు తానెవ్వఁడో తెలియదనియు పంపాక్షేత్రమునం దున్న యోగినియగు వేశ్యను విచారించిన యెడల తెలియఁగలరనెను.

అపుడారాజు ఆయోగినినిఁ బిలిపించెను. ఆమెవలన విషయము నంతయు నెఱింగి ఆమె అనుగ్రహమున సర్వులు కృతార్థులైరి.

శ్లో॥ అంత్యకాలేతు యంభావం స్మరంతి విబుధా అపి
ప్రాప్నువంతి తద్భావ మితివేదవిదో విదుః॥ స్కాందము

శ్లో॥ యం యం స్మృత్వా త్యజం త్యంతే కళేబర మనన్యధీః
తం తం దేహం సమాప్నోతి పురుషోభావనా బలాత్॥
హేమకూట ఖండము

ఈసిద్ధాంతములను పైకథ చక్కఁగ వివరించినది.

పుట్టుకచేత మానవులందఱు సమానులేయైనను, యెవ్వరికిగాని నియమబద్ధములగు కర్మలు లేకపోయిన యెడల సంకర మేర్పడి కష్టము లుదయించును.

ఉదాహరణ కొకకుటుంబ వ్యవహారములఁ గైకొందము. ప్రపంచ మొక కుటుంబము. దీనికి పరమేశ్వరుఁడు తండ్రియగుట వలన యజమానుఁడై యున్నాఁడు. మానవులందఱును అదే దేవుని కుమారులే. కుమారు లందఱును తండ్రి నియమించిన కర్మలను విధిగ

జేయుచు కర్మఫల లాభములను కుటుంబసౌఖ్యమునకై తండ్రికి సమ ర్పించవలయును గదా! కుమారు లందఱకును తండ్రి వారివారి యిష్టానుసారముగా పనులను నియమించుచుండుటయుఁ దెలిసిన యంశమే. జేపటిపని కుమారు నడిగి రాత్రియందే తండ్రి నియమించును, లేదా నిశ్చయించును. తండ్రితో రాత్రి తాను కోరుకొని యున్నపని మఱుదినమునందు చేయకపోయినను మఱొకపనికిఁ బోయినను క్రమశిక్షణమునకు భంగముఁ గలిగించినవాఁడై కు టుంబసౌఖ్యమునకు లోటుగలిగించి తండ్రిచేదండింపఁ బడునుగదా!

ఇందువలన తేలిన సారాంశ మేమన మానవుల కిపుడు లభించి యుండిన జన్మలును, జన్మలకు విధింపఁబడియున్న కర్మలును తమతమ పూర్వదేహముల మరణసమయములందు జీవులు కోరుకొని తెచ్చు కొని యున్నవేగాని వేఱుగావు. ప్రస్తుతము వర్తించుచున్న జన్మకు విధివిహితమై యుండిన కర్మను విడువ నెవ్వనికినిఁ జెల్లదు.

శ్లో॥ నియతస్యతు సన్న్యాసః కర్మణో నోపపద్యతే
మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః గీ 18-7

తా॥ జన్మమాత్రమున నియతమై యుండిన కర్మయొక్క విడుపు చెల్లదు. అట్లొనర్చినవాఁడు తామసుఁడుగ పరిగణింపఁబడును.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ గీ 3-35

తా॥ పరధర్మమును తాను లెస్సగ నాచరించుటకంటె హీన మైన స్వధర్మము నాచరించుట శ్రేయస్కరము. స్వధర్మమునందలి మరణమైనను మంచిదేగాని పరధర్మము భయావహమైనది.

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవానిదేహీ
గీ 2-22

తా॥ మానవుఁడు జీర్ణించిన వస్త్రములను విడచి యితర నూతనవస్త్రముల నెటుల ధరించుచుండునో జీవుఁ డట్లే ప్రాత దేహములను విడచి క్రొత్త దేహములనుఁ దాల్చుచున్నాఁడు.

ఇదెంత చక్కని యుపమానమో పరికింపుఁడు. జీవునకు దేహము మానవునకు వస్త్రమువంటిది. అభిమానము పూర్తిగ నశించువఱకును మానవుఁడు వస్త్రధారణముఁ జేయుచునే యుండును. అటులనే అజ్ఞానము నివర్తించునఱకును జీవుఁడు జన్మము లెత్తుచునే యుండును.

మానవుఁడు ధరించుటకు లోకమునం దనేకవిధములగు వస్త్రములు గలవు. వానిలో తన యోగ్యతానుసారముగ నిష్టములగు వస్త్రములను మానవుఁడు గైకొని ధరించుచుండును. అటులనే జీవుఁడు తన యోగ్యతానుసారముగ నిష్టములగు జాతిశరీరములఁ దాల్చును.

పైఁజెప్పిన విషయములనుఁబట్టి జాతి యనునదియు, కష్టసుఖములనునవియు, నేదోయొక నియతినిఁబట్టి కలుగుననియు, నవి యాహ్లాదకరములును, సంకటదములు నగుననియుఁ దేలినది. అదియుగాక నానియతిఁబట్టి మానవుఁడు పూర్వజన్మమున నాస్థితి కోరుకొనియే యుండెనని తద్వాంఛాను సరణముగ నాతని కావిధమగు జీవితస్థితి లభించు ననియుఁ జెప్పినటులైనది. కాని కొందఱు మానవుఁడు సంతోషమును గోరక కష్టములఁ గోరునా, మనకన్నుల యెదుట నింతటిదుఃఖ మగుపడుచున్నదే, యిందులకుఁ గారణము వారి జన్మాంతర వాంఛ యనుట అవివేకముగ నుండదా యనవచ్చును.

ఈవాదము చాల సమంజసముగ నున్నది. ప్రతియొక్కఁడును సుఖింపఁగోరును గాని సంకటములఁ గలనైన వాంఛింపఁడు. ఇందుల కొక లౌకికోదహరణము నొసంగుదుము.

ఈకాలమున ఛాయాచిత్రము (Photo) నెటుంగని వారుండ

రు. లోకమునందు ఫోటో తీయించుకొనగోరెడి వారెల్లరును తమ కిష్టములును సాధ్యములునగు వస్త్రవాహన భూషణాదులను, వసతులను, పరివారకుటుంబజనులను, ప్రియజంతువులను, జేకూర్చుకొని యిష్టములగు అంగవిన్యాసాది కర్మలతోనుండి ఫోటో తీయించుకొందురు. లోకమందు తామట్టి బింబరూపములతో నొప్పుచుండవలెనని వారికపుడు కలిగియుండిన కోరికయైయున్నది.

ఫోటో తీయువాఁడు బొమ్మను నొక్క సమయమందు ఫోటో తీయించుకొనగోరెడివారెట్లుందురో అట్టి బింబములే ఫోటోయందు పడును. పిమ్మట నెప్పుడైనను తామట్లు లోకమున గనుపడుచుండుట తమకసహ్యమేయైనను, యిష్టములేకున్నను, ఆబింబము నశించువఱకు నట్లు కన్పడక తప్పదుగదా!

అటులనే మరణకాలమందు జీవుని స్వభావమెట్లుండునో, అట్టి స్వభావానుగుణ జాతిరూపగుణకర్మలు లభించును. వలదనినను తప్పించుకొనుటకు వీలులేదు. మఱియు ప్రకృతి తత్వమెప్పుడును మానవులకు క్షణక్షణము భిన్నభిన్నాభిరుచులను గలిగించుచుండుట, లక్షణముగాఁగలదై యున్నది. మానవునకు, బాల్యము మొదలు జీవితాంతమువఱకు నొకప్పుడు ప్రియముగ నుండినది, వయస్సు మీఱిన కొలఁదియు నదియే యప్రియమైనదగుచున్నది.

మఱియు లోకమునందొకనికి ప్రియముగ నుండినది మఱియొకనికప్రియమైనదిగా నుండుటందఱెఱుంగుదురు. ఒకనికి నీచముగ నుండునది మఱియొకనికి యోగ్యమైనదిగనుండును. ఇంతెందులకు, బాలుర మీకిష్టములగునవి తీసుకొండని ద్రవ్యమిచ్చినయెడల వారొకరొకరు ఒక్కొక పదార్థము, తినుబండారమునుగాని, ఆటవస్తువును గాని కైకొనుచున్నారు. యౌవన రూపలావణ్యాదులుగల స్త్రీ యొక్కతయే భర్తకు, తండ్రికి, కుమారునకు, యువకునకు, వృద్ధునకు

నపుంసకునకు ఒకరొకరి కొక్కొక్క విధమగు నభిప్రాయము జనింప జేయుచున్నదిగదా!

భరతఖండ వాసులకెల్ల అతి ప్రియపదార్థమగు నెయ్యి, బర్మా వాసులకు సరిపడక యసహ్యమగుచున్నది. మఱియు నిట్టి యభిరుచి భేదములేగాదు; ఉత్తమజాతికర్మలు మిక్కిలి బాధ్యతతో కూడినవి. గాన చక్కగ నిర్వహించుటకు తగిన యర్హత గావలయును. అవి లోకమందు తరతమ భేదములతో నొప్పెడి రాజోద్యోగ పదవులనేకములున్నను, ప్రజలు వారువారు నిర్వహించుటకు యోగ్యములగు పదవులను మాత్రమే కోరుకొనుట లేదా! తలారి పనికి దరఖాస్తు పెట్టుకొనిన వానికి కలెక్టరు పని నిచ్చెదమన్న యోగ్యత చాలనందున వాడనుమతింపగలడా!

గాన అట్లు సంశయింప పనిలేదు. మానవులకు గలిగియున్న జన్మకర్మలకు, సుఖదుఃఖాదులకును పూర్వజన్మముయొక్క మరణసమయమునందలి స్వభావము, వారివారి పుణ్యపాపకర్మలే కారణములు గాని, భగవంతు డెంతమాత్రమునుగాడు. వారివారి కర్మలకు తగిన ఫలములను వారు కోరినట్లు క్రమము దప్పక వారికందఁజేయుట భగవంతుని కృత్యమైయున్నది.

. భగవంతుడు నిమిత్తమాత్రుడగు నిష్పక్షపాతి.

కం॥ వినుమలుకయు కూర్మియు లే
వనవద్యా యొజ్జనంబు అందును విధికిఁ ।
మును జేసిన కర్మము ఫల
మనుభవ గోచరము సేయు నంతియ తరితోఁ॥

(భారతం—అను. 5 ఆశ్వా.

తాత్పర్యము సులభము.

కొందఱు నిష్కారణముగ భగవంతునకు పక్షపాతాదులు గలవని నిందింతురు. అటుల దలంచుట పొరపాటు. వైద్యుడగు వాడు ప్రజలకు సంభవించిన నానావిధములగు రోగములకు మూలకా

రణముల నెఱింగి యేరోగ నివారణమునకెట్టి మందు నొసంగవలెనో, యెట్టి అహార విహారాది విధుల నేర్పఱుపవలెనో అట్లొనరించుచున్నాడు. రోగములు నానావిధములగుటవల్ల చికిత్సలును నానా విధములుగ నొప్పుచుండును. రోగులయందు వైద్యునకెట్టి పక్షపాతాదులులేవు. వైద్యుడందఱియందును సమబుద్ధితో రోగశాంతినే యభిలషించుచుండునుగదా!

అటులనె భగవంతుడు ప్రజలకు సంభవించియున్న బహువిధములగు పుణ్యాపాపకర్మలయొక్క శాంతికై బహువిధములగు సుఖదుఃఖాదులను విధించుచున్నాడు. సర్వభూతములయందును సముడూపుడై వారివారి కర్మలకు తగిన జాతికర్మవిధుల నేర్పఱుచుచున్నాడు. భగవంతున కెవరియందెట్టి పక్షపాతమును లేదు.

శ్లో॥ లాలనే తాడనే మాతుః నవైషమ్యం యదార్భకే ।
తద్వదేవ మహేశస్య నియంతుర్గుణదోషయోః ॥

తా॥ కుమారుని లాలించుటయందును, దండించుటయందును, తల్లికెటుల వైషమ్యభావము లేకయుండునో, అటులనే గుణదోషములకు నియంతయగు పరమేశ్వరునకు వైషమ్యభావము లేదు.

భగవద్గీత బోధించిన ధర్మసిద్ధాంతము నిదియే.

అటులగాదు, మానవులకు జన్మమాత్రమున విధివిహితములగు జాతులుగాని, కర్మలుగానిలేవని యనినయెడల భగవద్గీతయందలి యీక్రింది శ్లోకములకు సరియగు అర్థము జెప్పుటకే వలనుపడదు.

శ్లో॥ నియతం కురుకర్మత్వం॥ గీ-3-౮-
శ్లో॥ నియతస్యతు సంన్యాసః॥ గీ-౧౮-౭-
శ్లో॥ సహజం కర్మకౌంతేయ॥ గీ-౧౮-౪౮-
శ్లో॥ స్వధర్మమపిచావేక్ష్య॥ గీ-౨-3౧-
శ్లో॥ స్వేస్వేకర్మణ్యభిరతః॥ గీ-౧౮-౪౫-
శ్లో॥ శ్రేయాన్ స్వధర్మోవిగుణః గీ-౧౮-౪౭
శ్లో॥ స్వకర్మణాతమభ్యర్చ్య॥ గీ-౧౮-౪౬

ఇత్యాది వాక్యము లనేకము లింకనుగలవు. వీనికి పక్షపాతముతోనో, పాండిత్య ప్రకర్షతోనో, యెవ్వరేని యేదియో యొకవిధమగు అర్థమును ప్రయాసతో నాసాకేశాకర్షణమువలె కల్పించినను అది పారమార్థ మెంతమాత్రమును కాజాలదని మాత్రము చెప్పవలయును.

భగవద్గీత ఒకజాతియందు జన్మించిన మానవుడు మఱియొక జాతి కర్మ నెంతమాత్రమును జేయరాదని శాసించుచున్నది. జన్మచేతనే జాతి యేర్పడుచున్నదని స్పష్టపఱుపఁబడినదిగదా!

బీజప్రాయములుగ, తత్వసూత్రములుగా నొప్పుచుండిన భగవద్గీతా సిద్ధాంతములకు విపుల వ్యాఖ్యానమై యొప్పుచుండిన భారతమునందీ విషయమే ధర్మరాజు భీష్మునితో నిట్లు ప్రశ్నించెను.

కం॥ అనిన పితామహునితోన ।
జనపతి బ్రాహ్మణ్య మవలీలా తులనూటఁ ॥
జనియించిన వానికి దొర ।
కొనునొకో యతివిమలకర్మ గుణయోగమునన్ ॥

(తెనుగు భారతం అనుశాసనికం. ౧ ఆశ్వా.

అని అడిగిన ధర్మరాజునకు ప్రత్యుత్తరముగ భీష్ముడింద్ర మతంగ సంవాదమను కథను వచించెను.

ఆ భారత కథవలన సర్వులకును జన్మవల్లనే జాతి యేర్పడుననియు నొకజాతియందుఁ బుట్టినవాడు మఱొకజాతికి మారుట దుస్సాధ్యమనియు తేలుచున్నది. కనుకనే శాస్త్రమిట్లు వచించుచున్నది.

శ్లో॥ సర్వేషాం జన్మనా జాతిః నాన్యథా కర్మకోటిభిః ॥
పశ్వాదీనాం యథా జాతిః జన్మనైవ నచాన్యథా ॥

తా॥ పశ్వాదుల కెట్లు జన్మచేతనే జాతి సిద్ధమైయున్నదియో అటులనే సర్వులకును జన్మచేతనే జాతి యేర్పడునుగాని కోట్లకొలది కర్మలచేతను జాతి మారుట సంభవింపదు.

భారతమునందు శివుడు పార్వతికి వర్ణపరిపాకమును దెలుపుచు నిట్లు బల్కెను.

చం॥ తమతమ కర్మముల్ దెరువుదప్పక జేసినవారు దేవలో
కమున సుఖంబు నొందుదురు క్రమ్మరి వచ్చియు పూర్వజాతి జ
న్మమున మహార్తి బొందుదురు మానిని యిమ్మెయిదప్పి యెట్టి
కృత్యముల జరించి రజ్జనుల కట్టికులంబున బుట్టు వారిలన్॥
(అనుశాసనికం ౫ అ. ౨౧ పద్యం

మఱియును బృహదారణ్యకోపనిషత్తునందు జాతులయొక్క జన్మహేతువులిట్లు వచింపబడినవి.

॥శ్రుతి॥ రమణీయచరణాః రమణీయాం యోనిమాపద్యేరన్ బ్రాహ్మణయో
నింవా క్షత్రియయోనింవా వైశ్య యోనింవా॥
కపూయచరణాః కపూయాం యోనిమాపద్యేరన్ శ్వయోనింవా
సూకరయోనింవా చండాలయోనింవా॥

తా॥ పుణ్యకర్మాచరణులు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య యోనులయందు జనింతురు. పాపకర్మాచరణులు శ్వ సూకర చండాల యోనులయందు జనింతురు.

## ♦ జాతిభేదములు ♦

జాతియనగ పుట్టుకతోడనే జనించియుండిన భావము అని అశబ్దముయొక్క ప్రకృతి ప్రత్యయముల వల్లనే తేటపడుచున్నది. పశుపక్ష్యాదులయందు రూపక్రియాభేదములచే జాత్యవాంతర జాతులెటుల సిద్ధములై యున్నవో మానవులయందును అటులనే జాత్యవాంతర జాతులు జన్మచేతనే సిద్ధములై యున్నవి.

బహువిధ స్వరూప స్వభావ గుణభేదములతో నొప్పియున్న జాత్యవాంతర జాతులలో నేజాతికాజాతియందు మాత్రమే సహవాస సంసర్గములు రెండును చెల్లుచుండును. కొన్ని భిన్నజాతి జంతువులకు పరస్పరము సహవాసముగాని, సంసర్గముగాని యేమాత్రము చెల్లుట

లేదు. కొన్ని జాతులకు సహవాసము మాత్రము చెల్లును సంసర్గము చెల్లుటలేదు. ఇదంతయు లోకానుభవమునం దెలియనగు నంశము.

ఆ సాంప్రదాయమే మానవులయందును గలదు. శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు తమ శారీరక భాష్యమునందిట్లు వచించిరి.

"పశ్వాది భిశ్చావిశేషాత్"

తా॥ పశ్వాదులవలెనే మనుష్యులయందును జాతులు పుట్టుకతోడనే సిద్ధమై చావుతోడనే నశించునవిగా యున్నవి. అని స్పష్టపఱచియున్నాడు.

అట్లు ప్రసిద్ధములైన యొక్కొక్క జాతి కర్మవలన లోకమునం దొక్కొక్క ప్రత్యేక ప్రయోజనమున్నది. జాతికి సాంకర్యము గలిగి చెడిపోయిన యెడల వాని ప్రత్యేక ప్రయోజనముయొక్క పటుత్వమును చెడిపోవును. జాతి భేదములును, వాని ప్రత్యేక గుణకర్మలును మానవులయందేగాక, జడపదార్థములయందును గలిగియున్నది.

గంధకము, అభ్రకము, తాళకము, ఇంగిలీకము, కాంతము వంటి పదార్థములు ఒక్కొక్కటియు వాని సహజగుణముల వలనం బెక్కుజాతులుగ వ్యవహరింపబడుచున్నవి. ఆవిషయము రసార్ణవము నందూచునది.

ఆ విధముగా జడపదార్థములందును ఒక్కొక్కదానియందిట్లు పెక్కు ప్రత్యేక జాతులును, వాటి ప్రత్యేక గుణప్రయోజనములును ప్రసిద్ధములు ప్రత్యక్షములై యుండ మానవులయందిట్టి జాతిభేదములు లేవనుట మూర్ఖప్రలాపములుగాక మతేమగును. ఇట్లు బహువిధ స్వరూప స్వభావగుణ కర్మ జాతిభేదములతో నొప్పియున్న లోకమును జక్కగ గాపాడుచుండునది నియతియేగనుక నియతి ప్రాముఖ్యతను కొంత వివరింతును.

## * నియతి *

జాతులకు సహజమైయుండిన నియతికే నియతి ధర్మమనుపేరు విలసిల్లు చుండినది. నియతిని వీడకున్నంతవఱకే ప్రకృతి యానంద దాయకమగుచున్నది. లోకమునందలి భూతకోటులలో నొక్కొక్క జాతికి నొక్కొక్క ప్రకృతి సహజమై యొప్పుచున్నది. అట్టి ప్రతి ప్రకృతికి నొక్కొక్క కర్మ నియతమైయున్నది. నియమరాహిత్యము పశుత్వమునకు లక్షణముగ నొప్పుచున్నది. కావున నియమమే మానవునియందలి విశేషలక్షణము. మానవ సంఘమునందు నియతి వర్ణాశ్రమ ధర్మరూపమున నలరారుచున్నది. నియతిని వీడిన యెడల ప్రకృతి దుఃఖదాయిని యగుచున్నది.

వేయేల నృత్యగీత తాళ మృదంగాది సర్వ కళలును వానికి శాస్త్రము విధించియున్న నియతిని అవి యెంతవఱకు పాటించుచుం డునో అంతవఱకే లోకమునకవి యానందము నొసంగునవి యగుచు న్నవి. నియతిభంగమే ఆనందభంగమగుచున్నది.

భూతములు తమకు సహజముగ నుండిన నియతికెప్పుడు భంగ ముగ వర్తించునో అపుడు లోకమునందుత్పాతములు సంభవించును. గాన లోక కళ్యాణము నాకాంక్షించు ప్రతి మానవుడును తన జాతికి విధివిహితమై యుండిన నియతధర్మము నాచరించి తీరవలెను. లేకున్న అరిష్టోత్పాతాదులకు కారకుడగుచున్నాడు.

## — ఉత్పాతలక్షణం —

శ్లో॥ యానత్రేరుత్పాతాన్ గర్గః ప్రోవాచతానహం వక్ష్యే ।
తేషాం సంక్షేపోయం ప్రకృతేరన్యత్వముత్పాతః॥
(వారాహసంహిత॥ అధ్యా. ४ౕ శ్లో॥ ౧

అపచారేణ నరాణాం ఉపసర్గః పాపసంచయాద్భవతి ।
సంసూచయంతి దివ్యాంతరిక్షభౌమాస్త దుత్పాతాః॥
(వారాహసంహిత॥ అధ్యా. ४ౕ శ్లో॥ ౨

తా॥ అత్రిమహామునికి గర్గమహర్షి జెప్పిన ఉత్పాత లక్షణము లను జెప్పుచున్నాను. ఉత్పాతమనగ భూతములయొక్క సహజ ప్రకృతికి విరుద్ధమైనది యని సంక్షేపార్థము.

జాతులు తమ సహజ ధర్మములకు విరుద్ధముగ సంచరించిన పాప సమూహములవలన లోకమునకు హానికరములగు ఉత్పాతములు సంభవించును. దివ్యోత్పాతములు, ఆకాశోత్పాతములు, భౌమో త్పాతములు అని ఉత్పాతములు మూడు విధములై యున్నవి.

శ్లో॥ అనిమిత్త భంగచలన స్వేదాశ్రునిపాత జల్పనాదీని ।
లింగార్చాయతనానాం నాశాయ నరేశ దేశానాం ॥
(వారాహసంహిత. అధ్యా. ౪౬ శ్లో. ౫

తా॥ దేవాలయముల యందుండెడి విగ్రహములు, లింగ ములు మొదలగునవి యేదేశమునందు నిష్కారణముగ పగిలిపోయి నను, కదలుచున్నను, చెమటలు గార్చుచున్నను, కండ్లనుండి నీరు గారుచున్నను, మాటలాడుచున్నట్టి ధ్వనులు గల్గియున్నను, ఆదేశ మునకును, ఆరాజునకు నాశము సంభవించును.

శ్లో॥ శశరుధిర నిభేభానౌ నభస్థలస్థే భవంతి సంగ్రామాః ।
శశిసదృశో నృపతివధః క్షిప్రం చాన్యో నృపో భవతి ॥
(వారాహసం. అధ్యా. 3 శ్లో॥ 30

తా॥ సూర్యుడు కుందేటి నెత్తురువలె ఆకాశమందు గన్పడిన యెడల యుద్ధములు గల్గును. చంద్రునివలె గన్పడెనేని ఆ దేశపు రాజును వధింతురు. ఇతరుడు రాజగును. లోకమునందుగల చరా చర భూతములలో నేభూతమెట్టి లక్షణముతో నెట్టి గుణముతో నుండవలయునో అట్లుండక విపరీతముగ నుండినయెడల నది యొక్కొ క్కటియు నొక్కొక్క హాని లోకమునకు గలిగించునదియై యున్నది.

ఈ విధముగా ఆయా వివరములను శాస్త్రములు చక్కగ స్పష్టపరచుచునే యున్నవి. లోకమునందిట్టి అనుభవమును గలుగు చునే యున్నది. మానవులొనర్చెడి విధివిహిత సత్కర్మలే సూర్యాది

గ్రహములకును, ఇంద్రాది దేవతలకును, ఆకాశాది భూతములకును, బలమును, శక్తిని, తేజస్సును, లోకపాలన సామర్థ్యమును గలుగ జేయునవి యగుచున్నవి.

మానవులొనర్చెడి కర్మలయందు వైపరీత్యము లేర్పడిన యెడల ఆ సూర్యాదులయందును, శక్తిహీనతయును, విపరీత లక్షణ ములును దోచుచు అందువలన లోకహాని చేకూరుచుండును. భూలో కమునందలి కర్మ లెటుల సూర్యాదులకు జెందునదియు,అవి లోకము నెట్లు పోషించునదియును వేదమందలి పంచాగ్నివిద్య తెలియజేయుచున్నది.

కాన ప్రతి మానవుడును తనకును, తన కుటుంబమునకు, తన వంశమునకు, తన జాతికిని జన్మసిద్ధమైయుండిన నియతిని అతిపవిత్ర మైనదిగ నెంచి పాలించవలయును.

మఱియును తనజాతి ధర్మమును గాపాడుకొనుటయేగాక ఇతర జాతుల ధర్మరక్షణమునకును చేతనగునంతవఱకును సహాయము చేయవలయును. లోకమునకు అన్నిజాతులయొక్క కర్మలును అత్యా వశ్యకములై యున్నవని పెక్కుచోట్ల వచింపబడియున్నది. ఏ జాతి యందు జన్మించియున్నవాడు ఆ జాతి కర్మ నవలీలగను వేగముగను నాణ్యముగను జేయగలడు. ఆ శక్తి అతని జాతినుండి వంశమునకు వంశమునుండి తల్లిదండ్రులకును సంక్రమించి వారి రక్త వీర్యముల నుండి యతనికి లభించియున్నది. తనజాతి కర్మ యెటువంటిదియై యున్నను దాని నతి పవిత్రమైనదిగ భావించి యితర జాతులనుండి సంకరము గల్గించక తన జాతికి సాంప్రదాయ సిద్ధములై యుండిన ఆహార విహారాదులచేత తనజాతి ధర్మమును గాపాడుచుండవలయును.

విషమునందు జనించియుండిన పురుగునకు విషము దోషకారి గానట్లు తనజాతి కర్మ యెట్టిదైనను తనకు దోషకారి కానేరదు.

శ్లో॥ సహజం కర్మకౌంతేయ సదోషమపి నత్యజేత్ ।
సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ (గీత–౧౮–౪౮

తా॥ ఓయర్జునా! పుట్టుకవల్ల తనకు విధివిహితమై యుండిన కర్మ దోషముగలదియైనను దానిని విడువగూడదు. అగ్ని నెటుల పొగ యావరించియున్నదో అటుల సర్వకర్మలను దోష మావాదించియే యున్నది.

జాతులలో దేనికదియే పవిత్రమైయున్నది. తన జాతికంటె నితరజాతి శ్రేష్ఠమైనదియని భ్రమించి వ్యభిచరింపరాదు. ఏజాతితో వ్యభిచరించినను, వ్యభిచారమువల్ల జాతికి సాంకర్యమేర్పడును. అధర్మమనగ సాంకర్యమేగాని వేఱుగాదు. పూర్వ జన్మమందు తానేదియో యొక జాతియందు జన్మించియుండి మరణ సమయమునందుండిన స్వభావమువలన నిపుడితర జాతియందు జన్మించి యుండుటచేత పూర్వజాతి కర్మవాసనలపుడు ప్రోత్సహించుచుండును. ధీమంతుడు వివేకముతో వానిని నిగ్రహించి ఇపుడుండిన జాతి ధర్మమును కాపాడుకోవలయును.

తానెంత విజ్ఞానియైయుండినను తన తండ్రి తాతలనుండి తనకు సంక్రమించియుండిన కర్మ నిష్కామబుద్ధితో జక్కగ చేయవలయునే గాని తానితరజాతి కర్మలయందు ప్రవేశించి జాతికి సాంకర్యము గలిగింపరాదు. ఇందుకు భారతమునందలి ధర్మవ్యాధుని చరిత్ర మిక్కిలి ప్రమాణమై యొప్పుచున్నది.

* ధర్మవ్యాధుని చరిత్ర *

పూర్వము మిధిలాపట్టణమును జనకమహారాజు పరిపాలించుచుండెను. అ పట్టణమునందు ధర్మవ్యాధుడనెడి కిరాతు డొకడుండెను. అతడు మిక్కిలి ధర్మమూర్తియగు తత్త్వవేత్తయని కౌశికుడనెడి బ్రాహ్మణునకు ఒక పతివ్రత దెలుపగ ఆ కౌశికుడు ధర్మబోధార్థమై మిధిలా పట్టణమునకేతెంచి ధర్మవ్యాధుడుండెడి చోటడిగితెలిసికొని యచ్చటికి బోయెను. అపుడాతడు వీధిలో నొక్కచోట మాంసము నమ్ముచుండెను.

కౌశికుండు మాంసము నమ్ముచుండెడి ధర్మవ్యాధుని గాంచి సమీపమునకుబోవ శంకించి దూరమునందు నిలచి ఆశ్చర్యముతో జూచుచుండెను. ధర్మవ్యాధుడు దూరమునందు నిలచియుండిన కౌశికునిగాంచి తనవద్దకు ధర్మబోధార్థమై అతడు వచ్చిన విధము తన దివ్యబోధముచే నెఱింగి యతని చెంతకుబోయి కుశలమడిగి యథావిధి సత్కారముల నొనర్చి తన యింటికిఁ గొనిపోయి కూర్చుండ నియమించి నమస్కరించి "మహాత్మా మీరు ధర్మబోధార్థమై నాయొద్దకొక పతివ్రత బనుపగ వచ్చితిరిగదా! నే ధన్యుండనైతిని. నాయిల్లు పవిత్రమయ్యె"నని వినయముతోఁ బలుక నా కౌశికుండద్భుతంబంది ధర్మవ్యాధునితో నిట్లు బల్కెను.

"ధర్మమూర్తీ! మీరు సత్యధర్మతత్వవేదులని యొక పతివ్రత వలన నెఱింగి మీవల్ల ధర్మతత్వము నెఱుగగోరి నేను మీ చెంత కేతెంచి యున్నాడ. మీరు నీచాతి నీచమగు మాంసవిక్రయ మొనర్చుచున్నందున హేతువేమియును దోచక చింతిల్లుచున్నాడ" నని బలుకగ నతనితో ధర్మవ్యాధుడిట్లు వల్కెను. "బ్రాహ్మణోత్తమా మాకు మృగమాంసోపజీవనంబు సహజ ధర్మంబై యున్నది. ఇదియు మావంశ క్రమాగతమైన యాచారము. మఱియు నిప్పుడీ దేశమును నిజధర్మతత్పరుడును తత్వవేత్తయునగు జనకమహారాజు పరిపాలించుచున్నాడు. అతడు నిజధర్మములను విడచినవారి నెవ్వరినైనను విడువక దండించుచు ధర్మరక్షణము నొనర్చుచున్నాడు. కనుక నేనును నిజధర్మపరిత్యాగంబు సేయజాలను. హీనయోని సంజాతుడనయ్యును నిర్మలుడనై యున్నాడ"నని కౌశికునకు ధర్మతత్వము నెల్లను బోధించెను.

ఈ కథవలన లోకమునందనేక జాతులును అనేక కర్మంబులును గలవనియు వంశక్రమానుగతమైన కర్మ పరమ ధర్మమనియు సర్వ

జాతులకును జ్ఞానమోక్షములయందధికారము గలదనియు స్పష్టపడు చున్నదిగదా.

లోకమునందలి సర్వజాతులకును ప్రతికూలములగు నితర జాతులయొక్క సహవాస సంసర్గాదులవల్ల సాంకర్యము గలుగనట్లు కాపాడుకొనుటకు తత్వవేత్తలగు మహర్షులు శాస్త్రములయందు మానవులకు పవిత్రములగు నియమములను విధించియున్నారు. అట్లు విధించుటయందు సర్వులకును పవిత్రతయును క్రమశిక్షణయు నొసంగి తద్వారా లోకమునకు శాంత్యభ్యుదయములను జేకూర్చుటయే వారి యాశయమైయుండినది. అట్టి శాస్త్రనియమములలో అస్పృశ్యత యొకభాగమైయున్నది. సాంకర్యము లేనట్లు జాతిని కాపాడుటయందు అస్పృశ్యత వజ్రకవచమువలె నొప్పుచున్నది.

## అస్పృశ్యత

లోకమునం దస్పృశ్యత మహాపరాధముగ నిపుడు పరిగణింప బడుచున్నది. అది కాలవిపరీతము! ప్రతిమానవునియందును ప్రతి పదార్థమునందును మానవుల చర్మచక్షుస్సుల కెంతమాత్రము గోచరింపని స్వభావగుణము తేజోరూపముగ నొప్పుచున్నది.

ప్రతి భూతము విద్యుత్ప్రసారము గలిగియుండిన రాగితంతిని బోలియున్నది. ఒకమనుష్యుని మరియొకమనుష్యుడు తాకినయెడల విద్యుత్తుగల రెండు రాగితంతులు ఒకదానితో నొకటిచేర్చిన విద్యుత్తుగలిగినట్లే వారియందు తేజోరూపముగా నుండిన స్వభావ గుణము పరస్పరము సంక్రమించును. ఇట్టి సాంకర్యము క్రమక్రమముగ వృద్ధియగునెడల సహజ స్వభావగుణము చెడిపోవును. తద్వారా జాతికిని ధర్మమునకును హానిచేకూరును. లోకమునకు జాతిసాంకర్యము మహామారివలె హాని జేయునదిమైయున్నది.

భగవద్గీతయం దర్జునుడు శ్రీకృష్ణునితో నిట్లు బల్కెను.

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః ।
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ గీత-౧-౪౩
ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
నరకే నియతంవాసో భవతీత్యను శుశ్రుమ॥ గీత-౧-౪౪

తా॥ వర్ణసంకరమునకు కారకులగు కులఘ్నులయొక్క దోష ములచేత శాశ్వతములగు కులధర్మములు జాతి ధర్మములును చెఱుప బడుచున్నవి. శ్రీకృష్ణా కులధర్మములను జెఱచిన మనుష్యులకు నరకవాసమే నియతమగునని వినుచున్నాను.

సాధారణముగ నెవ్వడైనను భార్యను కుమారునిదప్ప నితరులె నెంతమాత్రము స్పృశించుట యుక్తముగాదని మహర్షుల తలంపు. కాబట్టి యీ విధముగ ముట్టుటవలన తనజాతికేగాక యితరుల జాతి కిని చెఱుపు గలిగించిన వాడగుచున్నాడు. భార్య తన అర్ధశరీరమేయై యుండుటవలనను కుమారుడు తన ప్రతిబింబమై యుండుటవలనను వారిదాకుట హానికరముగాదు. కన్యను వివాహమాడునపుడు తన స్వభావ గుణమునకు కన్యయొక్క స్వభావ గుణమునకు పరస్పర వైరుధ్యము లేకుండునటుల మహూర్త జాతక సాముద్రిక శాస్త్రాదుల కూటములను చక్కగ విచారించి సమాన గుణలక్షణముగల కన్యను పెండ్లాడ వలయుననిగదా శాస్త్రవిధి.

శ్లో॥ ఉద్వహేత ద్విజోభార్యాం సవర్ణాం లక్షణాన్వితాం॥ మనుస్మృతి॥

తా॥ సమాన వర్ణలక్షణముగల భార్యను వివాహ మాడ వలయును.

ఎవరినైనను విధిగ ముట్టవలసి వచ్చినయెడల తన కుటుంబము వంశము జాతివారిని ముట్టినయెడల నంతగ గుణహాని సంభవింపదు,

శ్లో॥ సంపర్కా జ్జాయతే దోషః పాన్యోన్యోపాస్తి వై ద్విజే ।
తస్మాత్సర్వ ప్రయత్నేన సంపర్కం వర్జయేద్బుధః ॥ (పరాశరస్మృతి

తా॥ ఇతరులను ముట్టుటవల్ల దోషము జనించుచున్నది. వేరు విధమున దోషము సంభవింపదు. గాన సర్వ ప్రయత్నముతో ద్విజుడు సంపర్కమును (ముట్టుటను) వదలవలెను. ద్విజశబ్దము క్షత్రియాది జాతుల కుపలక్షణము. సాంకర్య దోషము కేవల శరీర స్పర్శలవల్ల నేగాక దర్శన సల్లాపాదులవల్లను గలుగుచున్నది.

శ్లో॥ దర్శనాత్స్పర్శనా ద్ధ్యానాత్సల్లాపాత్సహ భోజనాత్ ।
సంక్రమంతిహి పాపాని తైలబిందు రివాంభసి ॥ (పరాశరస్మృతి)

తా॥ చూచుట, ముట్టుట, కలసి తిరుగుట, సంభాషించుట, కలసి భుజించుట వీనివలన నూనె నీటియందు వ్యాపించునట్లు వేగముగ పాపములు సంక్రమించును.

పాపమన్నను, అధర్మమన్నను గుణసంక్రమణమేయని శాస్త్ర హృదయము. ద్రవ్య సంయోగమువల్ల గుణసంయోగ మేర్పడు చుండుట యనుభవ సిద్ధమేగదా! శరీరములు ద్రవ్యములు వాని యంతర్బహిర్భాగములయందు వాని సహజ గుణములు గలిగి యుండును. శరీరాది సంయోగములవలన గుణసంయోగ మేర్పడు ననుటలో సందియములేదు.

వరిబియ్యపు సహవాసము సొరకాయలకు గిట్టకున్నది. పొడపత్రి బెల్లముయొక్క గుణమును తీపును పోగొట్టుచున్నది. వెల్లుల్లి కస్తూరి సుగంధమును పాడుచేయుచున్నది. అగ్ని సామీప్య మాత్రమున 'పెట్రోలు' మండుచున్నది. ఇట్టివెన్నియో గలవు. ఇంకను సాదృశ్యముసకు!

ఆత్మవేత్తలు నతీంద్రియ జ్ఞానసంపన్నులు నగు మహాత్ములు లోకరక్షార్థమై సర్వభూత వస్తుతత్వములను పరిశోధించి వారు శాస్త్రములయందు స్పృశ్యతా విధానములను నిర్ణయించి నియమించి యున్నారు. లోకమును రక్షించి పోషించునది అస్పృశ్యతాశక్తియే! అందు కావంతయును సందియములేదు. లోకమునందలి యరణ్య

ములు, పర్వతములు గుహలు, ఎడారులు, సముద్రములు, నదులు మొదలగు భగవన్నిర్మాణములును గృహములు, పల్లెలు, పట్టణములు మొదలగు మానవ నిర్మాణములును, అస్పృశ్యతా దేవియొక్క శరీరాంగములై యున్నవి. ఇట్టివన్నియును లోకరక్షకేర్పరుపబడినవియై యున్నవి.

లోకమునందిపు డొక్క దేశమైనను మిగులకుండ నన్ని దేశములయందును ప్రళయతాండవ స్వరూపముగ వ్యాపించియుండిన యీ యశాంతి కంతటికిని కారణము దీర్ఘముగ నాలోచించిన యెడల లోకులు అస్పృశ్యతా దేవి నారాధింపక పోవుటయే యని దోపక పోదు.

లోకమునందిపు డెన్నియో రైళ్లు, మోటర్లు, స్టీమర్లు, విమానములు తంతులు, టెలిఫోనులు, రేడియోలు మొదలగునవిప్రబలి యొక దేశమునుండి మరియొక దేశమునకును ఒకఖండమునుండి మరియొక ఖండమునకును రాకపోకలకును దర్శన స్పర్శన సంభాషణాదులకును మిక్కిలి సులభావకాశములు గలిగించుచుండినను అస్పృశ్యతా దేవి అంగములైయుండిన సముద్ర నదీ పర్వతారణ్యాదులను ఛేదించుటవల్లను లోకమునందద్భుతమగు సాంకర్యమేర్పడియున్నది.

అందువల్లనే అతివృష్ట్యనావృష్టి భూకంప దుర్భిక్షారిష్టాదులును చిత్రవిచిత్ర మారీస్ఫోటకాద్యుపద్రవ రోగాదులును అసూయా ద్వేష భయ కలహ యుద్ధాదులను విచిత్రమారణాస్త్ర ప్రయోగాదులును పదింపదిగ వ్యాపించుచున్నవి.

పశుపక్షి మృగాదులును సర్పవృశ్చిక క్రిమికీటాదులు సైతము తమకు నియతములైయుండిన ఆహారభూతములను దక్క నితర భూతముల నెంతమాత్రము బుద్ధిపూర్వకముగా స్పృశింపవనుట గమనించి తెలిసికోదగినది. భగవంతుడు మానవులకు యుక్తకార్యములొనర్చుటకును అయుక్తకార్యములను పరిత్యజించుటకు పశ్వాదుల

కొసంగని స్వాతంత్ర్యము నొసంగియున్నాడు. భగవంతుడు డింబ్రప్రసాదించి యున్న అధికారమును దుర్వినియోగ మొనర్చి మానవులు నియమోల్లంఘనము చేసినయెడల సరిష్టఫలము దప్పదు. ఆఫలము దుఃఖమే.

జాతులెప్పుడు సంకరములగునో కర్మలప్పుడు సంకరములగును. కర్మసాంకర్య మెప్పుడగునో అప్పుడు ప్రజానాశనము సంభవించును.

శ్లో॥ ఉత్సీదేయురిమేలోకాః నకుర్యాం కర్మచేదహం।
సంకరస్యచ కర్తాస్యా ముపహన్యామిమాః ప్రజాః॥ గీత ౩-౨౪

తా॥ "ఓయర్జునా నేను ధర్మరక్షణాకమగు నా కర్మను చేయకపోయినయెడల లోకులు నన్నుజూచి స్వకర్మలను విడతురు. సంకరనమునకు నేను కర్తనగుదును. అందువల్ల లోకములు నశించును. నేను ప్రజానాశనము నొనర్చినవాడనగుదును" అని ధర్మమూర్తియగు భగవానుడు దెలిపియున్నాడు.

జ్ఞానానంద నిలయములగు వేదశాస్త్రములు విచిత్ర శబ్దార్థ భావ గాంభీర్యములతో నొప్పుచు మిక్కిలి దురవగాహములగుటవలన వాని నొకప్పుడైనను స్పృశించియైన నెఱుంగనివారు సైతము వార్తాపత్రికలయందు కలికాల ప్రేరితములగు వార్తోపన్యాసాక్షరములను జదువుకొనినంతనే సర్వజ్ఞులమైతిమనెడి మోహాభినివేశములతో భగవచ్ఛ్వాసములగు వేదశాస్త్రములయందు ప్రతిపాదింపబడియున్న అస్పృశ్యతయు, వర్ణాశ్రమాచారములును ధూర్త బ్రాహ్మణ కల్పిత మోసములనియు లోకమున కిట్టి నియమములు హానికరములనియు వీని నిక నెంతమాత్రమును సహింపరాదనియు నొక్కుమ్మడిన పెక్కుముఖముల వాకొనుచున్నారు. అత్యంత తమోగుణముతో నొప్పిన యిక్కలికాలమున నిట్టిభావము లుదయించుటలో నాశ్చర్యమేమి! కాలచోదితమేగాకయున్నయెడల నిరహంకార సత్య జ్ఞానసంపన్నులు శాస్త్రకర్తలగు మహర్షుల నిట్లధిక్షేపించెడి సాహసముండునా! కొందఱు దలంచుచున్నట్లు, అస్పృశ్యత ధూర్త బ్రాహ్మణ కల్పితమే యైనచో

ఆ శాస్త్రకర్తలగు మహర్షులు అస్పృశ్యతను తమ కుటుంబములయందును, తమ వంశములయందును, తమ సఘంములయందే మిక్కిలి యెక్కువగ నేల విధించుకొనియున్నారు? దేవతాస్వరూపముగ పూజించెడి తమ తల్లులయందును అక్కసెల్లెండ్రయందును అర్ధశరీరములుగ భావించిన తమ భార్యలయందును కొన్ని సమయములయందు మిక్కిలి కఠినతమములగు అస్పృశ్యతనేల యేర్పఱచియున్నారు?

"నమాతుః పరదైవతం"

అని దెల్పిన మహర్షులు అట్టి తల్లి రజోవతియైన యెడల

శ్లో॥ ప్రథమేహని చండాలీ ద్వితీయే బ్రహ్మఘాతకీ।
తృతీయే రజకీప్రోక్తా చతుర్థే శూద్రికాభవేత్॥

తా॥ రజోవతియైన స్త్రీ మొదటిరోజు చండాలిని, రెండవరోజు బ్రహ్మఘ్నీ, మూడవరోజు రజకీ, నాల్గవరోజు శూద్రిక అని చెప్పబడెను. అనెడి శాస్త్రవిధి ననుసరించి తమ తల్లులతోనైనను దర్శన స్పర్శన సంభాషణాదులు చేయనొల్లని మహర్షులకు ధూర్తత్వం చకత్వాదోష మాపాదించుట మాతృహృదయ ముష్టిఘాతమే యగునని యొకరు తెలుపఁబనిలేదు.

మానవులకు స్వభావ సహజ సిద్ధములై యుండిన గుణములు, కొన్ని సమయములయందనివార్యములుగ సంభవించెడి దుఃఖరాగ ద్వేష భయాది నిమిత్తకారణములవల్ల విక్షోభము నొందుచుండును. అట్టివి, సంఘటించిన సమయములందు వారు తమ సంఘమునకు జెందినవారేయైనను, పూజ్యులేయైనను వారిని స్పృశింపగూడదు.

అప్పుడట్లు వారిని స్పృశించిన యెడల ప్రచండముగ గుణసాంకర్య మేర్పడును. కనుకనే శాస్త్రములయందు మహర్షులిట్టి యనేక కారణ భేదములతో ననేక తారతమ్య భేదములుగల జాతాశౌచమృతాశౌచ నిమిత్తాశౌచములను విధించుచున్నారు.

బ్రాహ్మణులు కొందఱిప్పటికిని తమ కుటుంబములయందు నిత్యమెన్నియో విధములగు అస్పృశ్యతలను పాటించుచున్నారు. సాధారణముగ వస్త్రశయనాసన భోజనాదులయందు కుటుంబస్థులతో సైతము నొకటినొకటి స్పృశింపనట్లు వర్తించుచున్నారు. ముఖ్యముగ ననుష్ఠాన దేవపూజాదులయందే ముట్టుటవలని దోషము తమ కెంతమాత్రమును గలుగనట్లు కాచుకొనుచున్నారు.

శాస్త్రములయందు మహర్షులు పీరివారినక జాతి మత కులాచారనియమముల నుల్లఘించి జాతికి సంకరము నొనర్చెడివారి నెవ్వరినైనను కడకు తల్లిదండ్రులనైనను గురువులనైనను పరిగణింపక వారి కస్పృశ్యతను విధించి జాతిరక్షణమునకై బహిష్కారణమును విధించియున్నారు.

కడకు దంతములు, వెండ్రుకలు, గోళ్లు, మొదలగునవి తమ దేహము నంటియున్నంతవరకు మాత్రమే యోగ్యములుగాని, దేహమునుండి విడిపోయినయెడల నవి యస్పృశ్యములే యగుచున్నవని శాస్త్రములు వచించుచున్నవి.

జాతిధర్మము నెవ్వడు పరిత్యజించి యథేచ్ఛగ చరించునో వానికి శాస్త్రము మరణాంతశౌచము విధించుచున్నది.

శ్లో॥ క్రియాహీనస్య మూర్ఖస్య మహారోగిణ ఏవచ ।
యథేష్టాచరణ స్యాహుః మరణాంతమశౌచకం॥ పరాశరస్మృతి॥

తా॥ క్రియాహీనునకు మూర్ఖునకు పెద్దరోగము గలవానికి శాస్త్రనియమమునకు కట్టుబడక స్వేచ్ఛగ జరించువానికి మరణపర్యంతము అశౌచముండును.

ఎవ్వడు స్వకర్మను విడచి పరకర్మలయందు యథేచ్ఛముగ వర్తించునో వాడు పతితుడగుననియు; అట్టివాడు ప్రాయశ్చిత్తము నొనర్చుకొనుట కిష్టపడనియెడల అట్టి పతితునితో కలసి శయనాసన భోజన సల్లాపాది సంసర్గము లెంతమాత్రమును జేయరాదనియు అట్టి పతి

తుడు బ్రతికియుండగనే వానికి వాని జ్ఞాతులు ఘటస్ఫోటమనెడి కర్మను జేయవలెనని శాస్త్రములు సర్వులకు భేదమేమియును జూపక యాజ్ఞాపించుచున్నవి.

శ్లో॥ విహితస్యాననుష్ఠానా న్నిషిద్ధస్యచ సేవనాత్ ।
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతన మృచ్ఛతి ॥
(యాజ్ఞవల్క్య స్మృతి

తా॥ విధివిహిత కర్మలను చేయక పోవుటచే నిషిద్ధ కర్మలను జేయుటచే ఇంద్రియముల నిగ్రహింపక పోవుటచేత మానవుడు పతనమొందును.

శ్లో॥ అకుర్వన్ విహితం కర్మ నిందితంచ సమాచరన్ ।
ప్రసక్తశ్చేంద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః ॥ (మనుస్మృతి

తా॥ విహితములగు కర్మలనుచేయక నిందితములగు కర్మలను చేయుచు విషయ భోగమునందాసక్తి నొందువాడు ప్రాయశ్చిత్తార్హుడగుచున్నాడు,

శ్లో॥ సంసర్గ మాచరేద్విప్రః పతితాది ష్వకామతః !
పంచాహంవా దశాహంవా ద్వాదశాహ మథాపివా ।
మాసార్థం మాసమేకంవా మాసద్వయ మథాపివా । -
అబ్దార్థ మబ్దమేకంవా తదూర్ధ్వంచైవ తత్సమః॥ (పరాశరస్మృతి

( అత్ర విప్రశబ్దం క్షత్రియాదే రుప లక్షణం )

తా॥ పతితులు మొదలగువారితో బుద్ధిపూర్వకముగ,గాక పోయినను ఏకారణముచేనైన ఐదు, పది, పండ్రెండు, పదునైదు రోజులుగాని రెండునెలలు ఆరునెలలు సంవత్సరముగాని సంసర్గ మొనరించినవాడు ఆయాకాల పరిమాణములకు చెప్పబడిన ప్రాయశ్చిత్తములను చేసికొనక పోయినయెడల వారితో సమానుడగును. ఇందు విప్రశబ్దము క్షత్రియాది జాతులకు విధియగును. పైన దెలిపిన కాల పరిమాణములకు తగిన ప్రాయశ్చిత్తములు నందు విధింపబడియున్నవి. గమనింపుడు.

శ్లో॥ యోయేన పతితేనైషాం సంసర్గం యాతి మానవః ।
సతస్యైవ వ్రతం కుర్యాత్ తత్సంసర్గ విశుద్ధయే ॥ (మనుస్మృతి

తా॥ ఎవడు పతితునితో సంసర్గము గలిగియున్నాడో, వాడా దోషనివృత్తికి ప్రాయశ్చిత్తమును జేసికొనవలెను.

శ్లో॥ సంవత్సరేణ పతతి పతితేన సమాచరన్ ।
యానాసనాశనైర్నిత్య మిత్యాహుర్బ్రహ్మవాదినః ॥ (కణ్వోక్తి

తా॥ ఎవ్వడు పతితునితో జేరి నడచుట కూర్చుండుట భుజించుట యనునవొక సంవత్సరకాల మొనర్చునో వాడు పతితుడగునని బ్రహ్మవాదులందురు.

శ్లో॥ సంవత్సరేణపతతి పతితేన సమాచరన్ ।
యాజనాధ్యాపనాద్యైస్తు సద్యోన్నశయనాదిభిః॥ (బోధాయనోక్తి

తా॥ పతితునితోడ సంవత్సరకాలము యజన యాజనాధ్యయనాధ్యాపకదాన ప్రతిగ్రహాది కర్మలను జేయునో వాడు పతితుడగును. పతితునితోడ భోజన శయనాదులొనర్చిన యెడల వాడును వెంటనే పతితుడగును.

శ్లో॥ ఏకశయ్యాసనం పంక్తిర్భాండం పంక్త్యన్న మిశ్రణం ।
యాజనాధ్యాపనే యోనిస్తథాచ సహభోజనం ।
నవధాసంకరః ప్రోక్తః నకర్తవ్యోధమైస్సహ ॥

తా॥ పతితులతోడ నొక శయ్యపై బరుండుట యొక యాసనమునందు గూర్చుండుట ఒక పంక్తిలో నొక భాండమునందలి అన్నపానములు స్వీకరించుట ఒక పంక్తిలో నొక వడ్డనలో భుజించుట కర్మలు జేయించుట వేదములు జెప్పుట వివాహాదు లొనర్చుట ఒక పాత్రయందే వారితో కలసి భుజించుట అను తొమ్మిది విధముల సంకరము లేర్పడును. గాన పై సంబంధములు మానుకొనవలెను.

వాక్యం॥ ప్రాయశ్చిత్తానిచ్ఛోః పతితస్య ఘటస్ఫోటో యథా॥

తా॥ ప్రాయశ్చిత్తమును జేసికొనుట కిష్టపడని పతితుని ఘటస్ఫోటవిధి యెట్లనిన—

శ్లో॥ పతితస్యోదకం కార్యం సపిండైర్బాంధవైస్సహ ।
నిందితేహని సాయాహ్నే జాత్యృత్విగ్గురు సన్నిధౌ ।
దాసీఘటమపాం పూర్ణం పర్యస్యేత్ప్రేత వత్తదా ।
అహోరాత్రము పాసీరణ్ అశౌచం బాంధవైస్సహ ॥
(నిర్ణయసింధువు

తా॥ పతితునకు కర్మచేయుట కధికారముగలవాడు రిక్తాది నింద్యతిథులయందు సాయంకాలమునందు సపిండులతో బంధువులతో చేరి జ్ఞాతిఋత్విక్కుల సన్నిధిలో నుదకకార్యము చేయవలయును.

ఒక దాసిచేత నమేధ్యజలపూరితమగు కుండను దెప్పించి అందలు నాదాసిని ముట్టుచు ఆకుండ బోరగిలబడునట్లుల ఆ దాసి యొక్క యెడమకాలితో దన్నించి జందెముల నపసవ్యముజేసికొని ఆపతితునిపేరు జెప్పుచు శిఖలు విడచి 'వీనిని అనుదకుని జేయు చున్నాను' అని యనవలెను. జ్ఞాతులతోగలసి యొకదినమంతయు నశౌచముండవలయును. పిదప ఆపతితునకు దాహముదప్ప తక్కిన అంత్యకర్మ జేయవలయును.

శ్లో॥ నివర్తేరంస్తత స్తతస్తస్మాత్సంభాషణ సహాసనైః ॥

తా॥ అప్పటినుండి యాపతితునితోచేరి కూర్చుండుట సంభాషించుట మొదలగునవి మానవలెను. సంసర్గదోషము మిక్కిలి మిక్కిలి క్రూరమైనది. కనుకనే శాస్త్రములు కూరిరముగ నిట్లు నిషేదించినవి.

ఈఅంటుమురోగముయొక్క చెడుగు సర్పవిషమువలె అగ్ని స్పర్శవలె సద్యః ప్రత్యక్షమగునది గాకపోవుటవల్ల సామాన్యులు గుర్తిం చుట కష్టమైనది. ప్రతిమానవుడును సాధ్యమగునంతవఱకున అంటుడు రోగమునకు తావొసంగగూడదు. లోకరక్షణమునకు ముఖ్యబాధ్యత వహించవలసినవారీ సంసర్గదోషము నెంతమాత్రము తమ దరికి

జేరనీయరాదు. కనుకనే తొల్లి బ్రాహ్మణులు స్వజాతితో అగ్రహారములయందు ప్రత్యేకనివాసము లేర్పఱచుకొని యుండిరి. అపుడు లోకులకు వారస్పృశ్యులో లోకులు వారి కస్పృశ్యులో యెవ్వరనుకొనియుండ లేదు.

గ్రామ పట్టణాదులలో సైతము ఒక్కొక్కజాతి వారొక్కొక్క వీధియందు స్వజాతితో కూడిన ప్రత్యేకనివాసము లేర్పఱచుకొని సాధ్యమైనంతవఱకు తమజాతికి నితరజాతులయొక్క విశేషదర్శన స్పర్శనాది సంసర్గములు లేనట్లు జూచుకొనుచుండిరి. ప్రత్యేక నివాసము లందరకు నానందదాయకము లైయుండెను. అందువలన సర్వజాతులు నస్పృశ్యతను అతిపవిత్రమైన కులదేవతగ భావించి పూజించుచుండినట్లగ పడదా! శాస్త్రములెవ్వరి యందెట్టి పక్షపాత మోసములును జేసియుండ లేదని తెలియజాలరా!

శాస్త్రకర్తలగు మహర్షులు ముఖ్యముగ బ్రాహ్మణజాతికి జెందినవారే యైనను వారితరులనోటమన్నుగొట్టి తాము పాము కొనిన దేమియును లేదు శాస్త్రములయందు ముఖ్యముగ బ్రాహ్మణ జాతికి మిక్కిలి కఠిన నియమములనువిధించిరి. సమస్తభోగైశ్వర్యములును లోకులకే యొసంగి వారిపాపములను గ్రహించుచు శరీరమును తపింప జేసెడి తపోనిష్ఠలను బ్రాహ్మణుల కొసంగియున్నారు.

శ్లో॥ బ్రాహ్మణస్యచ దేహోయం క్షుద్రకామాయ నేష్యతే ।
కృచ్ఛ్రాయ తపసేచేహ ప్రేత్యానంత సుఖాయచ॥

తా॥ బ్రాహ్మణదేహము నీచమగు కామసుఖముల ననుభవించుటకై జనించియుండలేదు. ఈజన్మమందు మిక్కిలి కఠినమగు తపస్సుజేయుటకును చచ్చినవెనుక అనంతసుఖమునందుటకు నది జనించియున్నది.

శ్లో॥ అమేధ్యానిచ సర్వాణి ప్రక్షిపేచ్ఛ యథాగ్నిషు ।
తద్వైకిల్బిషం సర్వం ప్రక్షిపేచ్చ ద్విజోత్తమే ॥ పరాశరస్మృతి

తా॥ పారుచుండెడి నద్యుదకమందు లోకులు సర్వామేధ్యముల నెట్లు ద్రోయుదురో ఉత్తముడగు బ్రాహ్మణునియం దట్లు సర్వపాపముల నుంచవలెను.

బ్రాహ్మణులు అచంచలానందస్వరూపమగు బ్రహ్మత్వ సిద్ధి నందుటకు అస్పృశ్యత నారాధించుచు పర్వతారణ్య గుహాదులయందే కాంతముగ వసించి యచట లోకులయొక్క దర్శన స్పర్శన సల్లాప సంభాషణాదులవల్ల గలిగెడి చెడుగును తొలగించుకొని ఆయస్పృశ్యతా శక్తియొక్క యనుగ్రహమువల్లనే వారు కృతార్థులై పిదప లోక రక్షార్థమై లోకమునందు జరించి తమ జ్ఞానాగ్నిచే లోకులపాపములను పోగొట్టుచు లోకసేవ జేయుటయే పరమాదర్శముగ నేర్పఱచుకొని యుండిరి.

సర్వభూత సమత్వమే బ్రాహ్మణత్వమని వారు శాస్త్రముల యందు వచించుటయేగాక తామాచరించి నిరూపించుచుండిరి. తమ వలెనే లోకమానంద సిద్ధి నొందుటకు వర్ణాశ్రమ విధులను అస్పృశ్యతా మహిమ నెంతయో బోధించిరి. అస్పృశ్యత యనగ నితరుల శరీరములను స్పృశింపకుండుట మాత్రమేగాదు. ఒకరి వృత్తిని మఱియొకరెంతమాత్రమును స్పృశింపకుండుటయు నగును. అది పరస్పర దేశములకు కలహ యుద్ధాదులకు సర్వానర్థములకును కారణమై లోకహాని జేయగలదని వారెఱుంగుదురు.

స్పృశ్యత అనగ కూడుట లేక చేరుట కలియుటయని శబ్దార్థము. ఇది యెనిమిది విధముల నొప్పుచున్నది.

శ్లో॥ స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం ।
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియా నిర్వృత్తిరేవ చ ।
ఏతన్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః ॥

తా॥ స్మరించుట, కీర్తించుట, ఆడుకొనుట, చూచుట, రహస్య సంభాషణము లొనర్చుట, సంకల్పించుట, సంకల్పమునందు తదేక

నిష్ఠుడగుట, శరీరములు గలియుట; ఇట్లు సంపర్క మెనిమిది విధ ములై యున్నది.

ప్రతి మానవునకు ప్రతి జాతికి నెట్లు సహజమగు స్వభావ గుణము గలదో అటులనే ప్రతి దేశమునకు ప్రతి ఖండమునకు దాని నైసర్గిక శీతోష్ణాది పరిస్థితులనుబట్టి యొక్కొక ప్రత్యేక స్వభావ గుణము సహజమైయున్నది, ఏ జాతియందు జనించియున్నవానికి ఆజాతి కర్మలెట్లు విధివిహితములై యున్నవియో జాతికి గుణసాంక ర్యము లేకుండ కాపాడుకొనుట యెట్లు పవిత్ర ధర్మమో అ దేశము నకు ఆ ఖండమునకు సహజములై యున్న మతాచార సాంప్రదాయ ములును కర్మలును ఆహార విహారాదులును ఆయా దేశ ఖండముల యందున్న వారికి అవశ్యానుష్ఠేయములగుచున్నవి. ఇతర ఖండముల యొక్క సాంకర్యము గలుగనట్లు కాపాడుకొనుట పవిత్ర ధర్మమగు చున్నది.

శ్లో॥ యస్మిన్ దేశే యఆచారః న్యాయదృష్టస్తు కల్పితః ।
సతస్మిన్నేవ కర్తవ్యః దేశాచారస్మృతో భృగోః ॥ (దేవలోక్తి)
యస్మిన్ దేశేపురేగ్రామే త్రైవిధ్యే నగరేపివా ।
యోయత్ర విహితోధర్మ స్తంధర్మం నవిచాలయేత్ ॥

(పరాశరస్మృతి)

తా॥ ఏ దేశమునందేయాచారము సాంప్రదాయముగ కల్పింపబడియున్నదో అ యాచారము ఆ దేశమునందే ఆచరించ వలయును. ఏ దేశము ఏ పురము ఏ గ్రామము త్రివిధమగు యేనగ రమునందైనను ఎచ్చట ఏ ధర్మము విహితమైయున్నదో అచ్చటి ఆ ధర్మము నుల్లంఘింపరాదు.

మఱియును వైద్య విద్వాంసుడగు చరకాచార్యుడిటు నుడివి యున్నాడు.

శ్లో॥ యస్మిన్ దేశేతుయోజాతః
తస్య తజ్జం హితం స్మృతం॥

తా॥ ఏ దేశమునందు జనించియున్న వానికి ఆ దేశమునందు గల ఆహార విహారాదికమగు స్వధర్మము హితమైనది.

ఏ దేశ జాతుల కెయ్యవి విహితాచార కర్మలో వాని కితర దేశ జాతి సాంకర్యములు లేకయుండిన యెడల వారికి ఆనందము తృప్తియు స్థిరముగ నుండును. పరస్పర సంఘర్షణములకుగాని అసూయా ద్వేష యుద్ధాదులకుగాని యెంతమాత్ర మవకాశముండదు.

లోకమునందలి సర్వదేశ ఖండ జాతులకు పరస్పరము సల్లాప సందర్శనాది స్పృశ్యత లెంత సన్నిహితము లగుచుండునో దుఃఖము లంతగ వ్యాపించుచుండును.

శ్లో॥ సల్లాపస్పర్శ నిశ్వాసాత్ సహశయ్యా సహాసనాశనాత్ ।
యాజనాధ్యాప నాద్యానాత్ పాపం సంక్రమతే నృణాం ॥
(దేవలోక్తి)

తా॥ సల్లాపమువల్లను సంస్పర్శవల్లను నిశ్వాస వాయువువల్లను కలసి పరుండుట కూర్చుండుట భుజించుటవలనను కర్మలు చేయించుట చదువుచెప్పుట కలసి తిరుగుట అను వీనివలనను మానవులకు పాపములు సంక్రమించును. పాపమనగ దుఃఖమును గలిగించునది యని అర్థము.

ఏజాతి మానవునకైనను సుఖానందముల నొసంగునది అస్పృశ్యతయే. అస్పృశ్యతవలననే ధర్మార్థ కామమోక్షములు సిద్ధింపవలసియున్నది. అగ్రహారములయందు బ్రాహ్మణు లితర జాతులనుండి అస్పృశ్యులుగ నుండినంతవఱకును వారికేలోటును సంభవించి యుండలేదు. ఇపుడస్పృశ్యత నీచమను విపరీతభావ మేర్పడి యున్నది. పైత్యరోగము సంభవించినపుడు కండ్లకు

తెల్లని వస్తువే పచ్చగ గనుపడునట్లు నేడత్యంత తమోగుణ భూయిష్టమగు కలికాలమగుటవలన జాతులకు పవిత్ర ధర్మముగ వేదశాస్త్రములచే జెప్పబడియున్న లోక కల్యాణము నొసంగెడి అస్పృశ్యత లోక నాశమొనర్చెడి మహామారివలె దోచుచున్నది.

శ్లో॥ అధర్మం ధర్మమితియా మన్యతే తమసావృతా ।
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సాపార్థ తామసీ॥ (గీత-అ-౧౮-౩౨)

తా॥ ఓయర్జునా! అధర్మమును ధర్మమనియును సర్వ సత్య ప్రమాణార్థములను అసత్య ప్రమాణార్థములుగనే బుద్ధి అజ్ఞానముచే గప్పబడి దలచుచున్నదో యది తమోగుణాత్మకమైనదిగా నెఱుంగుము

వేదశాస్త్రములయందే కార్యముల ధర్మములని స్పష్టముగ నిరూపింపబడియున్నవో యేవి పరమధర్మములుగ జెప్పబడియున్నవో వాని కన్నిటికి నిపుడు విపరీతభావము లేర్పడియున్నవి. వాని నొక్కొక్కటియు నేడెత్తిచూపుటకు మహాభారతమంత గ్రంథము గావలసివచ్చును.

ఎప్పుడెప్పుడు కలి విజృంభించునో అప్పుడప్పుడు వేద ధర్మములకు హానియు, బౌద్ధధర్మముల కభివృద్ధియు గలుగుచుండునని శాస్త్ర గ్రంథములు చెప్పను. అష్టాదశ మహాపురాణములలో నొకటియగు అగ్నిపురాణమునందు పదునారవ అధ్యాయములో బుద్ధావతారతత్వ మిట్లభివర్ణింప బడియున్నది.

అగ్నిరువాచ

శ్లో॥ వక్ష్యేబుద్ధావతారంచ పఠతశ్శృణ్వతోర్థదం।
పురాదేవాసురాయుద్ధే దైత్యైర్దేవా పరాజితాః ॥ ౧॥
రక్షరక్షేతి శరణం వదంతో జగ్మురీశ్వరం ।
మాయామోహస్వరూపోసౌ శుద్ధోదన సుతోభవత్ ॥ ౨॥
మోహమాయా సద్దైత్యాంస్తాన్, త్యాజితా వేద ధర్మకం ।
తేచబౌద్ధాబభూవుర్హి తేభ్యోన్యే వేద వర్జితాః ॥ ౩॥

అగ్నాత స్తోభవత్యశ్చా దార్హా శానకరో త్వరాఙ్ ।
ఏవం పాషండినోజాతాః వేదధర్మాది వర్జితాః ॥ ४॥
నరకార్హాం కర్మచక్రుః గ్రహిష్యంత్యధమాదపి ।
సర్వేకలియుగాంతేతు భవిష్యంతిచ సంకరాః ॥ ५॥
ధర్మకంచుక సంవీతాః అధర్మ రుచయస్తథా ।
మానుషాన్ భక్షయిష్యంతి మ్లేచ్ఛాపార్థివ రూపిణః ॥ ६॥

తా॥ అగ్నియిటులబల్కెను. చదువుటవల్ల వినుటవల్లను, తెలివి నొసంగెడి బుద్ధావతార విధమును జెప్పుచున్నాను. పూర్వము దేవాసురయుద్ధమందు రాక్షసులచేత దేవతలోడిపోయి రక్షింపుము రక్షింపుమని యీశ్వరుని శరణమునొందిరి. అపుడాయీశ్వరుడు దేవతలను రక్షింపదలచి మాయామోహస్వరూపుడై శుద్ధోదనునకు కుమారుడై బుద్ధుడుగ జనించెను. పిదప నా రాక్షసుల నందఱను వేదధర్మములను విడచునట్లు బోధించి వారిని సమ్మోహపఱచెను. అట్లు వేదధర్మములను విడచినవారు బౌద్ధులైరి. ఆ బౌద్ధులవలన నితరులును వేదధర్మ వర్జితులైరి.

పిదప నా భగవంతు డర్హతుడుగ జనించి మఱికొందఱ నార్హతులుగ జేసెను. ఈ విధముగ వేదశాస్త్ర ధర్మవర్జితులగు పాషండులు గలిగిరి. వారందరును కలియుగాంతమందు సంకరులయ్యెదరు. అధములవలనను విషయములు పరిగ్రహింతురు. పాపకర్మలను జేయుదురు. అట్లు అధర్మపరులగు మ్లేచ్ఛులు రాజ్యాధికారములు గలవారై లోకులను వంచించుటకు మాత్రమే ధర్మములు బలుకుచు ధర్మవేషములను ధరించి మనుష్యులను అన్నివిధముల భక్షింపగలరు. (చెడఁగొట్టఁగలరు).

లోకమునందిపు డపరబుద్ధావతారముగ భావింపబడుచుండిన గాంధీమహాలమున నిప్పుడెంతయో ప్రచారము జరిగియుండిన యీకాలములో నస్పృశ్యతయు వర్ణాశ్రమ ధర్మములును పవిత్రనియమములని యెవ్వడు బలుకునో వానిని లోకము వెఱ్ఱివానినిగ భావించి వదలు

టయో దూషణ తిరస్కారాదులచేత జుగుప్సయొనర్చుటయో చేయకపోదు.

లోకమంగీకరింపనీ, తిరస్కరింపనీ, మరేమైననగానీ నేను సత్యముగ భావించియుండిన ధర్మమును దెలుపుట నావిధి.

లోకమునం దధర్మములుగ గనుపట్టుచున్నను ధర్మములై యుండెడి కార్యములు కొన్నియును, ధర్మములుగ గనుపట్టుచున్నను అధర్మములై యుండు కార్యములు కొన్నియును గలవు. ధర్మమును నిర్ణయించుట మానవుల బుద్ధికి అతీతమగు విషయము. అది తర్కమూలములగు హేతువాదముల కందనిదై యున్నది.

ఏ ధర్మమందలి సత్యమైనను ఆత్మయందు చూడగలిగినవారికి గోచరించును.

కం॥ వినదగు నెవ్వరుసెప్పిన। వినినంతనె వేగపడక వివరింపదగున్।
కని కల్లనిజము దెలిసిన। మనుజుడె పోనీతిపరుడు మహిలో సుమతీ.

అని సుమతి శతకకారుడును వచించియున్నాడు. లోకమునందిపుడంతటను శుష్కహేతువాదములును, అధర్మాచరణంబులును ప్రబలియున్నవి. ప్రబలుచున్నవికూడ! వీని కన్నిటికిని హేతువు కాలమైయున్నది.

ఈ యధర్మము నిప్పుడింతలో నెవ్వరు నాపజాలరు. పండితులు సైతము దీని నిప్పుడారాధించుచున్నారు. వేనేల ప్రభుత్వమే దీని నిపుడు పూజించుచున్నది. కాన నేనిప్పు డస్పృశ్యత విషయమున నిటు బలుకుట తప్పుగా లోకము భావింపవచ్చును. లోకమున కిప్పుడ ప్రియమైనదిగ దోచినను ఇది హితమైనదియని లాభకరమని నాభావము-గనుక చెప్పితిని.

శ్లో॥ పురుషా బహవో రాజన్ సతతం ప్రియవాదినః।
అప్రియస్యతు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః॥ (భారతము

తా॥ తమకు ధర్మములుగ నున్నను లేకున్నను ఇతరులను తృప్తిపరచుటకై యెప్పుడును స్తోత్రములు సేయువారు లోకమునందు బహుజనులు గలరు. అప్రియమైనదియైనను పథ్యమగు విషయమును ఖండితముగ జెప్పువాడును, చెప్పిన వినువాడును దుర్లభులు.

మానవుడు కర్మచేయక యుండజాలడు. శాస్త్రీయమును లోకహితమునగు కర్మచేయుట మానవునకు విధియైయున్నది. ఫలమీశ్వరాయత్తము గదా!

* దైవ పౌరుష స్వాతంత్ర్యములు *

భగవదంశమే మానవుడు. భగవంతునకు మానవునకు పితృ పుత్రన్యాయము వర్తించుచుండును. భగవంతుడగు తండ్రి, మానవుడగు కుమారునకు కుటుంబ పోషణార్థమై గృహారామక్షేత్రాదుల నొసంగి వానిని చక్కగ పాలించుచుండుమని కొంత యాజమాన్య మొసంగియున్నాడు. తండ్రి యొసంగిన మితాధికారమును కుమారుడు దుర్వినియోగ మొనర్చినయెడల దండించు స్వాతంత్ర్యము తండ్రికిగలదుగదా! మానవుడు దైవభక్తిగలిగి దైవము తనకొసంగిన సదసద్వివేకమనెడి పౌరుష శక్తిచేత దైవశాసన రూపమగు శాస్త్రీయ విధిని జక్కగ నొనర్చుచు యథోక్తకారిత్వమువలన దైవానుగ్రహమును బొందుచు క్రమక్రమముగ నున్న అధికారములను పూర్ణ స్వాతంత్ర్యమును సంపాదింపవలయును. అట్టి మానవుడు స్వధర్మము దోషమైనదియని ద్వేషింపడు. మేలైనదియని పరధర్మమునందనురక్తి జెందడు.

శ్లో॥ నద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్యతే॥ (గీత

తా॥ కర్మ మంచిదికాదని ద్వేషింపడు. మంచిదని అనురక్తి నొందడు.

♦ బాధ్యత అధికారము ♦

ఈ రెండును శబ్దార్థమువలె జంటగకూడియుండునేగాని,

రొకదానిని విడచి మఱియొకటి యుండజాలదు. బాధ్యతతోకూడి అధికారముండునేగాని బాధ్యతలేకుండ నధికారముండజాలదు. లోకమునందధికార పదవిని గోరుమానవుడు తానెంతటి యధికారమును గోరునో అంతటి బాధ్యతనుగూడ వహించవలయును. తానెంతటి బాధ్యతను వహించుచుండునో అంతటియధికారము దానంత నదియే చేకూరుచుండును. బాధ్యతను గోరక యధికారమును మాత్రము గోరువాడు మూర్ఖుడుగను అవివేకిగను పరిగణింపబడును.

ఎవ్వడు కుటుంబముయొక్క రక్షణపోషణాది సర్వబాధ్యతలను వహించి కుటుంబస్థుల మేలుకొఱకే తన శక్తినంతయు వినియోగించు చుండునో వానికి ఆ కుంటుబమునందు పెద్దతనము అధికారము గల్గి యుండును. కుటుంబముయొక్క రక్షణపోషణాది బాధ్యతలనే మాత్రము వహింపక తన సౌఖ్యమును మాత్రమే జూచుకొనుచుండు వానికి కుటుంబమునందెట్టి పెత్తనముగాని గౌరవముగాని యుండనేరదు ఎవ్వడు తనకుటుంబమును వలెనే తనవంశమునంతయును జూచు చుండునో వాడు వంశాధికారియగును.

ఎవ్వడు తనవంశమునేగాక తనజాతినంతయును తనకుంటుబము గనే జూచుచుండునో వాడు జాతినాయకుడగును లోకమునంతయును తన కుటుంబముగనే జూచువాడు లోకనాయకుడగును. అట్టివాడు సర్వమునకు తానే ప్రభువగును. కాళిదాసకవి దిలీపమహారాజు సద్గుణముల నిట్లభి వర్ణించెను.

శ్లో॥ ప్రజానాం వినయాధానా ద్రక్షణాద్భరణాదపి ।
సపితా పితరస్తాసాం। కేవలం జన్మహేతవః ॥ రఘువంశము॥

తా॥ దిలీపమహారాజు ప్రజలకు నీతిగఱపుటవలనను రక్షించుట వలనను పోషించుటవలనను ఆ ప్రజల కందఱికిని తండ్రియయ్యెను. వారిని గనిన తండ్రులు కేవలము జన్మనుమాత్రమే కారణభూతులైరి. అధికారమొకరిచ్చునది యెంతమాత్రమునుగాదు. తాను సత్యముగ

నెంత యనురాగబాధ్యతలు లోకమునందు గలిగియుండునో అంతటి నాయకత్వము వానికి తనంత జేకూరుచుండును.

## రాజు ప్రజలు

ప్రజలకును రాజునకుగల సంబంధము భార్యకును భర్తకును గల సంబంధము వంటిదైయున్నది. వీరిద్దరును పరస్పరాను రాగములతో వర్తిల్లుచుండవలయును.

అటులనుండినచో నుభయులకును సుఖానందములు గలుగు చుండును. అటులగాక వీరిలో నభిప్రాయభేదము లేర్పడినపుడు స్వతంత్రమగు పూర్ణాధికారము రాజునకు గలదా అనెడి విచికిత్స యేర్పడినపుడు సర్వాధికారము రాజునకు గల్గియుండుటయే శాస్త్రవిహితమైయున్నది. గృహస్థధర్మమునందు స్వాతంత్ర్యము భర్తకే గలదు గాని, భార్యకు గలదనుట విరుద్ధము.

భార్య క్షేత్రము. భర్త క్షేత్రజ్ఞుడు. దేహముపై నాత్మకధికారము గలదుగాని ఆత్మపైన దేహమునకు అధికారము గలదనుట సత్య విరుద్ధము. భర్తనుప్రేమించి సేవించుట భార్యకును, భార్యనుప్రేమించి పోషించుట భర్తకును ధర్మమైయున్నది. భర్తనుప్రేమించి భార్య సేవించుచున్నందున గృహకృత్యములయందు భర్త సర్వస్వాతంత్ర్య ములు భార్యకేయొసంగి భార్యయిష్టానుసారము భర్త వర్తించు చుండును. భార్యకులభించియున్న యీ స్వాతంత్ర్యము భర్త కలుగ జేసినదియేగాని నిజమైనదిగాదు. భర్తకు హితముగ భార్యవర్తించు చున్నంతవఱకు మాత్రమే యది చెల్లుచుండును.

ఇదేవిధముగ ప్రజలకును ప్రభువునకు నిట్టిధర్మములే యొప్పు చుండును. కనుకనే రాజునకు ప్రజాపతియనెడి పేరొప్పుచున్నది.

## ప్రజాప్రభుత్వ సిద్ధాంతము

ఇపుడు వర్తించుచుండిన ప్రభుత్వమును ప్రజాప్రభుత్వమను

చున్నారు. ఈ ప్రజాప్రభుత్వ శబ్దమునకు అర్థము వష్ఠీతత్పురుషగ 'ప్రజలయొక్క ప్రభుత్వము' అని నిర్వచించుచున్నారు. ప్రజలయొక్క యిష్టముపైననే ప్రభువును ప్రభుత్వము నడచితీరవలె ననుట దీని తాత్పర్యము. ఇది భార్యజెప్పునటులనే విధిగ భర్తయు గృహకృత్య మును నడచితీఅవలె నన్నట్లున్నది! దీనియందు అధికప్రజలయొక్క సమ్మతియే ప్రభుత్వాధికారిని నియమించును. ప్రజలనగ వారికి మానవత్వమున్నను లేకున్నను వయస్సువచ్చియుండిన కరచరణాద్య వయవములుగల మానవబింబస్వరూపులందఱునని నిర్వచింపబడి యున్నది. వీరి యిష్టమే ప్రభుత్వమును నడపవలసినది. ఈనిర్ణయములు తేలుటకు నెన్నియో కార్యకలాపములు జరుగవలసియున్నవి. నిరుపయోగవ్యయము నెంతయో భరింపవలసియున్నది. నిజముగ నిది కలిప్రేరితము. ఇది సత్యధర్మ విరుద్ధమునగు అపసవ్యసిద్ధాంతమై యున్నది. ప్రజలందఱియందు నిపుడు అధికారవ్యామోహము మిన్ను ముట్టిపోయినది. ఇంకను వృద్ధియగుచున్నది. ఇందువల్ల ప్రజలు భయభక్తులు యుక్తాయుక్తములును లేక ప్రవర్తించుచున్నారు. సమ్మెలు విధ్వంసనములును జేయుచున్నారు.

క్షణక్షణము నిప్పుడు ప్రభుత్వమును ప్రజలు భయపెట్టు చుండుటయును, ప్రభుత్వము భయశంకితమగుచుండుటయు, తటస్థించు చున్నది. ఇందువలన నూరూర లేని కక్షలు, అన్యాయాద్వేషములు భయవిషాద సంఘటన లెన్నియో సంభవించుచున్నవి. ఇట్టి ప్రజలచే వరింపబడెడి వారన్ననో ఉత్తమశ్రేణికి జెందిన పండితులేవ్వైయుండుట మిక్కిలి యరుదు. ఒకవేళ క్వాచిత్కముగ నట్టిపండితులే వరింపబడి నను వారికి వంశాచార సాంప్రదాయ సిద్ధమగు రాజ్యాంగ పరిపాలనానుభవమే మాత్రము నుండదు. అట్టివారికే మంత్రిపదవులు మొదలగునవి జెందవలసియుండును. అపుడు వారేమిచేయగలరు? పాశ్చాత్య 'కింది' తా బేదారులవలన పరిపాలనా విధానము నభ్యసింపవలసిన

వారగుచుందురు అట్టిచో క్రిందితా బేదారులు జెప్పినట్లే మంత్రులు నడువవలసివచ్చును. అనుభవములేనివాడు బండినితోలవలసిన వాడైన యెడల గుఱ్ఱము లతని స్వాధీనమునందు నడవక స్వేచ్ఛగ జరించుననుట లోకవిదితము. బండియందున్న వారండఱును భయ సందేహప్రమాద కష్టనష్టములకు గుఱిగావలసివచ్చును. తఱచుగ ఆమంత్రుల కార్యదర్శులు మొదలగువారును అనుభవములేని క్రొత్త వారేర్పడు చుందురు. ఈ విధావమెట్లున్నదనగ.

ఉ॥ 'కానివాని నూతవగొని గానని వాడు విశిష్టవస్తువుల్ గానని భంగి'

అనెడి భాగవత పద్యార్థమును స్మరణకుదెచ్చుచున్నది. ప్రజలనబడు వారిలో బెక్కండ్రు విద్యాగంధపుశూన్యులగు మానవాకార మాత్రులే యగుటవల్లను, అట్టివారికి వోటుహక్కు అనెడి సమ్మతి నొసంగెడి యధికారముగలిగియుండుటవల్ల, వారు నీతి నియమములు లేక విచ్చల విడిగ జరించుచు యుక్తాయుక్తములు లేక ప్రభుత్వమును ధిక్కరించుచు, జెలరేగుచున్నారు.

శ్లో॥ మర్కటస్యమధోః పానం మధ్యేవృశ్చిక దర్శనం।
తన్మధ్యే భూతసంచారం యద్వాత్త ద్వా ద్భవిష్యతి॥

తా॥ కోతి కల్లు త్రాగియున్నది. దాని కపుడు తేలుకుట్టినది అందులో గ్రహము ప్రవేశించినది. అపుడాకోతి యెట్లుండునో అట్లు కాగలదు.

ముఖ్యముగ నీరాజ్యాంగ విధానమునందలి పరిపాలనాశాఖ లన్నిటియందును గల అన్ని యుద్యోగములయందును పారంపర్య క్రమబద్ధ సాంప్రదాయము, ననుభవము లేమాత్రములేని క్రొత్తవారు తఱచుగ జేరుట సంభవించుచుండుట వలన నిందెన్నియో నష్టకష్ట ములు దాపురించుచున్నవి.

దోషమంతయు నీరాజ్యాంగ విధానమునందే గలదు. దైవశాసన విరుద్ధమగు నీయధర్మ సిద్ధాంతము నిపుడు పండితులనబడువారు

సైతము నుత్తమధర్మముగ పరిగ్రహించి పూజించుచున్నారు.

ప్రజలు ప్రభువును వరించుట యనగ తాము అసమర్థులగుటవల్ల తమ రక్షణ పోషణములకై సమర్థుడగు వాని నాశ్రయించుటను నర్థము జెల్లునుగాని, నియమించుట అను అర్థము సెల్లదు. రాజుసహజశక్తి సంపన్నుడగు విష్ణ్వంశసంభూతుడని వేదశాస్త్రములు నుడువుచున్నవి. ప్రభువగువాడు తనసహజ ధీరోదాత్త లక్షణములచే ప్రజలనాకర్షించి వారికి తనయందు భయభక్త్యను రాగ విశ్వాసములను గలిగించి వారిసేవల నందుకొనుచు వారిని పాలించవలయును.

పంచమవేదమనబడిన భారతము నందిట్లుగలదు.

క॥ రాజునకు ప్రజ శరీరము। రాజా ప్రజకు నాత్మగాః రాజును ప్రజయును॥
రాజోత్తమ యన్యోన్యవ్యని। రాజితుకైయుండవలయు రక్షార్చనలన్॥

ప్రజలు ఇంద్రియములు ప్రభువు మనస్సువంటి వారైయున్నారు. మనస్సును సేవించుచు నింద్రియములు వర్తించుచుండవలయును. ఇంద్రియములును నియమించి పోషించుశక్తి మనస్సున కుండవలయును. మనస్సు ఇంద్రియములకు ప్రభువని శాస్త్రము నుడువుచున్నది.

శ్లో॥ ఇంద్రియాణాంహిచరతాం యన్మనోను విధీయతే।
తదస్యహరతి ప్రజ్ఞాం వాయుర్నావమి వాంభసి॥ గీత—౨—౬౭

తా॥ స్వేచ్ఛగ విహరింపబోయెడి యింద్రియములను ఏ మనస్సు నియమింపజాలదో అది నీటియందు గాలి ఓడను ముంచెడి విధమున జీవుని యానందమును హరించును.

పరిపాలనా విధానము నెంతగనో భగవద్గీత బోధించుచునే యున్నది. అందు భగవాను డిట్లు నుడువుచున్నాడు.

శ్లో॥ గీతాజ్ఞాన ముపాశ్రిత్యత్రీన్ లోకాన్ పాలయామ్యహం॥

తా॥ గీతాజ్ఞానము నాశ్రయించి నేను మూడు లోకములను పరిపాలించుచున్నాను.

నేటి ఈ ప్రజాప్రభుత్వ సిద్ధాంతము గీతాతత్వమునకు

పూర్తిగ విరుద్ధమైయున్నది. లోకమునందు అధర్మ మెంతవఱకుండునో అంతవఱకును శాంతియుండజాలదు. ఇంగ్లాండు అమెరికా మొదలగు దేశములయందీ ప్రజాప్రభుత్వ సిద్ధాంతము విజయవంతమై యున్నదని కొందఱు వచింతురు. అది జయాపజయములు పరికించుపారిలో గల భావభేదములతో నొప్పుచుండును. ఆ దేశముల యందిపుడు విషయభోగములెన్నియో బెఱిగియుండవచ్చును. కాని శాంత్యానందముల కా దేశములయందెంత మాత్రమును తావు లేదు. నేడవి యుద్ధజ్వాలలకును భయాందోళనములకును నివాస భూములుగ నొప్పుచున్నవి. త్రిదోషసంకరమగు సన్నిపాతరోగము వలన దృఢముగ లేచుట పరువెత్తుట ప్రసంగించుట మొదలగునవి గలిగియున్న, వానిని ఆరోగ్యవంతునిగ దలంచుట యవివేకము గదా!

అటుల కాదనినను ఆ దేశముల కిపుడు గలిగియుండిన భోగైశ్వర్యాదులు ఆ దేశములయొక్క యోగదశలవల్ల కాలానుగుణ్యముగ నేర్పడినవిగనే తలంపవలయును. భూగోళమందలి సర్వ దేశములకు గలుగుచుండెడి శుభాశుభ ఫలములకు ఖగోళమందలి నక్షత్ర గ్రహసంచారములు కారణములని జ్యోతిశ్శాస్త్రములు నుడువుచున్నవి.

శ్లో॥ నక్షత్ర త్రయవర్గై రాగ్నేయాద్యైర్వ్యవస్థితైర్నవధా।
భారతవర్షే మధ్యాత్ ప్రాగాది విభాజితా దేశాః॥ వారాహసంహిత॥

తా॥ కృత్తిక మొదలుకొని మూడేసి నక్షత్రములు ఒక్కొక వర్గముగ ఆకాశమునందుండిన యిరువదేడు నక్షత్రములు తొమ్మిది వర్గములుగ విభజింపబడియున్నవి. అటులనే భరతవర్షమునందలి సర్వదేశములు మధ్యభాగమున మొదలుకొని ప్రాగాదిగ తొమ్మిది ఖండములుగ విభజింపబడియున్నవి.

శ్లో॥ వర్గైరాగ్నేయాద్యైః క్రూరగ్రహపీడితైః క్రమేణ నృపాః।
పాంచాలో మాగధికః కాళింగాద్యా క్షయంయాంతి॥ వారాహసంహిత॥

తా॥ పైన ఆకాశమునందు తొమ్మిది వర్గములుగ నుండిన కృత్తికాది నక్షత్రములను క్రూరగ్రహములు సంచారవశమున నెప్పుడు పీడించునో క్రింద భూమియందు ఆ నక్షత్రముల క్రింద నుండిన పాంచాలము మాగధము కళింగము మొదలగు దేశములకును రాజులకు క్షయ మేర్పడును. యోగగ్రహములు ఏ నక్షత్రముల యందెప్పుడు గూడుచుండునో అపుడా నక్షత్రముల క్రిందనున్న ఆయాదేశములకు రాజయోగములు గలుగుచుండును.

భూగోళమునందు సర్వమానవులును నివసించుచుండెడి సర్వదేశములును గల కర్మభూమికి భరతవర్షమనిపేరు. అట్టి భరత వర్షమంతయును తొమ్మిది ఖండములుగ విభజింపబడియున్నది.

(1) మధ్యఖండము (2) ప్రాక్ఖండము (3) ఆగ్నేయఖండము (4) దక్షిణఖండము (5) నైరృతిఖండము (6) పశ్చిమఖండము (7) వాయవ్యఖండము (8) ఉత్తరఖండము (9) ఈశాన్యఖండము: ఈ చెప్పబడిన తొమ్మిది ఖండములయందు నేయేఖండములయందే యే దేశములున్నదియు, వారాహాసంహితయందు వివరముగ జెప్పబడినవి. వాని* నీక్రింద గనుబఱచుచున్నాను. ఈ శాస్త్రము

---

1. మధ్యఖండము:—

ఇది ఆకాశమునందలి కృత్తిక, రోహిణి మృగశిర నక్షత్రస్థానముల క్రింద నున్నది. ఈ ఖండమునందు 1 మధ్యదేశము, 2 భద్ర, 3 అరిశ్ఛేద, 4 మాండవ్య, 5 సాళ్వ, 6 నీప, 7 ఉజ్జిహాన, 8 సంఖ్యాత, 9 మరు, 10 వత్సఘోష, 11 యామున, 12 సారస్వత, 13 మత్స్య, 14 మాధ్యమిక, 15 మాథుర, 16 ఉపజ్యోతిష, 17 ధర్మారణ్య, 18 శూరసేన, 19 గౌరగ్రీవ, 20 ఉద్దేహిక, 21 పాండుగడ, 22 అశ్వద్ధ, 23 పాంచాల, 24 సాకేత, 25 కంక, 26 పురు, 27 కాలకోటి, 28 కుకుర, 29 పారియాత్ర, 30 నగ, 31 ఔదుంబర, 32 కపిష్ఠల, 32 హాస్తిన అనబడు దేశములున్నవి.

నందు వచింపబడియున్న దేశములపేర్లకును, ప్రకృతము వ్యవహారములో నుండిన దేశముల పేర్లెన్నియో విధములగు మార్పులనొందియున్నవి. ఈ పేర్లను పరిశీలించి బుద్ధిమంతులు, చారిత్రక పండితులును, ఈ మార్పులకు తగిన కారణములను దెల్పుదురని శాస్త్రీయ దేశనామములను ప్రకటించితిని. లోకమునందలి యీ దేశములకును, ఖండములకు నొకదాని నుండి

---

2. ప్రాఖ్ఖండము:—

ఇది ఆకాశమునందలి ఆర్ద్రి, పునర్వసు, పుష్యమి, నక్షత్ర స్థానములక్రింద నున్నది. ఇందు

1 అంజన 2 వృషధ్వజ 3 పద్మ 4 మాల్యవద్గిరి 5 వ్యాఘ్రముఖ 6 సూక్ష్మ 7 కర్వటి 8 చాంద్రపుర 9 శూర్పకర్ణ 10 ఖస 11 మగధ 12 మిథిల 13 శిబిరగిరి 15 సమతటి 15 ఓడ్ర 16 అశ్వవదన 17 దంతురక 18 ప్రాగ్జ్యోతిష 10 లోహిత్య 20 క్షీరోదసముద్ర 21 పురుషాద 22 ఉదయగిరి 23 భద్రగాడక 24 పౌండ్ర 25 ఉత్కల 26 కాశీ 27 మేఖల 28 అంబష్ఠ 29 ఏకపర 30 తామ్రలిప్తిక 31 కోశలిక మొదలగు దేశములున్నవి.

3. ఆగ్నేయ ఖండము:—

ఇది ఆశ్లేష, మఖ, పుబ్బ, నక్షత్ర స్థానములక్రింద నున్నది. ఇందున్న దేశాదులు

1 కోసల 2 కళింగ 3 వంగ 4 ఉపవంగ 5 జఠర 6 అంగ 7 శౌలిక 8 విదర్భ 9 వత్స 10 ఆంధ్ర 11 చేదిక 12 ఊర్ధ్వకంఠ 13 వృష 14 నాళికేర 15 చర్మదీప 16 త్రిపురి 17 శ్మశ్రుధర 18 హేమకూటి 19 వ్యాళగ్రీవ 20 మహాగ్రీవ 21 కిష్కింధ 22 కంటకస్థల 23 నిషాదరాష్ట్ర 24 పురిక 25 దశార్ణ 26 నగ్నపర్ణ 27 శబర 28 వింధ్యాచల ప్రాంతములు.

యొకదానిని వేరుపఱచుచు నైసర్గికమగు ప్రత్యేక వ్యక్తిత్వమును నిరూపించెడ సముద్ర నదీ పర్వతారణ్యాదులు భగవంతునిచే సృజింపబడియున్నవి. దేశములయొక్కయు, ఖండములయొక్కయు నైసర్గిక శీతోష్ణాది భేదములవల్ల ఆహార విహారాదులు సాంఘికాచారములు మొదలగునవి యొక్కొక్క దేశమునందొక్కొక్క విధముగ నొప్పుచుండును.

---

4. దక్షిణ ఖండము.

ఇది ఉత్తర, హస్త, చిత్త, నక్షత్ర స్థానములక్రింద నున్నది. ఇందు

1 లంక 2 కాలాజిన 3 సౌరికీర్ణ 4 తాలికటి 5 గిరినగిర 6 మలయ 7 దుర్దుర 8 మహేంద్ర 9 మరుకచ్ఛ 10 కంకట 11 టంకన 12 వనవాసీ 13 శిబిక 14 ఫణికార 15 కొంకణ 16 అభీర 17 ఆకార 18 వేణ 19 అవంతక 20 గోనర్ద 21 దశపుర 22 కేరల 23 కర్నాట 24 మహాటవీ 25 చిత్రకూట 26 నాసిక 27 కొల్లగిరి 28 చోల 29 క్రౌంచద్వీప 30 జటాధర 31 కావేరీ 32 ఋష్యమూక 33 వైడూర్య శంఖముక్తాకర 34 అత్ర్యాశ్రమ 35 వారిచర 36 ధర్మపురద్వీప 37 గణరాజ్య 38 కృష్ణవెల్లూర 39 పిశిక 40 శూర్పాద్రి 41 కుసుమనగ 42 తుంబవన 43 కార్మణేయక 44 దక్షిణ సముద్ర 45 తాపసాశ్రమ 46 ఋషిక 47 కాంచీ 48 మరుచీ పతన 49 చేయ 50 ఆర్యక 51 సింహళ 52 ఋషభ 53 బలదేవ 54 పత్తన 55 దండకావన 56 తిమింగిలాశన 57 భద్ర 58 కచ్ఛ 59 కుంజరదరీ 60 తామ్రపర్ణి దేశములున్నవి.

5. నైర్‌ృతి ఖండము.

ఇది స్వాతి, విశాఖ, అనూరాధ, నక్షత్రములక్రింద నున్నది. ఇందు

మానవుల కెటుల వారి వారి జాతకముల ననుసరించి కాలానుగుణ్యముగ శుభాశుభ దశా యోగఫలములు గలుగుచుండునో అటులనే గృహ గ్రామ మండల రాష్ట్ర దేశ ఖండాదులకును కాలాను

---

1 పహ్లవ, 2 కాంభోజ 3 సింధు 4 సౌవీర 5 బడబాముఖ 6 అవర 7 అంబష్ఠ 8 కపిల 9 నారీముఖ 10 ఆనర్త 11 ఫేణగిరి 12 యవన 13 భాకర 14 కర్ణప్రావేయ 15 పారాశర 16 శూద్ర 17 కుసుమనగ 18 కిరాతఖండ 19 క్రవ్యాద 20 ఆభీర 21 చుంచుక 22 హేమగిరి 23 సింధుకాలక 24 రైవతక 25 సురాష్ట్ర 26 బాదర 27 ద్రవిడాది దేశములున్నవి.

6. పశ్చిమ ఖండము.

ఇది జ్యేష్ఠ మూల పూర్వాషాఢ నక్షత్రములక్రింద నున్నది.

1 మణిమాన్ 2 మఘువాన్ 3 వనౌఘ 4 క్షురార్పణ 5 అస్తగిరి 6 అపరాంతక 7 శాంతిక 8 హైహయ 9 ప్రశస్తాద్రి 10 వొక్కాణ 11 పంచనద 12 రామఠ 13 పారీత 14 తారక్షిత 15 జృంగ 16 వైశ్య 17 కనక మొదలగు నవిందలి దేశములు.

7. వాయవ్య ఖండము.

ఇది ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ నక్షత్రములక్రింద నున్నది ఇందున్న దేశాదులు.

1 మాండవ్య 2 తుషార 3 తాల 4 హాల 5 మద్ర 6 అశ, మక 7 కులూతలహడ 8 స్త్రీరాజ్య 9 నృసింహావన 10 ఖస్త 11 వేణుమతి 12 ఫల్గులుక 13 గురుహ 14 మరుకుత్స 15 చమరంగ 16 ఏకవిలోచన 17 శూలిక 18 దీర్ఘగ్రీవములు.

8. ఉత్తర ఖండము.

ఇది శతభిష, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములక్రింద నున్నది. ఇందున్న దేశాదులు.

గుణ్యముగ శుభాశుభ ఫలములు గలుగుచుండును. మానవుని కెన్ని యంగములు గలవో గృహ గ్రామాదులకు నన్ని యంగములు గలవని వాస్తు శాస్త్రములు పేర్కొనుచున్నవి.

---

1 కైలాస 2 హిమవాన్ 3 వసుమాన్ 4 ధనుష్మాన్ 5 క్రౌంచ 6 మేరుగిరి 7 ఉత్తరకురు 8 క్షుద్రమీన 9 కైకేయ 10 వసాతి 11 యామున 12 భోగప్రస్థ 13 అర్జునాయన 14 అగ్నీధ్ర 15 ఆదర్శ 16 అంతర్ద్వీపి 17 త్రిగర్త 18 తురగానన 19 అశ్వముఖ 20 కేశధర 21 చిపిటినాసిక 22 దాసేరక 23 వాటిధార 24 సరధాన 25 తక్షశిల 26 పుష్కలావత 27 కైలావత 28 అంబర 29 భద్రక 30 మాళవ 31 పౌరవ 32 కచ్ఛార 33 దంతపింగలక 34 మాన 35 హల 36 హూణ 37 కోహాల 38 శీతల 39 మాండవ్య 40 భూతఆపుర 41 గాంధార 42 యశోవతి 43 హేమతార 44 రాజన్య 45 ఖచర 46 గవ్య 47 గాధేయ 49 దాసమేయ 49 శ్యామక మొదలగునవి.

9. ఈశాన్య ఖండము.

ఇది రేవతి, అశ్వని భరణి, నక్షత్రములక్రింద నున్నది. ఇందున్న దేశాలు.

1 మేరుక 2 నష్టరాజ్య 3 పశుపాల 4 కీర 5 కాశ్మీర 6 అభిసార 7 దరద 8 తంగణ 9 కులూత 10 సైరింధ్ర 11 వనరాష్ట్ర 12 బ్రహ్మపుర 13 దార్వదామర 14 వనరాజ్య 15 కిరాత 16 చీనా 17 కౌణింద 18 భల్లప 19 లోలజట 20 మరకునర 21 ఖస 22 ఘోష 23 కుచిక 24 ఏకచరణ 25 అనువిశ్వ 26 సువర్ణభ్రు 27 వసువన 28 పౌరవ 29 చీరనివసన 30 త్రినేత్ర 31 ముంజాద్రి 32 గంధర్వ మొదలగునవి.

ఆ వాస్తు విద్యావిషయ మీ క్రింద నుదహరించుచుంటిని.

* వా స్తు వి ద్యా *

శ్లో॥ యత్రచయేన గృహీతం విబుధైనాదిష్ఠిత స్సత్రైవ ।
తదమరమయం విధాతా వాస్తునరం కల్పయామాస ॥

వారాహ సంహిత॥

తా॥ నివాసార్థమై యెవనిచేత నెచ్చట నెంతభూమి గ్రహింపబడుచున్నదో యచ్చట దేవునిచేత ఆ వాస్తుమూర్తి ప్రతిష్ఠింపబడుచున్నాడు. బ్రహ్మదేవుడు ఆ దేవతామయుడగు వాస్తు పురుషుని కల్పించెను.

మానవుని యందెటుల 1 ఆత్మ 2 బుద్ధి 3 మనస్సు పది యింద్రియములుగా పదమూడు అవయవ భేదములు గలవో అటులనే ప్రతి గ్రామము నొక్కొక్క పురుష స్వరూపమై జాతులనబడు 13 అవయవములతో నొప్పుచున్నది.

మానవునియందుండిన యీ యంగములు ఆత్మానుసారముగ తమ తమ స్వధర్మములను చక్కగ జేయుచున్నయెడల మానవునికి సుఖానందము లెటుల సిద్ధించునో పురుష స్వరూపముగ నుండిన గ్రామమునకు అంగములుగ నుండిన పదమూడు జాతులును తమ తమ జాతి, ధర్మములను చక్కగ జేయుచుండిన యెడల గ్రామమునకు సుఖానందములు అటులనే సిద్ధించుచుండును.

* గ్రామమునకు ఆయకట్టు పద్ధతి *

పు రు ష స్వ రూ ప ము గ నుం డి న గ్రా మ ము న కు

| | | | |
|---|---|---|---|
| 1 | ఆత్మ — పురోహితుడు<br>జీవుడు — కరణము | | ఈ రెండును బ్రాహ్మణ జాతులు |
| 2 | బుద్ధి | — రెడ్డి లేక రాజు | — క్షత్రియజాతి |
| 3 | మనస్సు | — వర్తకుడు | — వైశ్యజాతి |
| 10 | ఇంద్రియములు | — శూద్రులు | — శూద్రజాతి |

మొత్తము పదమూడు అంగములు.

## * గ్రామ జాతి లక్షణము *

శ్లో॥ బృహస్పతి స్తుతేఖకావనీపతౌ కళాదకా ।
త్వయస్కారస్తు దారుకార కుంభకార రాత్రిపాః ।
క్షురీతు వస్త్రశోధకః ప్లవశ్చ చర్మకారకో ।
యథాక్రమంచ జాతిశ్చైవ గ్రామాణాగాత్ర విజ్ఞానాః
[వాస్తువిద్యా॥

తాత్పర్యము క్రింద తెలుపబడినది.

శ్లో॥ గృహనగర గ్రామేషుచ సర్వత్రైవం ప్రతిష్ఠితా దేవాః ।
తేషుచ యథానురూపం వర్ణవిప్రాదయో వాస్యాః ॥ [వాస్తువిద్యా॥

తా॥ గృహ నగర గ్రామాదుల యందంతటను వాస్తు పురుషుని శరీరావయవములయందు ఆ యా దేవతలు ప్రతిష్ఠింపబడు చున్నారు. గ్రామాదులయొక్క యే యే అంగములయందు యే యే జాతులు నివసింపవలయునో అటుల విప్రాది జాతులు వసింపవలెను.

పది ఇంద్రియములును గ్రామమునందలి పది జాతులు వానివివరము

ఇట్లు ప్రత్యేక వ్యక్తిత్వములతో నొప్పుచుండిన గృహ గ్రామ దేశ ఖండాదులకు ప్రత్యేకాచార సాంప్రదాయ భేదములున్నను,

1 వరాబు గ్రామమునందు కొలత తూకములు జేయువాడు
2 కంసాలి బంగారు పని చేయువాడు
3 కరుముల ఇనుము లోహముల పని జేయువాడు
4 వడ్ల చెక్క పనులు జేయువాడు
5 కుమ్మర కుండలు జేయువాడు
6 తలారి గ్రామమును రక్షించువాడు
7 మంగల క్షౌరాదులు జేయువాడు
8 చాకల వస్త్రము ఉతుకువాడు
9 మాల గ్రామ పరిశుద్ధి జేయువాడు
10 మాదిగ తోళ పనులు జేయువాడు

అవి యన్నియును సత్య జ్ఞానానంద రూపమగు ధర్మమును పోషించు నవిగ నుండవలయును.

శ్లో॥ చతుర్ణా మపివర్ణానా మాచారో ధర్మపాలకః ।
ఆచార భ్రష్టదేహానాం భవేద్ధర్మః పరాఙ్ముఖః ॥ [పరాశరస్మృతి॥

తా॥ చతుర్వర్ణములవారియొక్క ఆచారము, ఆనందరూపమగు ధర్మమును పోషించునదియై యుండవలెను. ఆచారమును విడచువారికి ధర్మము తిరుగు ముఖమగును.

* ఆచార లక్షణము *

శ్లో॥ యస్మిన్ దేశేయ ఆచార పారంపర్య క్రమాగతః ।
వర్ణానాం సాంతరాళానాం స సదాచార ఉచ్యతే ॥ [మనుస్మృతి॥

తా॥ అనేకములగు భేదములతో నొప్పుచుండిన అన్ని జాతులవారికి నే దేశమునందు నాచారము వంశపారంపర్య క్రమముగ నెడతెగక వచ్చుచున్నదో అది ఆజాతివారికి సదాచారమనబడుచున్నది.

శ్లో॥ ఆచార లక్షణోధర్మః సంతశ్చాచార లక్షణాః ।
సాధూనాంచ యథావృత్త మేత దాచార లక్షణం ॥
[అనుశాసనిక పర్వం॥

తా॥ ధర్మము ఆచారమే లక్షణము గలదియై యున్నది. ఆచారమే లక్షణముగ గలవారు సాధువు లనబడుదురు. సాధువులెట్లు వర్తించుచుందురో అదియే ఆచారమునకు లక్షణము.

సర్వ దేశములయందును యే జాతి యందున్న సాధువులు ఆ జాతివారికి ఆచారమును నిరూపించవలసినవారై యున్నారు. సాధువులనగ దయా సత్యజ్ఞానాదులు గలవారు. వారి ప్రవర్తనమే ఆ జాతికి సదాచారమైయున్నది.

ధర్మము సుఖరూపమైనది. ఆచారము దానిని వృద్ధిజేయునదియై యున్నది.

కొందఱు ఆచారమునకును, ధర్మమునకుగల భేదమును గుర్తింపక ఆచారమే ధర్మమనుకొనుచున్నారు.

ఇంగ్లాండమెరికా మొదలగు దేశముల యందిపుడున్న ప్రజాస్వామిక రాజ్యములను గాంచి మనము నట్టిదాని నెంతమాత్ర మభిలషింపరాదు. అనుకరణము ధర్మమునకు వ్యతిరేకమైనదిగ నుండరాదు.

ధర్మమూర్తియగు భగవంతు డన్ని దేశములకు నొక్కఁడేగలడు. భగవచ్ఛాసన మన్ని దేశములకు నొక్కటియేయై యున్నది.

ఆ దేశములయందిపుడున్న ప్రజాస్వామిక రాజ్యములైనను కలియుగముయొక్క అధర్మ ప్రాబల్యమువల్ల నేర్పడినవియేగాని సనాతన ధర్మబద్ధము లెంతమాత్రముగావు. మఱియు సర్వలోక ప్రభువగు భగవంతుడు సర్వలోకమును చాతుర్వర్ణ్యముగ సృజించితినని చెప్పియున్నాడుగదా! ఒక్క భరత ఖండమునందు మాత్రమే మొదటినుండియు బ్రాహ్మణాది చాతుర్వర్ణ్య జాతులును వారి ప్రత్యేక స్వరూప విధులును గనుపడుచున్నవియేగాని యితర దేశములయందిట్లుండినట్లు చారిత్రక నిదర్శనములైనను లేవు. ఇందులకు కారణమేమని కొందఱు సంశయించుచున్నారు. అట్లు సంశయింపబనిలేదు. చాతుర్వర్ణ్య వ్యవస్థ సర్వదేశములయందును గలదు. అది భరత ఖండమునందుండిన పేళ్లతో నుండకపోవచ్చును. దేశాచార సాంప్రదాయములు భిన్నములుగ నుండవచ్చును. చాతుర్వర్ణ జాతులును ప్రత్యేకములగు కర్మలును విధింపబడియున్నట్లు వారికి తెలియక పోవచ్చును. భరత ఖండమునందుండినంత స్పష్ట రూపములతో నుండక పోవచ్చును. కాని పాశ్చాత్య దేశములయందును ధర్మము నుపదేశించెడి సత్యజ్ఞానానంద స్వరూపులగు పోపులు అనెడి గురువుల వంశములును, వారు బోధించిన ధర్మముల ననుసరించి దేశమును పరిపాలించెడి రాజుల వంశములును, వారి ననుసరించి వర్తించెడి ధనిక

వ్యాపార వంశములును పై ముప్పురకు హితముగ ప్రవర్తించెడి కార్మిక వంశములును, వారి వారికి పారంపర్యముగ వచ్చుచుండిన ఆచార సాంప్రదాయ విధులును గలిగియుండినట్లు ఆ యా దేశ చరిత్రలు దెలుపుచున్నవి.

వర్తమాన కాలమునందన్ని దేశములయందును సాంకర్య మెంతయో గలిగి జాతులు భ్రష్టములైనవి. ఆ దేశముల యందిప్పటికే గుర్తించుటకును వీలుగాని విధమున జాతి భ్రష్టత గలిగియున్నది.

* భ ర త ఖ ం డ ప్ర శ స్తి *

భరతవర్ష మనెడి వేదపురుషునకు ఆత్మస్థానమున భరతఖండ మొప్పుచున్నది. కనుకనే యది యెల్లప్పటికిని ధర్మజ్యోతికి నిలయమై నిలసిల్లుచున్నది. సర్వదేశములయందును, వెలిగిన విజ్ఞాన దీపిక లన్నియును భరతఖండ దివ్యజ్ఞాన జ్యోతినుండియే జనించియున్నవనుట కెన్నియో చారిత్రక నిదర్శనములు గలవు.

భరత ఖండమునందు జనించిన తత్వజ్ఞాన సంపన్నులగు మహర్షులే సర్వ దేశములకును శాస్త్రకళా విజ్ఞాన భిక్ష నొసంగియున్నారు. భరత ఖండమునందుండిన నైసర్గిక పరిస్థితులను సూక్ష్మ దృష్టితో బరిశీలించిన యెడల సమస్త సంపదలకును సర్వ ధర్మములకును భరత ఖండము బీజ భూతముగ నున్నదని దెలియగలదు.

ధర్మజ్యోతి ప్రకాశము దూర దేశములయందు ముందు క్రమ క్రమముగ తగ్గుచు వచ్చినది. ఇపుడిచ్చటను క్షీణించుచున్నది. కాని భరతఖండము నందెప్పటికిని అది స్వరూపహాని నొందక బీజప్రాయముగ ధర్మముండగలదు. మఱియు ధర్మమంతటను వ్యాపించెడి సమయమే తెంచునపుడు యిందుండియే ధర్మము విశ్వవ్యాప్తము గావలయును. పిండాండమునందుండిన ఇడ పింగళ సుషుమ్నలవలె భరత ఖండము నందుండిన గంగా యమునా సరస్వతీ నదులు మూడును, జ్ఞాన కర్మ

భక్తియోగములను దైవాసుర బ్రహ్మ సంపత్తులను సద సద్వివేకములను సుఖదుఃఖానందములను పుణ్య పాప సమతా తత్వములను మూటిని బోధించుచున్నవి.

భరత ఖండమునందు త్రివేణీ సంగమ స్థానముగ బ్రసిద్ధి వహించిన ప్రయాగ క్షేత్రము త్రివిధ నిష్ఠలతో జీవుడు బ్రహ్మైక్యమును బొందెడి విధమును దెలుపుచున్నది. దయామయుడగు భగవంతు డన్నిలోకములయందును యుక్తసమయములయందు బ్రహ్మ ఋషులద్వారా ధర్మమును బ్రబోధించి లోకములు సంకరములు గాకుండ నడ్డుపడి ఎల్లప్పుడు ధర్మజ్యోతిని ప్రకాశింప జేయుచుండును.

ససేతుర్విధరణమేషాం లోకానామసంభేదాయ

సర్వలోకములను భగవంతుడు రక్షించి పాలించుగాక.

సర్వేజనాః సుఖినోభవంతు

శ్రీ కృష్ణార్పణమస్తు.

# * తప్పొప్పుల పట్టిక. *

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 4 | నాదో | నాథో |
| 1 | 5 | జిజ్ఞాసాః | జిజ్ఞాసా |
| 1 | 17 | పరామార్థము | పరమార్థము |
| 2 | 20 | ధారణో | ధారణా |
| 3 | 23 | ఆనుట | అనుట |
| 4 | 2 | నిరూపిచు | నిరూపించు |
| 4 | 18 | మొదలు 5 పేజీ 13 పంక్తివరకు తప్పు | |
| 5 | 16 | దాదులకు | ధాదులకు |
| 9 | 2 | లో అం-మొదలు 4 పంక్తిలో నొప్పుచున్నవి అనువరకు తప్పు | |
| 9 | 7 | అపంచ | ఆపంచ |
| 9 | 12 | ఇట్లుండు | ఇట్లు |
| 9 | 24 | అకాశము | ఆకాశము |
| 10 | 24 | లోకము మొదలుకొని గోచరమగు అనువరకు తప్పు | |
| 11 | 8 | రసములుకు ముందు రూప చేర్చవలెను. | |
| 12 | 6 | అగ్నెన | అగ్నినా |
| 12 | 16 | త్వంద్రియ | త్వగింద్రియ |
| 13 | 12 | పాణియనియు -పైన- అగ్నియుక్తము పాదమనియు చేర్చవలెను. | |
| 13 | 20 | అట్టి | |
| 13 | 22 | ఆస్థానే | అస్థాన |
| 16 | 12 | గోవతము | గోవత్సము |
| 16 | 14 | వశంసను | ప్రశంసను |
| 17 | 3 | ముమూత్ర | |

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 17 | 4 | రాదినవ | టాదినవ |
| 18 | 9 | కర్తనుగ | అకర్తనుగ |
| 18 | 19 | అను సమాసమును | అని |
| 19 | 9 | నహ్వోం | బహ్వీం |
| 19 | 16 | తేజోబలముగ | తేజోరూపముగ |
| 22 | 23 | సహోకారము | సహకారము |
| 23 | [25-26] | పంక్తులు తప్పు | |
| 24 | 1 | ఇట్టి అజ్ఞానమూర్తిని తప్పు | |
| 26 | 6 | మగును | మగు |
| 27 | 1 | జానము | జ్ఞానము |
| 27 | 22 | చిన్హా | చిహ్నా |
| 27 | 33 | చిన్హా | చిహ్నా |
| 27 | 24 | చిన్హా | చిహ్నా |
| 29 | 16 | 31 ముప్పది ఒకటి | 3–1 మూడు ఒకటి |
| 30 | 10 | ముందుండు | ప్రక్కనుండు |
| 30 | 26 | లజ్ | లణ్ |
| 33 | 7 | మానవునందు | మానవులయందు |
| 34 | 1 | వేదస్వరూ | దేవతా స్వరూ |
| 39 | 4 | స్కాంధ | స్కాండ |
| 43 | 9 | అమంత్రము | ఆమంత్రము |
| 45 | 5 | మూర్ధావస్థయు | మూర్ధావస్థయే |
| 47 | 3 | అధికారులలో | అధికారులో |
| 48 | 14 | హాసయజ్ఞేః | సహయజ్ఞాః |
| 50 | 14 | మానవాః | మానవః |
| 52 | 12 | తృప్తి | తృప్తి |
| 62 | 1 | గాక | గాన |

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 62 | 13 | ప్రత్యేకము | ప్రత్యక్షము |
| 68 | 13 | దైవిక పక్షమునను | దైవము |
| 68 | 23 | క్చాష్టాః | క్లేష్టాః |
| 79 | 19 | టాకీరాళ్ళ | టాకీరీళ్ళ |
| 83 | 8 | ద్విజవర్గమునకు జెంది | |
| 83 | 9 | లకును శూద్రులకును చేర్పు | |
| 90 | 8 | శంకరా | శంకర |
| 94 | 24 | అదే దేవుని | ఆదేవ దేవుని |
| 101 | 5 | మహార్తి | మహార్ధి |
| 104 | 9 | లింగాద్దేవాయత | లింగార్చాయతనానాం |
| 106 | 11 | లపుడు | లిపుడు |
| 107 | 21 | కనుక | |
| 108 | 20 | కలిగినట్లే | కలియునట్లు |
| 111 | 15 | కలియుచుండినను | కలిగియుండినందున |
| 114 | 5 | యందే | యందు |
| 114 | 17 | శౌచము | మశౌచము |
| 115 | 24 | విధియగును | లక్షణమగును |
| 120 | 8 | ఆదేశము | ఆవేశము |
| 120 | 10 | అహార | ఆహార |
| 120 | 21 | అచ్చటి | అచ్చట |
| 123 | 19 | విషయములు | ద్రవ్యమును |
| 134 | 2 | నిరూపించెడ | నిరూపించెడి |
| 139 | 12 | నాచారము | యేయాచారము |
| 140 | 1 | భేనము | భేదము |
| 140 | 19 | చాతుర్వర్ణ | చాతుర్వర్ణళి |

---

* ఈ గ్రంధములు పలయువారు.

శ్రీయుత పాణ్యాం లక్ష్మీ నరసింహయ్యగారు.

ఉయ్యాలవాడ.

కోయిలకుంట్ల తాలూకా.

(కర్నూలు జిల్లా.)

అని వ్రాయవలెను.

---


కర్నూలు జైహింద్ ముద్రాక్షరశాలయందు ముద్రించ బడినది.